శ్రీ

# వేతాళపంచవింశతిక.

## ఉపోద్ఘాతము.

పూర్వము మాళవదేశములో నుజ్జయినీనగరము రాజధానిగా విక్రమార్కుఁడను రాజు ఏలుచుండెను. ఆతని సభకు ప్రతిదినమును దేవార్థము క్షాంతిశీలుఁడను పేరి శ్రమణకుఁ డొకఁడు వచ్చి పం డొకటి కానుకఁ బెట్టుచుండెను. ప్రతిదినము రాజు అట్లు పండు గయికొని చెంతనుండు బొక్కసగాని చేతి కిచ్చుచుండెను. ఇట్లు పదిసంవత్సరములు గడచినవి. అంతట నొకనాఁడు భిక్షువు పం డిచ్చి పోయినతర్వాత ఆటకోఁతిపిల్ల యొకటి కావలివారి చేతినుండి తప్పించుకొని లోనకడుగు రాఁగా, రాజు దానికిఁ బం డిచ్చెను కోఁతిపిల్ల దానిం దినుటకు పగుల్పఁగా అందుండి వెలలేని రత్న మొకటి క్రిందఁబడెను. దానిం గని కైకొని రాజు భాండాగారికునికిం బిలిపించి 'ఓయి, ఆసన్యాసి నిత్యము నిచ్చుచుండినపండ్లు నీచేతి కిచ్చుచుంటినే అవి యేవి!' అని యడిగెను. ఆతఁడు భయముతో, 'దేవా! వానిని తలుపు

తీయకయే నేను దిడ్డిదారిని బొక్కసపుటింటిలో వేయుచుంటిని. ఇపుడు దేవరయాజ్ఞయేని తలుపు తెఱచి చూచెదను.' అని విన్న వించెను. అందులకు రాజు అంగీకరింపఁగా కోశాధ్యక్షుఁడు పోయి క్షణములో మరల వచ్చి 'దేవా, ఆపండ్లు కుళ్లిపోయి నవి, అవి యగపడలేదు గాని యిపు డచ్చోట గొప్ప రత్నాల ప్రోవు జ్వలించుచున్నది' అని విన్నవించెను. విని సంతసించి రాజు ఆమణులు ఆకోశరక్షకుని కిచ్చెను.

మఱునాఁడు భిక్షువు వచ్చి పండు కానుకపెట్టఁగా, రాజు అతనితో 'ఓభిక్షూ, ప్రతిదినము నిట్లు ధనము వ్యయించి నన్నుఁ గొలిచెదవేల? కారణము చెప్పవఱకు ఇపుడు నీఫలము నేనుఁ గ్రహింపను' అనెను. భిక్షువు రాజుతో ఏకాంతమున 'రాజేంద్రా, వీరునిసాయము కావలసిన మంత్రసాధన మొకటి నాకుఁ గలదు. అందులకు వీరశ్రేష్ఠుఁడవు నీవు నాకు సాయ మొనర్తు వని నా ప్రార్థన.' అని విన్నవించెను. రా జందుల కంగీకరించెను. 'అట్లయిన రాఁగల కృష్ణచతుర్దశి రాత్రి ఈయూరి పెద్దవల్లు కాటిలోని మఱ్ఱిచెట్టుక్రింద నే నుందును, అచటికి నీవు వచ్చి నా కెలుకపఱుచుకొనవలయును.' అని శ్రమణుఁడు వక్కాణించెను. అట్లే చేసెద నని రాజు ఒప్పుకొనెను. అంతట క్షాంతిశీలుఁడు సంతసించి తనతావునకుం బోయెను.

కృష్ణచతుర్దశినాఁడు విక్రమార్కుఁడు భిక్షువున కిచ్చిన మాట జ్ఞప్తి చేసికొని రాత్రి నల్లవస్త్రములు దాల్చి, చీఁకటి మ్రాని పువ్వులు సిగం జుట్టుకొని, కత్తిని కేలం గొని రాజధాని వెలువడి, శ్మశానంబు చొచ్చి, వెదకి యాభిక్షువును మఱ్ఱిచెట్టు క్రింద మండలన్యాసము సేయుచున్న వానిఁ గాంచి, తఱియం జని 'భిక్షుఁడా, ఇదె వచ్చితిని, నీ కేమి చేయవలయును చెప్పుము.' అని యడిగెను. ఆమాట విని భిక్షువు రాజుం గని సంతసించి 'రాజా, ఏయసూపుదువేని, ఇటకు దక్షిణముగా దూరమున ఒంటిగా నొక యిరుగుడువృక్షముున్నది. అందు ఉరిఁ దివియఁగా చచ్చిన మగశవ మొకటి వ్రేలుచున్నది. ఓ వీరాగ్రణీ, దానిని మౌనంబున ఇటకుఁ దెత్తువేని నా కుపకార మగును.' అనెను. రాజు వల్లె యని మంటుచున్న సొదకొఱవి యొకటి దివ్వటిగా కేలఁగొని, యంధకారములో దక్షిణాభిముఖుఁడై పోయి, ఎట్లో యా యిరుగుడువృక్షంబు గన్గొని, దాని పలవనుండి వ్రేలుచున్న పీనుంగుం గని, చెట్టెక్కి త్రాడు తెంచి క్రిందఁబడవైచెను. పడుచునే యా శవము నొప్పి తగిలినది వోలె ఏడ్వం దొడంగెను. రాజు చెట్టు దిగి వచ్చి ప్రాణ మున్నదో యని కనికరముతో దాని దేహమును తడవెను. అంత నది బొబ్బనవ్వు నవ్వెను. అంతట రాజు దానియందు బేతాళుఁడు ప్రవేశించియున్నాఁ డని యెఱింగి బెగ్గడిల్లక దానిని 'ఏల నవ్వెదవు ? పోదము రమ్ము.'

అని పిలుచునంతలో నది భూమిమీఁద మాయమై ఎప్పటివలెనే చెట్టున వ్రేలుచుండెను. రాజు మఱల చెట్టెక్కి దానిని దించెను. ధీరపురుషుల చిత్తములు వజ్రముకన్నం గఠినములు గదా. బేతాళుఁడు పూనియున్నయా శవమును మరల బుజమునఁ బెట్టుకొని విక్రమార్కుఁడు శ్మశానంబున నడువసాగెను. బుజముమీఁదిపీనుఁగునం దున్న బేతాళుఁడు ఇట్లనియె:— రాజా, దారియలఁత తెలియకుండ నొక కథ చెప్పెదను వినుము.



శ్రీ

# వేతాళపంచవింశతిక.

కథ—౧.

పూర్వము కాశీపురమును ప్రతాపముకుటుఁడను రాజు ఏలుచుండెను. అతని సుతుఁడు వజ్రముకుటుఁడు. ఆకుమారుఁడు రూపముచే కామునికి, శౌర్యముచే శత్రువులకును, గర్వభంగ మొనర్చుచుండెను. అతనికి మంత్రికుమారుఁడు మహామతి బుద్ధిశరీరుఁడనునాతఁడు ప్రాణాధిక మిత్త్రుఁడుగా నుండెను. ఒక నాఁడు రాజకుమారుఁడు మంత్రిపుత్త్రునితోఁ గూడ వేడుకగా వేఁటకు బయలుదేఱి ఆ తమకముచేత అడవిలో మిక్కిలి దూరము ఏఁగి అచట సింగములతలలను బాణములతో తెగ వేయుచు, కాఱడవిలో మిగుల లోఁతునకుఁ బోయి, ఒకచోట, కోకిల బట్టులు కైవారములు సేయుచుండ, వృక్షములు పూ రెమ్మలంజామరలు వీచుచుండ, మదనుని సభం బోలిన యా నట్టడవిలో, చిత్ర విచిత్రము లయిన తామరలతోఁడి సరోవర మొకటి తానును మంత్రిపుత్త్రుండును గాంచెను.

అపుడే ఆసరస్సునకు దివ్యరూప ఒకకన్య సపరివార యై జలకమాడ వచ్చి, తన దేహకాంతి ప్రవాహముచేత చెఱువు

నిండించుచు, చూపులచే క్రొత్త తామరగుబురుల సృజించుచు, నిండుచందురుని గెలిచిన నెమ్మోముచేత నేత్రములను బిత్తరపుచ్చుచు, రాజపుత్త్రుని మనస్సును క్షణములో హరించెను. అతఁడును నిముసములో నామెకన్నుదోయిని హరించెను. ఈమె ఎవతెయో యని రాజకుమారుండును మంత్రికుమారుండును పరికించుచుండఁగా, నామె తన యూరు పేరు లోనగువానిం దెల్పుటకు ఒయ్యారంపునెపంబున నిట్లు సన్నలు చేసెను.—సిగదండనుండి కలువం దివిచి చెవిం జెరివెను, విలంబముగా పలుదోమెను, తామరపూవొకటి యెత్తి యూరువులం దాల్చెను, సాభిప్రాయముగా ఎదం గేలు సేర్చెను.—రాజకుమారుఁడు ఆసన్నలను గ్రహింప లేదు. అతనిమిత్త్రుఁడు బుద్ధిశరీరుఁడు గ్రహించెను. క్షణములో నా కన్య పరజనులు కొనిపోవ నటనుండి వెడలిపోయెను. ఇల్లు సేరి యామె మేనిని మంచమున వైచి, యుల్లమును రాజకుమారునిమీఁద నునిచి, వేఁగుచుండెను.

రాజపుత్త్రుండును ఆమె లేక ఎట్టకేలకు తననగరి కేఁగి, విద్యం గోలుపోయిన విద్యాధరుఁడువోలె చెప్పరాని యవస్థను పాలాయెను. మంత్రికుమారుఁడు అతనియవస్థం గని ఏకాంతంబున నడిగి యెఱిఁగి ఆ చెలువ దొరకక పోదని పలికెను. అంతట వజ్రముకుటుఁడు మిత్త్రునితో 'మిత్త్రమా, ఆకన్నియం గూర్చి మనకు ఊరు గాని పేరు గాని కులము గాని తెలియదాయెను. దొరకు టెట్లు. ఏమి నన్ను హాళికిఁ యూరడిం

పుల పాలు సేసెదవు?' అనెను. బుద్ధిశరీరుఁ డనియె:—'దేవా, ఇట్లనన నేల? ఆమె యది యెల్ల సన్నలం దెలుపుట నీవు గన లేదా? ఆమె చెవిపై కలువ నిడికొన్నదిగదా, దాన నీకు కర్ణోత్పలరాజురాజ్యములో తన నివాస మని తెల్పినది; దంత సంస్కారముచేత తనతండ్రి దంతఘాటకుఁ డని సూచించినది. పద్మమును శిరమున తాల్చి తనపేరు పద్మావతి యని తెల్పినది. ఎడదం కయి యుంచుటచే దన ప్రాణములు నీ యధీనము లని చెప్పినది. కళింగదేశములో ప్రసిద్ధుఁడు కర్ణోత్పల మహారాజ ఉన్నాఁడు. ఆయనకు అనుగ్రహపాత్రము దంతఘాటకుఁ డని సేనాపతి యున్నాఁడు. అతనికి ప్రాణములకంటె ప్రియ పుత్రిలో క్యరత్నము పద్మావతి యని యొక కూఁతురు కలదు. ఆమెను ఆ రాజు కొడుకు కోరి యున్నాఁడు. ఈవృత్తాంతము లోకుల వలన సరిగా నీవు నెఱింగి యున్నావు గదా. దానింబట్టి ఆమె దేశము ఊరు వంశము పేరు లోనగువానిని తెల్పినసన్నలను నేను గ్రహించితిని.' ఇట్లు బుద్ధిశరీరుఁడు పలుకఁగా రాజతనయుఁడు అతని బుద్ధికి మెచ్చి ఉపాయ మగపడినందులకు సంతోషించెను.

మఱి యతనితో నాలోచించి వేటనెపమున అతనిం దోడ్కొని వెడలి ప్రియకై ఆదిక్కుగానే పోయెను. నడిదారిని సిబ్బందిని ఏమార్చి గాలివడిగల తమగుఱ్ఱములను ఎగఁదోలుకొని యిరువురును కళింగదేశమునకుఁ బోయిరి. అచట కర్ణోత్పలరాజునగరము చేరి, దంతఘాటకునియిల్లు కనిపట్టి, ఆ చెంత

నొక ముసలమ్మ యింట బస చేసిరి. గుఱ్ఱములకు నీళ్లు పెట్టి గడ్డి వేసి, చాటుగా నొక చోట భద్రముగా కట్టి వేసి, రాజపుత్త్రుఁ డుండ, మంత్రిపుత్త్రుఁడు వృద్ధను 'అమ్మా, ఇక్కడ సేనాపతి దంతఘాటకుఁ డని యున్నాఁ డఁట యెఱుఁగుదువా?' అని యడిగెను. ఆమె విని శ్రద్ధతో నిట్లనియె:—'ఉన్నాఁడు, నే నెఱుఁగుదును. నే నతనింటిదానిని, ఇపుడు అతఁడు నన్ను తన కూఁతుకు పద్మావతికి పెద్దతోడుగా నియమించి యున్నాఁడు. నేను అచటికి తఱుచుగా పోవుట లేదు. ఏలన, నాకు మంచి వస్త్రము లేదు; నావస్త్ర మగపడిన, నాకుమారుఁడు దుష్టుఁడు జూదగాఁడు హరించును' అంతట మంత్రిపుత్త్రుఁడు ముసలిని తన యుత్తరీయ మిచ్చి తనియించి, "అమ్మా, నీవు తల్లివి గాన నీతో నొక రహస్యము చెప్పెదము, దానిని మాకు నెఱవేర్పుము. దంతఘాటునికూఁతురు పద్మావతికడకుఁ బోయి 'నీవు చెఱువు నొద్ద చూచిన రాజకుమారుఁ డిట వచ్చియున్నాఁడు, అతఁడు తన్ను ప్రేమ మీఱ నీకుఁ దెల్పు మని నన్ను నీకడకుఁ బంపినాఁడు.' అని చెప్పుము." అని యడిగెను.

ఈవికి లోఁబడి ముదుసలి యొప్పుకొని పద్మావతి కడకు పోయి క్షణములో మఱల వచ్చి వారితో నిట్లు వచించెను 'నేను పోయి రహస్యముగా మీ రాక నెఱింగించితిని. ఆమె విని కోపగించి బెదరించి రెండు చేతులకును కర్పూరంపు బొడుమును పూసికొని యా చేతులతో నా రెండు చెంపలు

వాయిం చెను. ఆయవమానమునకు కోపగించి నేను ఇంటికి వచ్చితిని. ఇవిగో కపురంపుఁ బ్రేళ్లు పదియు నా మొగమున తెల్లగా అచ్చుపడి యున్నవి చూడుఁడు' ఇట్లు ముదుసలి పలుకఁగా ఆశ యుడిగి వెగ్గలిన రాజకుమారుం గని బుద్ధిశరీరుఁడు ఏకాంతమున, 'మిత్త్రమా, చింతింపకు, గుట్టు గాచికొనుచున్నది యేకాన్య యిట్లు బెదరించి కపురంపుఁబూసిన వ్రేళులు పదియును ముసలిదాని మొగమున కంటించినది: అంతలి యభిప్రాయమును గంటివా? ఈశుక్లపక్షమున వెన్నెలగల యీ పదిరాత్రులును గడపుఁడు, ఇవి సంగమమునకు పనికి రావు, అని యర్థము' అని చెప్పి యోదార్చెను. అనంతరము మంత్రికుమారుఁడు చేత నున్న బంగారము కొంత రహస్యముగా బజాఱులో అమ్మి కావలసిన ధన మిచ్చి ముసలమ్మచే నుత్తమభోజనము సిద్ధము సేయించుచు ఇరువురును ఆమెతోఁగూడ భుజించుచుండిరి. పదిదినములైన యంతట మఱల నెఱుంగఁగోరి పద్మావతికడకు మంత్రిపుత్త్రుఁడు ముసలివానిని పంపెను. మంచి యన్నపానములకు ఆసించి ముసలిది మఱల పద్మావతికడకేఁగి వెంటనే వచ్చి యిట్లు తెలిపినది.—

ఈమాఱు ముసలమ్మను పద్మావతి గౌరవించి భుజింప జేసి పానాదిక్రీడల నటనే పగ లంతయు నిలుపుకొన్నది సంజ వేళ ముసలిది ఇంటి కేఁగ సెల వడుగు నంతట, అట బయట మదపుటేనుఁ గొకటి కట్టుకంబము నూడఁ బెఱికికొని విడఁబడి అగపడినవారినెల్లఁ ద్రొక్కుచు వచ్చుచున్న దని కోలాహలము

వినఁబడెను. అంతట పద్మావతి ముసలిదానితో 'అవ్వా, వీథిలో ఏనుఁగు విడఁబడి యున్నది, ఆ దారిని నీవు పోవుట సరి గాదు. నిన్ను పీఁటపైఁ గూర్చుండఁ బెట్టి యీ కిటికీనుండి త్రాళ్లతో క్రిందితోఁటలోనికి ఈ చేడియలు దించెదరు. ఉద్యానములో చెట్టెక్కి, చెట్టునుండి ప్రాకార మెక్కి, ప్రాకారమునుండి బయటి చెట్టెక్కి, బయట దిగి, యింటికి పొమ్ము.' అని చెప్పి, యట్లే పంపెను. ముసలిది యిల్లు చేరి వారికి వృత్తాంతమును సమస్తమును త్రాటిపీఁట దారిలోఁ గూడ వివరించెను. అంతట మంత్రిసుతుఁడు రాసుతునితో 'నీ కోరిక ఇన్నాళ్లకు తీఱినది. ఆమె నీరాకకు దారిఁగూడ యుక్తిగా తెలిపినది. ఈ దినమే రాత్రి రాఁగానే, ఆ తోఁటదారినే పోయి, త్రాటిపీఁట మీఁదుగా నీచెలినగరు చేరుము.' అని చెప్పెను.

అట్లే రాజకుమారుఁడు రాత్రి మంత్రికుమార సహితముగా ఆ ప్రాకారమార్గముగం బోయి, ఉద్యానములో కిటికీనుండి త్రాటితోడిపీఁట వ్రేలు చుండుటయు, చేడియలు కిటికీలోనుండి ఎదురు సూచు చుండుటయుం గాంచి, పీఁట యెక్కెను. అంతట చేటికలు కిటికీలోనికి చేదుకొనిరి. రాజకుమారుఁడు పద్మావతియంతిపురిం జొరఁగాఁజూచి, మంత్రికుమారుఁడు ఇంటికి పోయెను. అచట నిండుచంద్రునివంటి నెమ్మోముతో తేజరిల్లుచున్న యాపద్మావతిని రాజసుతుఁడు గాంచెను. ఆమెయు నతనిం గని లేచి పెక్కుదినముల విరాళికి తగినయట్లుగా నాతనిని కంఠా

ఱింగ నా ద్యుపచారముల చేత సమ్మానించెను. అట నామెను
రాజకుమారుఁడు గాంధర్వ విధానమున వివాహమాడి యటనే
గుప్తముగా కొన్నాళ్లు ఉండి, ఒకనాఁడు రాత్రి పద్మావతితో
'ప్రియా, నాతోఁగూడ ఈపురికి మంత్రికుమారుఁడు నాసఖుఁడు
వచ్చి యున్నాఁడు, అతఁడు నీ దద్దలోఁడు ముసలమ్మ యింట
ఇన్నాళ్లు ఒంటరిగా నున్నాఁడు. నేను పోయి అతనిం గాంచి
తేపు మఱల వచ్చెదను.' అని చెప్పెను. ఆ మాట విని మలఁ
కలమారి పద్మావతి 'ఆహా! ఆర్యపుత్త్రా, ఆ నాసంజ్ఞలను నీవే
తెలిసికొంటివా, అతఁడు తెలిసికొని నీకు చెప్పినాఁడా?' అని
యడిగెను 'అవి నాకు బోధపడలేదు, సర్వము మహాబుద్ధి
యతఁడే కనిపట్టి నాకు వివరించినాఁడు.' అని రాజకుమారుఁడు
పల్కెను 'అట్లని ఆర్యపుత్త్రా, ఇంతకాలము అతనిమాట నీవు
నాకు తెల్పకుండుట న్యాయము గాదు. నీమిత్త్రుఁడు గాన నతఁడు
నా యన్న, ముందుగా నతనికి తాంబూలదానాదిసత్కారము
చేయవలసియుండెను గదా?' అని పద్మావతి వాక్రుచ్చి యంగీ
కరించి పంపఁగా, రాజకుమారుఁడు ఆరాత్రియే మునుపటి
దారినే యింటికి మిత్త్రునికడకుం బోయెను. అచ్చట మాటల
సందున రాజకుమారుఁడు 'సన్నలను' మంత్రికుమారుఁడు వివ
రించెన'ని తాను పద్మావతితోఁ జెప్పినమాటను తెలియఁ జేసెను.
'అట్లు చెప్పియుండరాదు' అని మంత్రికుమారుఁడు పలికెను.

ఇంతలోఁ దెల్లవాఱఁగా నిరువురును సంధ్యావందనాదికములు సల్పి, యుబుసులాడుచుండఁగా, పద్మావతిచెలికత్తె పక్వాన్నతాంబూలములు కొని వచ్చి, మంత్రిపుత్త్రుని కుశలం బడిగి, మంచిమాటలు పలికి, రాజపుత్త్రునిభోజనమును నివారించున ట్టై, అతనిని పద్మవతి భోజనార్థ మెదురు సూచుచున్నదని, మాటలవరుసను చెప్పి, సెలవు వడసి పోయెను. అంతట బుద్ధిశరీరుఁడు వజ్రముకుటునితో 'వింత యొకటి చూపెదను చూడు మ'ని చెప్పి, ఆపక్వాన్నములోని భక్ష్య మొకటి కుక్కకు వేసెను. దానిం దిని యది చచ్చెను. ఏమి యీ యద్భుత మని రాజపుత్త్రుఁ డడుగ మంత్రికుమారుఁ డనియె:— 'సంజ్ఞలను గ్రహించితిని గాన ధూర్తుఁడ నని యామె నన్ను చంపఁగోరి నాకు ఈవిషాన్నము పంపినది; ఇందులకు నీమీఁది మరులే కారణము. నే నున్నయెడల నీవు తదేకాగ్రముగా ఆమెకు వశపడ వనియు, నావశమునం బడి యామెను వదలి మననగరమునకుఁ బోయెద వనియు, నా మెతలంపు కావున నీ వామెపైఁ గినియకుము. బంధులనుండి విడఁదీసి ఆమెను మనము హరించి మనయూరికిం గొనిపోవుదము. అందులకు నేను యుక్తి చెప్పెదను, అట్లు సేయుము.' ఆమాట విని యాశ్చర్యపడుచు రాజపుత్త్రుఁడు 'వాస్తవముగా నీవు బుద్ధిశరీరుఁడవే' యని మంత్రికుమారుని పొగడెను.

అపుడు ఆకస్మికముగా వీథిలో రాజుకొడుకు బాలుఁడు మృతిఁబొందినాఁడని మొఱ యొకటి వినఁబడెను దానిని విని మంత్రికుమారుఁడు సంతస మొంది రాజకుమారునితో 'బళిబళి' ఈ రాత్రి యథాప్రకారము పద్మావతియింటికిం బొమ్ము ఆమెను చచ్చినదానివలె కదలిక లేక ఒడలెఱుంగక పడిపోవునట్లుగా సారాయి త్రాగింపుము. ఆ ట్లామె నిద్రలో మునింగియున్న తఱిని శూలమును నిప్పునఁ గాల్చి, దానితో నామె మొలలో గుర్తువేసి ఆమెనగ లెల్లం గొని గవాక్షమార్గమున త్రాటిపేఁట యుయ్యాలలో వెలువడి, రాత్రియే ఇంటికి నాకడకు రమ్ము; అటుపై మేలు గలుగు నాలోచన నాకుఁ దెలియును. అని పల్కి, ఏదుపందిముండ్లవంటి మూఁడు మొనలతోడ శూలమును చేయించి రాకొమరునికి ఇచ్చెను. రాజకుమారుఁడు ఆ మున్మైనవాలును గయికొని మునుపటివలెనే రాత్రి పద్మావతి యింటికి పోయెను. ప్రభువులు తమమంత్రిమాటను అతిక్రమింపఁ గూడదు గదా. అట రాజకుమారుఁడు మద్యముతో నామెను నిశ్చేష్టం జేసి, శూలముం గాల్చి మొలపై వాతవేసి, ఆమె యొడలినగ లెల్ల నూడ్చుకొని, సఖునికడ కేఁగుదెంచెను అతనికి ఆభరణములు చూపి, చేసిన పని చెప్పెను. అంతట మంత్రి కుమారుఁడు తమ జతనము నెగ్గె నని తలంచెను.

తెల్లవాఱఁగానే మంత్రికుమారుఁడు రాకొమరుం దోడ్కొని శ్మశానమునకు పోయి, తాను తాపసవేషము దాల్చి,

అతనికి శిష్యవేషము వేసి, అతనిని నిట్లు నియోగించెను:—"ఈ యలంకరణములలోని యీ ముత్యాలహారమును గొనిపోయి బజారులో అమ్మఁజూపుము. ఎవ్వరుం గొనలేని యట్లుగా ఎక్కువ వెల చెప్పుచు, ప్రకటముగా దాని నెల్లరును చూచునట్లుగా చూపుచు, బజారులో తిరుగుము. తలవరులు పట్టుకొన్నచో భయపడక వారితో 'మాగురువు దీని నమ్ము మని నా చేతి కిచ్చినాఁడు' అని చెప్పుము." ఇట్లు బోధించి పంపఁగా రాజకుమారుఁడు అట్లే బజారునకుం బోయి అచట ముత్యాలపేరును ప్రకటముగా నమ్మఁజూపుచుండెను. తలారులు పంతఘూటుని కొమారితనగలు ముచ్చిలిన దొంగను వెదకుచు, ముత్యాలపేరుతోడి యీతనిం బట్టుకొని, వెంటనే కొనిపోయి, కొత్వాలు మ్రోలం బెట్టిరి తాపసవేషు నతనింగాంచి కొత్వాలు మంచి మాటగా 'స్వామీ, తమకు ఈముత్తెపుఁబేరు ఎట్లు వచ్చినది? ఇది రాత్రి దొంగలు హరించిన పంతఘూటకుని కొమారిత నగలలోనిది.' అని అడిగెను. అందులకు తాపసాకృతి నున్న రాకొమరుఁడు 'దీనిని నాగురువు నాచేతి కిచ్చినాఁడు: వచ్చి, యాయన నడుగుఁడు.' అని యుత్తర మిచ్చెను. అంతట కొత్వాలు తాపసవేషధారి యగు మంత్రికుమారుని కడకు వచ్చి 'స్వామీ, యీ ముత్తెపుఁబేరు మీ శిష్యుని చేతికి ఎట్లువచ్చినది?' అని యడిగెను.

అంతట కపటతాపసుఁడు ఏకాంతము చేసి కొత్వాలుతో ని ట్లనియె:— 'అయ్యా, నేను తాపసుఁడను, ఎపుడును అరణ్యములం ద్రిమ్మరుచుందును. నేను దైవవశంబున నిచటికి వచ్చి రాత్రి యీ శ్మశానములో నుంటిని. ఇట రాత్రి యోగినులగుంపు అక్కడక్కడినుండి వచ్చి చేరినది. అందు మధ్యలో నొకతె రాజుకొమరుని తెచ్చి గుండెం బెకలించి భైరవునికి నైవేద్య మొసంగి త్రాగి కైపెక్కి నా చేత జపములో నున్న తావళమును బలుకుగొనసాగినది. ఎంతటికిని పోక యా మహామాయ మొగమున నానావికారములు సేయుచు పైకొనఁగా నేను కోపమున మంత్రింపు నిప్పున ముమ్మొనవాలుం గాలిచి దానితో దాని మొలలో వాతవైచి దాని మెడనుండి యీ ముత్తెపుఁబేరును హరించితిని. ఇది తాపసులకు మాకుఁ బనికి రాదు, అమ్మవలసినదిగా నున్నది.' ఈ మాట విని కొత్వాలు పోయి రేనికి ఆ వృత్తాంతము నివేదించెను. రేఁడును ఆకథ విని ఆముత్తెపుంబేరును ఆనవాలు పట్టి, నమ్మక మైన యొక ముసలిదానిని పద్మావతి మొలమీఁద ముమ్మొనవాలువాత కలదేమో కని రమ్మని పంపి, కలదని యామెవలన నెఱింగి, తన సుతుని పద్మావతీఢాకిని హరించినదని నిశ్చయించుకొని, స్వయముగా నా మంత్రిపుత్త్ర తాపసుని కడ కేఁగుదెంచి పద్మావతికి తగిన దండన నతని నడిగి, అతనిమాటప్రకారము పద్మావతిని ఏడ్చుచున్న తల్లిదండ్రులవలననుండి యెడఁబాపి ఊరువెడలఁగొట్టెను.

ఆమె అడవిం బడి, నగు లొంది, అది యొల్ల మంత్రి పుత్త్రుని పన్నాగ మని తలపోసి, ప్రాణము విడువక, దుఃఖించుచుండెను. చీఁకటి పడఁగానే రాజకుమారుఁడును మంత్రికుమారుఁడును, ఆ వేషములు మాని గుఱ్ఱములపై ఆమెకడకు వచ్చి యోదార్చి గుఱ్ఱముమీఁద నెక్కించి తమపురికిం గొనిపోయిరి. అచట నామెం గూడి వజ్రముకుటుఁడు సుఖముండెను. దంతఘాటుఁడు తనకొమారిత అడవిలో ఘాతుకమృగములవాతం బడిన దని తలంచి శోకముచే ప్రాణము విడిచెను. అతని భార్య అనుగమనము చేసెను.

ఇట్లని యీకథం జెప్పి బేతాళుఁడు విక్రమార్కమహారాజుతో మరల నిట్లనియెః—'రాజా, నాకిం దొకసంశయము నివారింపుము. ఈదంపతులమరణంపుఁబాపము ఎవరిది? మంత్రిపుత్త్రునిదా, రాజకుమారునిదా, పద్మావతిదా? నీవు బుద్ధిమంతులలో మేలుబంతివి గదా తత్త్వ మెఱిఁగియు నాకుం జెప్పవేని నీతల నూఱు వ్రక్కలై రాలి పోవును.' బేతాళుఁ డిట్లడుగఁగా ఉత్తర మెఱిఁగి శాపభయముచే విక్రమార్కుఁడు 'యోగీశ్వరుఁడా, ఇందు తెలియరాని దేమున్నది? ఆపాపము ఈముగ్గురిలో నెవ్వరిదియుఁ గాదు. అది కర్ణోత్పలరాజుది.' అని చెప్పెను. అది యేమి? రా జేమి చేసినాఁడు? వారు ముగ్గురు గదా అందులకారణము? హంసలు వరి మేసిపోయిన కాకుల దా తప్పిదము?' అని బేతాళుఁడు మఱల నడిగెను. రా జనియెః-

‘ఆమువ్వురది తప్పు గాదు. ప్రభుకార్య నిర్వాహము మంత్రి కుమారునిపని. అది యతనికి పాతకము గాదు. పద్మావతీ రాజ పుత్త్రులు కామవశులు, విరాళినిప్పునం బడియున్నవారు, స్వార్థ పరులు, గుణదోషవిచారమున కర్హులు కారు. కర్ణోత్పలరాజే నీతిశాస్త్ర మెఱుఁగక, చారులవలన తన ప్రజల వృత్తాంత తత్త్వములం గనక, వంచకుల చరితములం దెలియక, ఇంగితాది జ్ఞానము లేక, నిర్విచారముగా దండించినాఁడు. కావున నతనిదే యాపాపము.’ ఇట్లు విక్రమార్కుఁడు సరి యైన యుత్తరము పలుకఁగా ఆమౌనభంగమునకు సంతసించినవాఁడై బేతాళుఁడు అతనిదార్ఢ్యముం బరీక్షింప భుజమునుండి మాయాబలమున క్షణములో ఆ నర శవముతోనే అదృశ్యుఁడై పోయెను. అందులకు బెణఁకక రాజు మఱల నతనిం దేఁబోయెను.

---

## క థ—౩.

అనంతరము విక్రమార్కుఁడు బేతాళుం గొని వచ్చుటకు మఱల ఆ యిరుగుడు చెట్టు కడ కేఁగెను. అట రాత్రి సోఁక వెలుఁగున కనఁగా ఆశవము నేలఁబడి కూయుచుండెను అంత నట్లు శవములో నున్న యా బేతాళుని రాజు మఱల భుజ మెక్కించుకొని మౌనంబునం ద్వరగాఁ గొనిపోవుచుండెను. భుజమున నుండి బేతాళుఁడు రాజుతో మఱల నిట్లు చెప్పెను.—

"రాజా, కడు ననుచిత మైన పాటు నీకు సంభవించినది. కాన నీకు వినోదార్థ మొక కథ చెప్పెదను వినుము. యమునా తీరమున బ్రహ్మస్థల మని యగ్రహారము కలదు అందు అగ్ని స్వామి యని వేదపారగుఁడు బ్రాహ్మణుఁ డుండెను. అతనికి అతిసుందరి మందారవతి యని కూఁతు రుండెను. ఆమెకు ప్రాయము రాఁగా ముప్వురు బ్రాహ్మణకుమారులు అన్నివిధ ముల నొకరికొకరుఁ సమానులు వచ్చి, ప్రతివాఁడు తనకే ఆమెను ఇ మ్మనియు ఒకని కిచ్చుటకు తనప్రాణము అ డ్డనియు, తండ్రి నడిగిరి. తండ్రి శేషించునిరువురచావునకును భయపడి అందు ఎవనికిని ఈయకుండాయెను. ఆ ముప్వురును ఆమెనెమ్మోముననే కన్నులుగ్రుచ్చి రేయుం బవలు అటనే చకోరవ్రత మాచరించు చుండిరి.

ఇట్టులుండ నాకన్నియ ఆకస్మికముగా దాహజ్వరము కలిగి మరణ మొందినది. అంత నావిప్రకుమారులు ముప్వురును దుఃఖపడి జగ్గిలి మరణాలంకారములతోడి యా మందారవతిని శ్మశానమునకుం గొనిపోయి దహనము చేసిరి ముప్వురలో నొకఁడు, ఆ సొదతావుననే గుడిసె కట్టికొని ఆమె బుగ్గియే శయ్యగా, బిచ్చ మెత్తిక, ఎవరేని పెట్టినదే భోజనముగా, తపస్సు చేయు చుండెను. ఇంకొకఁడు ఆమెయెముకలం గొనిపోయి గంగలో వైచెను. మూఁడవవాఁడు తాపసుఁడై దేశాంతరములు తిరుగఁబోయెను అతఁడు తిరిగితిరిగి వక్రోలక మను గ్రామమున

నొకబ్రాహ్మణునియింటికి ఆతిథ్యముకై పోయెను. అట నతనిచే సత్కృతుఁడై భుజింప నారంభించినంతట ఆబ్రాహ్మణునిశిశువు మకరుఁదనంబున నేడ్వందొడంగెను. ఎంత సమదాయించినను శిశువు మాననందున కోపగించి తల్లి వానిని ఒకచేయి పట్టి యెత్తి మండుచున్ననిప్పులో వైచెను. వేసియు వేయక ముందే కోమలాంగుఁడు శిశువు బూడిద యాయెను. దానిం గని గగుర్పొని తాపసాతిథి 'అయ్యో! తెలియక బొమ్మ రాకాసియింటఁ జొచ్చితిని. ఇతనియన్నము పాపరాశి. దీనిని నేను భుజింపనొల్ల.' అని లేచెను. అతిథి తిట్టఁగా, గృహస్థుఁడు 'అయ్యా, ఉచ్చరించినమాత్రాన సిద్ధించునట్టి నా మృతసంజీవనీమంత్రముయొక్క ప్రభావముం గనుము.' అని పల్కి చిన్నమంత్రపుస్తకమును తెచ్చి మంత్రమును చదివి మంత్రించిన దుమ్మును ఆ పాపని బూడిదలో వైచెను. అంత నాచిన్నవాఁడు బ్రతికి లేచెను. అతిథియు నిశ్చింతగా భోజనము చేసెను. భోజన మయినతర్వాత గృహస్థుఁడు రాత్రి ఆచిన్నపుపొత్తమును చిలుకకొయ్యకు తగిలించి అతిథియుం దానును శయనించెను.

తాపసుఁడు ప్రియను బ్రదికించుకొనఁగోరి గృహపతిని నిద్రపో నిచ్చి ఆపొత్తమును మూటలో కట్టుకొని వెలువడి రేయుం బవలు నడచి ఆ మునుపటి శ్మశానమునకు వచ్చెను. గంగకు ఎముకలు గొనిపోయినవాఁడును అప్పటికచట వచ్చి యుండెను. అంతట నాతనిని, ఆమెభస్మముందు శయనించియున్న యాతనిని,

ఇరువురం గూర్చి మూఁడవ వాఁ డిట్లనియె:—'ఈ గుడి
ఇటనుండి తీసివేయుఁడు, నేను మంత్రశక్తిచే ప్రియను భస్మ
నుండి బ్రదికించి లేపెదను.' ఇట్లు వారిని ఇరువురను ప్రేరి
తాపసుఁడు బలవంతముగా నాభస్మశాయిని ఆవలికి ద్రోలిం
గుడిసెను పెఱికి వేసి, పాత్రముం జదివి యాబూడిదలో ప
త్రించిన దుమ్ము రవంత వైచెను. అంత మందారవతి బ్ర
లేచెను. ఆమె దేహము బంగారుతోఁ జేసినదివోలె సొదనిప్పుల
పుటము తీరి మఱియు వన్నెఁబొందెను. అట్లామె మఱల బ్ర
కఁగా ముగ్వురును తత్తరపడుచు ప్రతివాఁడును ఆమెను కైకొ
బోయి తమలో తా మిట్లు కలహింపఁ గడంగిరి. 'నేను మంత్ర
బలముచే గడించితిని గాన ఈ చెలువ నా పెండ్లాము.' అ
ఒకఁడు, 'నేను తీర్థములో నస్థులు వేసిన ప్రభావమున బ్రదికిన
కాన నీ చెలువ నా పెండ్లాము' అని యింకొకఁడు, 'నేను ఈ
బూడిదను కాపాడితపస్సుచేత బ్రదికించితిని గాన నీచెలువ నా
పెండ్లాము' అని మూఁడవవాఁడును, వాదించిరి.

ఓరాజా, వారిలో ఆమె ఎవని పెండ్లాము గావలయునో, నీవు చెప్పుము. ఎఱిఁగియు చెప్పవేని నీతల వేయివ్రక్కలగును.- ఇట్లు బేతాళుఁ డడుగఁగా రా జిట్లనియె:-'ఎవఁడు ఎంత కష్టపడి యైనను మంత్రబలమున నామెను బ్రదికించెనో, అతఁడు ఆమెకు తండ్రి గాని పతి గాఁడు; గంగలో ఎమ్ములు వైచిన యాతఁడు సుతుఁడుగాని పతి గాఁడు; ఎవఁడు గాఢానురాగి యై శ్మశాన

మందే ఆమె బూడిదశయ్యను కౌఁగిలించుకొని తపస్సు చేయుచుండెనో అతఁడు మగనివలె నడచుకొన్నవాఁడు, అతఁడు ఆమెకు మగఁడు.' ఇట్లని యుత్తరము చెప్పఁగా బేతాళుఁడు బుజమునుండి మాయమై తనతావునకుం బోయెను. అంతట రాజు భిక్షువుకొఱకు బేతాళునిఁ గొనివచ్చుటకు మరల యత్నించెను. ధీరులు ప్రాణాపాయకరమైనను ఒప్పుకొన్న పనిని చేయక వదలరు గదా.

---

## క థ—3.

మరల విక్రమార్కుఁడు శింశుపాతరువునొద్దకుం బోయి శవములోని బేతాళుని కని బుజమునం బెట్టుకొని మౌనమున వచ్చుచుండెను. బుజముమీఁది బేతాళుఁ డిట్లనియె:—రాజా, ఇట్లు రాత్రి యీశ్మశానములో నడయాడుచు భయపడవు? ఇది చిత్రముగా నున్నది. నీకు శ్రమ తీఱునట్లు కథ యొకటి చెప్పెద వినుము:—భూమండలములో పాటలీపుత్త్రమని పట్టణ మున్నది. పూర్వము దానిని విక్రమకేసరి యను రాజు ఏలుచుండెను. రత్నములకు సముద్రునింబోలె సుగుణములకు ఆతనిని ఉనికిపట్టునుగా బ్రహ్మదేవుఁడు సృజించెను. ఆయనయొద్ద దివ్యజ్ఞానము గలదియు సర్వశాస్త్రము లెఱిఁగినదియు ఒకచిలుక విదగ్ధచూడామణి యను పేరు గలది శాపముచే ఆ జన్మ మెత్తినట్టిది

యుండెను. దాని యుపదేశంబున రాజకుమారుఁడు తనకుఁ దగినసుందరిని మగధరాజకూఁతును చంద్రప్రభ యనుదానిం బెండ్లి యాడెను. ఆమెకును అట్టిదే సర్వవిజ్ఞానశాలిని సోమిక యను పేర గోరవంక యొకటి యుండెను. ఆ శుక శారికలు రెండును ఒకపంజరముననే నివసించి తమవిజ్ఞానముచే ఆ దంపతులను కొలుచు చుండినవి. ఒకనాఁడు చిలుక గోరవంకపై వలపుగొని ఏకశయ్యాసనాహార మయిన తన్నుఁ గూడు మని దానిని వేఁడెను. 'నేను పురుషసంపర్కము నొల్లను, పురుషులు దుష్టులు కృతఘ్నులు.' నని శారిక తిరస్కరించెను. 'పురుషులు దుష్టులు గారు, స్త్రీలే దుష్టలు క్రూరహృదయలు.' అని శుకము బదులు చెప్పఁగా, నా రెంటికిని వివాద మారంభ మాయెను. దాసుఁ డగుట భార్య యగుట ఓటపందెములుగా నేర్పఱచుకొని యా రెండుపిట్టలును రాజకుమారుని మధ్యవర్తినిగా కోరుకొన్నవి. వాని వివాదకారణము విని రాజకుమారుఁడు రెంటిని తనతండ్రి యాస్థానమునకుం గొనిపోయి అచ్చటగోరవంకను 'పురుషులు కృతఘ్నులంటివే, అది యెట్లో నిరూపింపుము.' అని యాజ్ఞాపించెను. అంతట అది వినుం డని తన వాదము సాధించుకొనుటకై మగవారి దోషములను వెల్లడించున దైన యీ కథను చెప్పం దొడంగెను.

ఈభూమిలో కామందికి యని గొప్పపట్టణము కలదు. అందు మహాధనుఁడు అర్థదత్తుఁ డని వర్తకుఁ డుండెను ధనదత్తుఁ

డని అతనికి కుమారుఁ డుండెను. ఆకుమారుఁడు తండ్రి మృతిఁ బొందఁగా దుఃస్వతంత్రుఁడై యౌవనవంతుఁడై జూదగాండ్ర ప్రేరణచే జూదమునం బడి, త్వరలోనే జూదముచే ధన మెల్ల కోలు పోయి, పేదఱికమునకు లజ్జ పడి, స్వదేశము వదలి, దేశాంతరములు తిరిగి, కాలక్రమమున చందనపుర మను నగరము చేరి, అందు భోజనార్థము ఒక వైశ్యునియింటికిఁ బోయెను. ఆ వైశ్యుఁడు సుకుమారాకారు నితనిం గని, కులగోత్రము లడిగి, కులీనుఁ డని యెఱింగి, దగ్గఱఁ జేర్చి, ధనముతోఁ గూడ తన కూఁతును రత్నావళి నిచ్చి పెండ్లిచేసెను. ధనదత్తుఁడు మామ యింటనే కొంతకాల ముండి సుఖముచే దారిద్ర్యము మఱచి ధనము మఱల దొరకినందున స్వదేశము పోవుటకును అచట జూదమాడుటకును సంకల్పించెను. అంతట ఆకన్య తక్క వేఱు సంతతి లేని యా మామను ఎట్లో ఒప్పించి, ఆభరణములతోడి భార్యను, భార్యకు చేదోడుగా పంపఁబడిన యొకముసలి దానిని, వెంటఁగొని, తనతో ముప్వురుగా తనదేశమునకుఁ బయనమై, అడవిలో దూరము పోయి, అట దొంగభయము చెప్పి ఆభరణము లన్నియు భార్యవలననుండి కైకొనెను. మూఢుఁడు, జూదములలోను వెలయాండ్రకూటమిలోను బడిన కృతఘ్నుల హృదయము కత్తివలె ఎంత కఠినమో! పాపాత్ముఁడు గుణవంతురాలిని భార్యను ధనముకై చంపఁగోరి ఆమెను ఆముసలితోఁ గూడ నొకగోతిలోఁ బడఁద్రోచి పోయెను.

ఆముదుసలి మరణ మొందెను. భార్య ఆయుశ్శేషము ఉండుటచే ఆగోతినుండి యేడ్చుచు గడ్డి గంటలను పట్టుకొని గాయములతోడ క్రమక్రమముగా గట్టెక్కి మాటిమాటికి దారి అడిగి తెలిసికొనుచు ఎట్టకేలకు తండ్రియిల్లు చేరెను. ఆ తీరున నామె యాకస్మికముగా మఱల వచ్చినందులకు దిగులు పడి తల్లిదండ్రు లడుగఁగా, నాపతివ్రత—తమ్ము దారిలో దొంగలు గొట్టి నట్లును, తనపతిని వారు కట్టి కొనిపోయి నట్లును, ముసలిదియు తానును గోతిలో పడినట్లును, అందు ముసలికి గతించినట్లును, తాను మాత్రము ప్రాణముతోనే బావిలో నుండఁగా దైవవశమున ఆదారిని వచ్చినబాటసారి యొకఁడు తన్నుఁ గని కనికరించి యెత్తినట్లును, దారి యడుగు కొనుచు అటకు తాను వచ్చి చేరినట్లును,—చెప్పినది. తల్లిదండ్రు లోదార్పఁగా భర్తమీఁదనే మనస్సు నిలిపి పతివ్రత రత్నావళి పుట్టినింట నుండినది.

కొంతకాలము గడవఁగా, నామె మగఁడు ధనదత్తుఁడు జూదముచే మరల ధన మెల్లను గోలుపోయి యిట్లు తలపోసెను ‘మామకడకు పోయి యడిగి మరల ధనము తెచ్చెదను. అతనికూఁతురు సురక్షితముగా నున్న దని బొంకెదను.’ ఇట్లు ఆలోచించుకొని ధనదత్తుఁడు మామయింటికిఁ బోయెను. అతఁ డింటికి వచ్చుచుండ రత్నావళి దూరమునం గని, వడివడిగా నెదురుగా పోయి యాపాపాత్ముని పాదములకు

ప్రొక్కెను. మగఁడు దుష్టుఁడైనను పతివ్రతల మానసము క్రించుఁదనంబు నొందదు గదా. తన్నుంగని యాతఁడు భయపడు చుండ, నామె యాతని భయపడవల దనియు, తన్ను దొంగలు గొట్టినట్టు కల్పించి తలిదండ్రులతో చెప్పితి ననియు, పలికి, లో నికిం దోడ్కొనిపోయెను. అత్తయు మామయు నతనిరాకకు పరమానందభరితు లయిరి 'ఆహా! పుణ్యవశమున అల్లుని దొంగలు ప్రాణముతో వదలిరి!' అని మామ బంధువర్గము నెల్ల రావించి మహోత్సవము చేసెను. మామగారి యైశ్వ ర్యము ననుభవించుచు ధనదత్తుఁడు రత్నావళితోఁ గూడ కొంతకాలము సుఖ ముండె, ఒకనాఁడు రాత్రి—ఆఘాతకుఁడు చేసినపనిని చెప్ప నోరు రాదు గాని!—కథాసందర్భముకై చెప్పె దను;—ఒకనాఁడు రాత్రి తనయొడిలో నిద్రించుచున్న రత్నా వళిని చంపి ఆమెనగలన్నియుం గైకొని ఎవరికిం దెలియకుండ నిజదేశమున కరిగెను. మగవారు ఇట్టిపాపాత్ములు — అని శారిక పలుకఁగా రాజకుమారుఁడు ఇపుడు నీవాదముం జెప్పు మని చిలుక నాజ్ఞాపించెను.

చిలుక పలుకుచున్నది:— దేవా, స్త్రీలే అతిదుస్సా హసురాండ్రు పాపాత్మురాండ్రు, ఈకథను వినుము.—హర్షవతి యని యొక పట్టణము అందు కోట్లకు పడగ లెత్తినవాఁడు ధనదత్తుఁ డని వర్తకుఁ డొకఁడు. అతనికి ప్రాణాధిక ప్రియ సాటి లేని యందగత్తియ వసుదత్త యని కూఁతురు. దానిని తండ్రి

సమానునికి రూపయౌవనవంతునికి సముద్రదత్తుఁ డను వణిక్కు-మారునికి తామ్రలిప్తినగరవాసికి సాధువునకు ఇచ్చి పెండ్లి చేసెను. ఒకప్పుడు భర్త తామ్రలిప్తియందును తాను తండ్రి యింటను ఉండఁగా వసుదత్త ప్రాయపుమగవాని నొకని అందగానిం గని చాటుగా చెలికత్తెమూలముగా రప్పించి వానితో కామకేళిం దేలెను. అదిమొదలు సదా ఏకాంతమున రాత్రి రాత్రి వానితో క్రీడించుచుండెను. ఇట్లుండ తామ్రలిప్తినుండి దాని మగఁడు అరుగుదెంచెను. అత్తమామలు అల్లునిరాకకు పగలు పండుగు చేసిరి రాత్రి తల్లి యలంకరించి వసుదత్తను అల్లునికడకు శయనమునకుం బంపఁగా నది పోయి ఏకశయ్యం బరుండియు విటకానిని ధ్యానించుచు మగని నొల్లకుండెను. అతఁడు వేఁడఁగా దొంగనిద్ర నటించెను. అతఁడును సురాపానంపుఁ గైపుచేతను పయనంపు బడలికచేతను మైమఱచి నిద్ర పోయెను. ఎల్లరును భుజించి త్రాగి నిద్రించుచున్నసమయాన కన్నము త్రవ్వి దొంగ యొకఁడు ఆపడుకగదిలో ప్రవేశించెను. వానిం గనక యామె లేచి విటునికడకు సంకేతస్థలమునకు రహస్యముగా వెడలెను. అది యట్లు పోవుచుండం గని ఆశాభంగమై చోరుఁడు 'అయ్యో, నేను ఏనగలకై యింతపాటు పడితినో ఆనగలనే ధరించి యీయామె ఈ యర్ధమరేయి వెలువడుచున్నది కానిమ్ము, ఎటకు పోవునో కనిపెదంగాక.' అని యా

లోచించి దానికి అగపడకుండ కొంచెము దూరమున వెనుకం బోవుచుండెను.

ఇంతలో దారిలో పువ్వులు లోనగు ద్రవ్యములు తెచ్చి నకి యొకతె వసుదత్తం గలసికొనెను. దానితోఁగూడ ఆ కాముకి ఒకతోఁటకుం జనుడు, అచట దానికాముకుఁడు ఒక చెట్టు కొమ్మను ఉరిలోఁ వ్రేలాడుచుండెను. వాఁడు రాత్రి సంకేతస్థానమునకు రాఁగా తలారులు గని దొంగ యని యురిఁ దివిచి పోయిరి. అంత వసుదత్త బెగ్గడిల్లి దిక్కు గానక మొత్తు కొనుచు దీనముగా నేడ్చుచు నేల కొఱగెను. లేచి, తనకాము కుని శవమును చెట్టునుండి దింపి, కూర్చుండఁబెట్టి, గంధము పూసి, పూవులు చుట్టి, వానిం గవుంగిలించి, వానిమొగ మెత్తి ముద్దిడునంతలో ఆ నిర్జీవపురుషుఁడు బేతాళావిష్టుఁడై దంత ములతో దానిముక్కుం గొఱికివేసెను. అంత బెగ్గువడి నొప్పికి అవలికి సురిఁగియు నది బ్రదికియున్నాఁడేమో యని చూపగొని మఱల పరికించెను. ఇంతలో ఆశవము బేతాళావే శము తీఱఁగా నిశ్చేష్టముగాఁ బడియుండెను. శవమ యని యది నిశ్చయ మెఱింగి భయపడి యూసచెడి యేడ్చుచు నట నుండి తరలెను. అంతవఱకు దాఁగి పరికించుచున్న దొంగ అది యెల్లం గని 'అహో! ఈపాపాత్మురాలు ఎంతపని చేసినది! ఔరా, స్త్రీలహృదయము చీఁకటినూతివలె భయంకరము, లోఁతు అందనిదె, పడుటకే గాని మఱిఎందునకుం గాదు.

ఇంక నిది యేమి సేయ నున్నదో? కనియెదం గాక.' అని యెంచి దూరాననే మరల దానివెంటం జనియెను.

అది మగఁడు నిద్రించుచున్న గదికిం జని 'అయ్యో! నన్నుఁ గావుఁడు, మగనిరూపున ఈ శత్రుఁడు ఏతప్పు నెఱుంగని నా ముక్కుం గొఱికినాఁడు' అని బిగ్గరగా పల్కొలు మొఱపెట్టెను ఆయల్లరికి మగఁడును పరిజనులును తల్లిదండ్రులును మేల్కొనిరి అంతట తండ్రి వచ్చి నెత్తుటి యోడికలతోఁడి యా మొండెపు ముక్కుం గని పట్టరాని క్రోధము పాలయి, భార్యాద్రోహి యని యల్లుని కట్టించివేసెను. అట్లు మామ మొదలగువా రెల్ల తనకు పగవారగుటయు, నతఁడు దెబ్బలు తినియు ఏమియుం బలుకక మూఁగవలె నుండెను. ఇంతవఱకుం గని దొంగ తన దారిం బోయెను అనంతరము ఆ గందరగోళముతో రాత్రి వేగఁగా, మామగారు అల్లుని మొండిముక్కుఁగూఁతుతోడం గూడ తేనికడకుం గొనిపోయి భార్యాద్రోహిని అల్లుని శిక్షింపు మని విన్నవించుకొనెను. రాజు అల్లుని సమాధానవచనములు వినక వానికి మరణదండన విధించెను. డప్పు గొట్టి చాటించుచు సముద్రదత్తుని తలవరులు వధ్యభూమికి వీథివెంటం గొనిపోవు చుండఁగా, చోరుఁడు బయటికి వచ్చి రాజపురుషులతో 'అయ్యా, నిష్కారణముగా నితని నేల చంపెదరు, ఇతనియందు తప్పు లేదు. వృత్తాంత మెల్ల నే నెఱుఁగుదును నన్ను తేని కడకుం గొనిపోయిన, నేను నిజ మెల్ల చెప్పెదను.' అని విన్నవించెను.

వెంటనే వారు వానిం గొనిపోయి నృపునికడ నిలిపిరి. వాఁడు ముందుగా రాజు నభయ మడిగి, పొంది, ఆమూలముగా రాత్రివృత్తాంత మంతయుం జెప్పి 'దేవరా, నామాట నమ్మకము లే దేని, ఇప్పటికిని ఆ శవము నోట ఆ ముక్కు ఇఱుకుకొనియే ఉండును, చూడవచ్చును' అనెను. అంతట వాఁడు తన యాజ్ఞచే పోయి చూచి వచ్చిన భటులవలన దొంగమాట సత్యమే యని తెలిసికొని, వణిక్కుమారుని సముద్రదత్తుని దండనమాని వదలి పెట్టి, అతని భార్యను ఆదుష్టశీలను చెవులు సయితము కోయించి దేశము వెడలఁగొట్టించి, దానితండ్రియొక్క సర్వధనమును దండము గొని, చోరుని తెలివికి సంతోషించి వానిం గొత్వాలుంగా నియోగించెను. ఈరీతిని స్త్రీలు స్వభావముచే పాపాత్ము రాండ్రు, ద్రోహబుద్ధికలవారు ఇట్లు పలికి శుకము ఇంద్ర శాపము తీఱి, చిత్రరథగంధర్వుఁ డై, దివ్యరూప మొంది, దివి కేఁగెను. అప్పుడే శారికయు నింద్రశాపము తీఱి తిలోత్తమ యను నచ్చర యై తత్క్షణమే స్వర్గమునకుం బోయెను ఆ రెంటి తగవును సభలో నిర్ణయముం బొందకయే నిలిచిపోయెను.

రాజా, నీవు చెప్పుము, స్త్రీలు పాపిష్ఠులా, పురుషులు పాపులా? ఎఱింగియు చెప్పవేని నీతల ప్రక్కలగును—'ఇట్లు బేతాళుఁడు అనఁగా రా జనియె:—'యోగీశ్వరుఁడా, ఇందు తెలియని దే మున్నది. స్త్రీలే పాపాత్మురాండ్రు. పురుషుఁడు ఎక్కడ నేని ఎవఁడేని అరుదుగా నట్టి దురాచారుఁ డుండును.

స్త్రీలుమాత్రము ప్రాయికముగా అందఱు నట్టివారే.' రాజిట్లు పలుకఁగా, బేతాళుఁడు మరల నతనిబుజమునుండి మాయమై పోయెను. రాజు మరల నతని తేర దొరంకొనెను.

---

## కథ—౮.

మరల విక్రమార్కుఁడు శ్మశానములో నిశీథాంధకారములో శింశుపావృక్షముకడకుం బోయి నరశవమం దున్న బేతాళుని బుజ మెక్కించుకొని నదరు బెదరు లేక భిక్షునికడకు కొని పోవుచుండఁగా, బుజముమీఁది బేతాళుఁ డిట్లనియె:—రాజా, ఈపాడు శ్రమణుని కోసము ఏల యిట్లు పాటుపడెదవు? నీయాయాసము నిష్ఫలము. అయ్యో ! పాపము ! నీకు తెలివి లేదు. పోనీ, దారిబడలిక తీఱ కథ వినుము. భూమిలో శోభావతి యని పురి కలదు. అందు మహాపరాక్రమశాలి శూద్రకుఁ డను రాజు ఏలుచుండెను. అతని యేలుబడిలో ధర్మము నాల్గుపాదముల నడువఁగా భూదేవత శ్రీరామాదులను సయితము మఱచి యుండెను. ఆరాజుకడకు ఒకప్పుడు మాళవమునుండి వీరవరుఁ డనువేరి బ్రాహ్మణుఁ డొకఁడు కొలువుకై వచ్చెను. ఆవీరవరునికి ఇంటి జనము ధర్మవతి యను భార్యయు సత్యవరుఁ డను కొమారుఁడును, వీరవతి యను కొమారితయు, ముగ్వురు. కొలువునకు సాధనములును మూఁడు ; ఒకచేత తరవారి, రెండ

వ చేత డాలు, మొలలో కటారి. ఇంతమాత్రపుఁ బరికరముతో నతఁడు దినమునకు అయిదువందల వరహాలు జీత మడిగెను అతఁడు మహాపౌరుషశాలి యని రాజు ఆ కాగముచేతనే గ్రహించి యతనికి అడిగినజీత మిచ్చి కొలు విచ్చెను.

'పరికరము కొంచెము, ఇతఁడు ఇంత ఏమిసేయును! దుర్వ్యసన మేమేని కలదా?' అని తలపోసి రాజు అతని వ్యయమును తెలిసికొం డని గూఢముగా నతనివెంట చారులం బంపెను. ప్రతిదినము, వీరవరుఁడు ప్రాతఃకాలమున రాజును దర్శించి, మధ్యాహ్నమువఱకు హజారమున కత్తి కేలఁగొని నిలిచియుండి, జీతము పుచ్చుకొని యింటికిం బోయి నూఱు వరహాలు భార్య చేతికి భోజనార్థము ఇచ్చును, నూఱు వరహాలకు వస్త్రములు మైపూఁతలు తాంబూలంబును కొనును, స్నానమాడి హరిహరపూజకై నూఱు వరహాలు వ్యయించును, బ్రాహ్మణులకును దరిద్రులకు రెండువందలు దానముసేయును ఇట్లు అతఁడు ఆ యైదువందల వరహాలను పంచి వ్యయించును అనంతరము అగ్నిహోత్రాదికము గావించి భోజనము చేసి, ఒంటరిగా రాత్రి పోయి, చేత తరవారిం బూని, మరల సింహద్వారమున నిలిచి యుండును చారులవలన వీరవరుని యా నిత్యచర్యను విని రాజు ఆనందమంది, అతఁ డెవఁడో గొప్పవాఁడు, ఎక్కువ సత్కారమునకు అర్హుఁడు, అని తలంచి యుండెను. ఇ ట్లుండఁగా వేసవి వచ్చెను. తొలకరివానలును

ఆరంభించెను. అప్పుడు భయంకరముగా మబ్బులు రేయుం బవలు జడి గురియుచున్నను వీరవరుఁడు సింహద్వారమున తప్పక నిలిచి యుండెను. శూద్రక రాజు పగ లతనిని మేడతుది నుండి గాంచి, రాత్రి అతని యునికిం గన మరల మేడ యెక్కి, అటనుండి 'ఎవరు సింహద్వారములో ?' అని హెచ్చరించెను. 'నే నున్నాను' అని వీరవరుఁడు పలికెను. 'ఆహా! ఈవీరవరుఁడు మహాసత్త్వుఁడు, నాయందు భక్తుఁడు, ఇతనిని అవశ్యము గొప్ప స్థితికి తేవలసినది.' అని తలపోసి రాజు మేడ దిగి అంతిపురము చేరి పవ్వళించెను. మఱునాఁడు అంతకంటెను ఎడ తెఱపి లేకుండ జడివాన కురియుచుండఁగా, రాత్రి లోకము నెల్ల చీఁకటి దిగమ్రింగి యుండఁగా, మరల రాజు మేడ యెక్కి 'ఎవ రున్నారు సింహద్వారములో?' అని హెచ్చరించెను. ఒక్కఁడే వీరవరుఁడు స్పష్టముగా 'నేను ఉన్నాను వీరవరుఁడను.' అని బదులు పలికెను.

రాజు అతనిధీరతకు వింతపడుచుండఁగా నపుడు దూర మున నెవ్వతెదో యేడ్పు వినఁబడెను. దానిని విని 'ఏమి యిది ! నారాజ్యములో బాధితులుగాని, దుఃఖితులుగాని, దరిద్రులు గాని లేరు. మఱి యీామె యెవరు? ఏకాకిని యై రాత్రి యిట ఏల నేడ్చుచున్నది ?' అని జాలిగొని రాజు క్రింద ఒంటిగా నున్న వీరవరుని పిలిచి 'ఓయి వీరవరా, వినుము, దూరమున నెవలో స్త్రీ ఏడ్చుచున్నది, ఆమె ఎవరో ఏల యేడ్చుచున్నదో

కనుంగొని రమ్ము.' అని యాజ్ఞాపించెను. సరియే యని వీర వరుఁడు నడుమున కటారి నుంచుకొని చేతఁ గత్తిఁ గొని తరలెను. మెఱుపుఁగన్నులు మెఱయ, పెనుపెద్ద నీటిరాలు గురియుచు, రక్కసివోలె నట్టహసించుచున్న మేఘాంధకారమును వీరవరుఁడు సరకు సేయఁడాయెను. అట్టి యా ఘోరనిశీథమందు ఒంటరిగా వీరవరుఁడు పోవుటం గాంచి, రాజు కరుణచేతను కౌతుకముచేతను మేడదిగి కత్తి గొని యొంటిగా నతనివెంట అగపడకుండ పోవుచుండెను. ఏడ్పుసవ్వడిని బోయి వీరవరుఁడు ఊరివెలుపల నొక సరోవరముం జేరెను. అందు 'అయ్యో! శూద్రకుఁడా, అయ్యో! అయ్యో! కరుణామయుఁడా, దాతా, నీవు పోయిన నే నెట్లు జీవింతును!' అని నీటి నడుమ ఏడ్చుచున్న యొకవనితం గాంచి, వీరవరుఁడు ఆశ్చర్యపడి 'అమ్మా, నీ వెవతెవు? ఏల యేడ్చెదవు?' అని యామె నడిగెను. రాజు వెనుకనే వచ్చి సర్వము పరికించుచుండెను. 'ఓయి వీరవరుఁడా, ఎఱుంగుము, నేను భూమిని; నా కిపుడు ధర్మాత్ముఁడు శూద్రకుఁడు పతి. నేటికి మూఁడవనాఁడు ఆయనకు మృత్యువు సంభవించును. అట్టిపతి నింకొకని నే నెట్లు పడయఁగలను? కాన అతనికై వగచుచున్నాను; నాగతికిని వగచుచున్నాను.' అని భూదేవి యుత్తరము చెప్పెను. అంతట వీరవరుఁడు భయపడినవాఁడువోలె 'ఓదేవీ, జగద్రక్షామణికి ఈరాజునకు ఈ మృత్యువు తప్పుట కుపాయ మేమేని కలదా చెప్పుము.'

అని అడిగెను. 'ఒకటియే యుపాయము కలదు, దాని నొనర్ప నీవే శక్తుఁడవు.' అని భూదేవి పలికెను. 'అట్లైనఁ దేవీ, దయ చేసి త్వరగా చెప్పుము, నేను సాధించెదను, ఒండుచో నాప్రాణములవలనం బ్రయోజన మేమి?' అని వీరవరుఁ డడిగెను. 'నీసాటి స్వామిభక్తుఁడు వీరుఁ డెవఁ డున్నాఁడు? రాజునకు సేమము గలుగు నుపాయము వినుము. నగరిచెంగట రాజు ప్రతిష్ఠించిన చండికాదేవి సత్యవంతురాలు ఉన్నది. ఆమెకు నీకొడుకును సత్త్వవరుని బలివేయుదువేని రాజు ఇంక నూఱేండ్లు జీవించును. నేఁడే నీవు ఆపని చేసిన మేలు, ఒండుచో మూఁడ వదినము అతనిజీవితము నిలువదు.' అని భూదేవత చెప్పెను. 'దేవీ, ఇపుడే పోయి ఆపని చేసెదను.' అని వీరవరుఁడు పలికెను. అంతట భూదేవత 'నీకు మేలు కలుగుఁగాక' అని పలికి యంతర్ధానమాయెను. రాజు సర్వమును ప్రచ్ఛన్నముగా నుండి వినుచుండెను.

అట్లే రాజు వెంటవచ్చుచుండ వీరవరుఁడు ఇంటికి త్వరగాఁ బోయి, రాజక్షేమమునకై పుత్త్రుని బలివేయవలసిన దని భూదేవి చెప్పినవృత్తాంతమును, భార్యకు ధర్మవతికి తెలిపెను. 'నాథా, ప్రభువునకు మనము మేలు సేయవలసినది. కావున, పుత్త్రుని లేపి వృత్తాంతముం జెప్పుము.' అనియెను. అంతట వీరవరుఁడు పుత్త్రుని సత్త్వవరుని లేపి ఆవృత్తాంతము తెలిపి యిట్లనియె:—
'పుత్త్రా, చండికాదేవికి నిన్ను ఇపుడు బలివేసిన యెడల, రాజు

జీవించును; వేయనిచో మూఁడవ నాఁడు మృతిఁబొందును.' పుత్త్రుఁడు పలుకుట — 'నాయనా, నా ప్రాణములచేత రాజు జీవించునేని నేను కృతార్థుఁడను గదా, ఆయనయన్నము భుజించిన ఋణమును నేను తీర్చుకొన్నవాఁడ నగుదును. మఱి జాల మేల చేసెదవు ? నన్నుఁ గొనిపోయి చండికాదేవికి బలివేయుఁడు, నావలన రాజు సేమపడునుగాక.' సత్త్వవరుఁ డిట్లు పలుకఁగా వీరవరుఁడు 'బళి, పుత్త్రకా ! వాస్తవముగా నాకుమారుఁడవే నీవు.' అని మెచ్చుకొనెను. వెంట వచ్చినరాజు ఈభాషణములెల్ల వినుచుండెను.

అనంతరము సత్త్వవరుని బాలుని బుజ మెక్కించుకొని వీరవరుఁడును, కొమార్తెను వీరవతిని బుజమెక్కించుకొని భార్య ధర్మవతియు, ఇరువురును ఆరాత్రి చండికాలయమున కేఁగిరి. శూద్రకమహారాజు వెనుకనే పోవుచుండెను. దేవిసన్నిధిలో వీరవరుఁడు బుజమునుండి దింపఁగా దిగి, యాధీరుఁడు సత్త్వవరుఁడు దేవికి నమస్కరించి 'దేవీ, శూద్రకరాజునకు జీవిత మిమ్ము. ఆయన ఇంకొక నూఱువత్సరములు నిష్కంటకముగా పుడమి యెల్ల నేలును గాక.' అని వేఁడెను. కుమారుఁ డిట్లు పలుకఁగా సంతోషించి తండ్రి బళిబళి యని పలికి, ఒఱనుండి తరవారి దూసి సత్త్వవరుని తలం ద్రెంచి 'దేవీ, నాపుత్త్రుని బలి గొని శూద్రకమహారాజునకు జీవిత మిమ్ము' అని పలుకుచు, ఆతలను చండికకు బలి యిడెను. 'బళిబళి ! వీరవరా, నీసాటి స్వామి

భర్తృఁడు ఇంకొకఁడు లేఁడు, గుణవంతుఁడైన నీ యేక పుత్త్రుని ప్రాణములను వ్యయించి నీవు శూద్రకరాజునకు ప్రాణమును రాజ్యము నొసంగితివి!' అని యంతరిక్షమునుండి వాణి వినఁబడినది. దీని నెల్ల రాజు కనుచు వినుచు నుండెను.

అంతట వీరవరుకూఁతురు చిన్నపిల్ల వీరవతి యన్న తలను రొమ్మున బెట్టుకొని కౌఁగిలించుకొని వెడ్చి దుఃఖముచే గుండియ పగిలి కాలధర్మ మొందెను. అంతట వీరవరునితో భార్య ధర్మవతి యిట్లనియె:—రాజునకు మేలు చేసితిమి గదా, ఇఁక నిపుడు నే నొకవిన్నపము సేసెదను. జ్ఞానము లేని పిల్ల సైతము అన్నమృతికి వగచి ప్రాణము విడిచినది, నాకుం గల యిరువురు శిశువులుం బోయిన పిమ్మట నిఁక నాబ్రదు కేల? నేను కేటవి మాలినదానను, ముందే రాజుమేలుకై నాతలను దేవికి బలి యీనైతిని. కావున నాకిప్పుడు అనుజ్ఞ యిమ్ము, శిశువుల దేహములం గొని యగ్నిఁ జొచ్చెద.' ఇట్లని ధర్మవతి పతిని మిగుల నిర్బంధము చేసెను. వీరవరుఁ డనియె:— 'మంచిది, అట్లే చేయుము, శిశువులు నష్టమయి దుఃఖమే ముంచుచున్న యీసంసారములో నీ కింక నేమి ప్రీతి? ఓమానవతీ, ముందే నీ శిరమే అంపికకు ఈయ నైతి నని నీవు చింతింపఁ దగదు, ఆకార్యము అన్యసాధ్యమేని నాతలను నే నిచ్చియుండనా? కావున ఇంచుక తాళుము, ఇట దేవళింపుఁబనికై తెచ్చి పెట్టియున్న యీకొయ్యలతో సొంగ వేర్చెదను.' ఇట్లు చెప్పి

వీరవరుఁడు పాద వేర్చి శిశువులను అందు ఇడి, దీపముతో వెలిఁగించెను. అంతట పతివ్రతాశిరోమణి ధర్మవతి పతిపాదములకు మ్రొక్కి చండికాదేవికిం బ్రణమిల్లి ఇట్లు వేఁడుకొన్నది:— 'తల్లీ, జన్మాంతరమందును నాకు ఈ యార్యపుత్త్రుఁడే పతిగా వలయును, నా యాయువు యొడలిచే ఈ ప్రభువునకు మేలు కలుగును గాక.' ఇట్లు వేఁడుకొని యాసాధ్వి మంటలు మింటి కెగయుచున్న యాపాదనిప్పులో తామరకొలనం బోలె ప్రవేశించెను.

అంతట వీరుఁడు వీరవరుఁడు తలపోసెను:-'తేని కార్యము నెఱవేఱినది, అట్లు మింటిభారతి పలికినది గదా, ఏలికయన్నము భుజించిన ఋణమును నేను దీర్చుకొంటిని గదా, మఱి యిఁక నేను మాత్రము జీవింప నాస గొన నేల? తాను భరింపవలసిన ప్రియకుటుంబము నెల్ల వ్యయపఱిచి తన్నుమాత్రము బ్రదికించుకొన్న నాబోఁటివాఁడు శోభించునా ? కావున నేనును నన్ను బలి యిచ్చి యీ దేవతను తృప్తి పొందించెదను. ఇట్లాలోచించి వీరవరుఁడు దేవిని ముందుగా స్తుతులతోఁ బూజింపసాగెను —

జయ జయ మహిషాసురమారిణి జయ జయ రురు దారిణి శూలకరా
జయ జయ విబుధోత్సవకారిణి జయ జయ మహిధారిణి మాతృవరా
జయ జయ జగదర్చిత చరణా జయ జయ భక్తశ్రేయశ్శరణా
జయ జయ ధృతభాస్కరకిరణా జయ జయ భక్తాంహస్సంహరణా.

క కాళీ మ్రొక్కెద నీకుఁ గ
పాలిని నాపైఁ బ్రసన్న భావము గొని కం

కాళిని నాతల బలిగొని
పాలింపుము శూద్రకుని నృపాలవతంసుఁ.

ఇట్లు నుతించి వీరవరుఁడు తరవారితో చరాలున దేవికై తనతలం ద్రుంచి వేసికొనెను.

దాని నెల్ల నట చాటునుండి కని శూద్రకమహారాజు దుఃఖాశ్చర్యములపాలై 'ఆహా! ఈసాధువు సకుటుంబముగా నాకై యెచటనుం గనని వినని యద్భుతసాహస మాచరించినాఁడు! ఈసంసారము అతివిచిత్రమే, అయినను ఇట్టి మహాధీరుఁడు ఎచటను ఉండఁడు! ఎవఁడు ఇట్లు నోటితో చెప్ప నైనను చెప్పక ఏలికకై పరోక్షంబున ప్రాణము లిచ్చును! ఇతనియుపకారమునకు తగినబదులు చేయనేని, నా దొరతన మేల? నేను పశువవలె బ్రదుకవలసినదా?' అని తలపోసి రాజు ఒరనుండి కత్తి దూసి దేవిసన్నిధిని నిలిచి యిట్లు వేఁడుకొనెను. 'ఓదేవీ, ఎప్పుడును నిన్ను భక్తితోఁ గొలుచుచుండు నాయం దిపుడు విశేషానుగ్రహ ముంచి నాశిరమును బలిగా గ్రహించి నాకు వర మిమ్ము. ఈవీరవరుఁడు వేరికి సరి యైనపని చేసినాఁడు, నాకై సకుటుంబముగా ప్రాణము లిచ్చినాఁడు. దేవీ, ఇతనిని సకుటుంబముగా బ్రదికింపుము.' ఇట్లు వేఁడి శూద్రకరాజు తలం దఱుగు కొనుటకు కత్తి యెత్తఁగానే ఆకాశవాణి 'పుత్త్రా, సాహసము సేయకు, నీ సత్యమునకు నేను తనిసితిని, వీరవరుఁడు

పుత్త్ర భార్యాసమేతముగా మరల బ్రదుకును.' అని పలికి విర మించెను.

అంతట నిదురనుండి మేలుకొన్నవారుం బోలె వీర వరుఁడును శిశువులును భార్యయు బ్రదికి లేచిరి. ఆయద్భుత మును గని రాజు మరల చాటున కేఁగి ఆనందబాష్ప పూర్ణ లోచనుఁడై వారిని తనివి తీఱక చూచుచుండెను. వీరవరుఁడు భార్యాపుత్త్రులను తన్నుం గాంచి కళవళపడి వారి నొండొండ పేరుగ్రుచ్చి 'మీరు బుగ్గియైతిరి గదా మరల నెట్లు బ్రదికితిరి? నేనును నాతలం ద్రెంచుకొంటిని, నేనును మరల బ్రదికినాఁడను, ఇదేమి? ఇ దేమి నాభ్రమయా? ఒండె, దేవి యనుగ్రహమా? అని యిట్లు పలుకఁగా ఆలుబిడ్డలు 'మనము మరల బ్రదుకుట యిది నిక్కముగా దేవ్యనుగ్రహమే.' అనిరి. అంతట వీరవరుఁడు అది యట్లకాఁ దలంచి అమ్మవారికి మ్రొక్కి కుటుంబము నింటఁ జేర్చి వెంటనే రాత్రి మరల తేని సింహద్వారమునఁ బోయి ఎప్పటియట్ల నిలిచియుండెను. శూద్రకరాజును ప్రచ్ఛన్నుఁడై యిది యెల్లం గని పోయి తనమేడ యెక్కి 'ఎవరోయి సింహ ద్వారములో.' అని హెచ్చరించెను. 'మహాప్రభూ, నేనున్నాను వీరవరుఁడను, ఏలినవారియాజ్ఞపై నేను ఆస్త్రీనిగూర్చి పోయి తిని, ఆమె యెవరో రాక్షసివలె అగపడియు నగపడక మాయమై పోయెను.' అని వీరవరుఁడు బదులు పలికెను. సర్వవృత్తాంత మునుచూచి వచ్చినవాఁడయినయారాజు ఈమాట కత్యంతము

వింతపడెను. 'అహా! మానవంతుల చిత్తము సముద్రము వలె లోఁతయినది. ఇతరుల కలవికానిపనులు సేసియు వారు నోటం బ్రస్తావింపరుగదా!' ఇట్లు పరిపరివిధముల ఆశ్చర్యపడి రాజు మఱేమియుం బలుకక మేడ దిగి అంతిపురమునకుం బోయి కడమరాత్రిని వేగించి, మఱునాఁడు ప్రాతఃకాలమున ఓలగంబులో వీరవరుని యారాత్రి వృత్తాంతమును సర్వంబును మంత్రులకు వర్ణించెను. వారును అందఱు ఆశ్చర్యములో మునింగిరి. అంతట రాజు ప్రీతిచే వీరవరునికి సపుత్త్రునికి లాట రాజ్యమును కర్ణాటకరాజ్యసహితముగ నిచ్చెను. అది మొదలు శూద్రకమహారాజును వీరవరమహారాజును సమాన విభవము గలవారై ఒండొరులకు సహాయులై సేమముగానుండిరి.

ఇట్టి యత్యద్భుతకథం జెప్పి బేతాళుఁడు విక్రమార్కుని 'రాజా, ఈయిందఱిలో ఎవఁడెక్కువవాఁడు? ఎఱిఁగి చెప్పవేని నీకు మునుపటిశాపమే సుమా' అని యడిగెను. ఆ యందఱి లో శూద్రకరాజు గొప్పవాఁడని రాజు చెప్పెను. 'వీరవరుఁ డేల గాఁడు? అతఁడే యధికుఁడు ; అతనికి ఈడు ఈజగత్తులో పుట్టనే పుట్టఁడు, అతనిభార్య గొప్పది కాదా? స్త్రీ యయ్యు కన్నులారఁ గాంచుచు తనయుని పశువుంబోలె బలివేయ నంగీకరించినది; బాలుఁడయ్యును అట్టి సత్త్వోత్కర్ష కలవాఁడు సత్త్వవరుఁడు అధికుఁడు కాఁడా? నీ వేల యిందఱికంటెను శూద్రకరాజును పెద్ద చేసెదవు?' అని మరల బేతాళుఁడడు

గఁగా రాజు ఇట్లనియె:—'అట్లు గాదు, వీరవరుఁడు కులీనుఁడు, అతనికి ప్రాణములచేతను, భార్యచేతను, పుత్త్రులచేతను, దొరం గొలుచుట వ్రతము. అతనిభార్యయు కులాధికురాలు పతివ్రత, ఆమెకు పతిపోవుమార్గమునం బోవుటకన్న వేఱుధర్మము లేదు. వారికడుపునం బుట్టినవాఁడు సత్త్వవరుఁడు వారివలె నగుఁగాని యొండగునా? నూలు ఎట్టిదో వస్త్రము అట్టిదిగదా యగును. ఎవరి ప్రాణములచే రాజులు తమ్ముఁ గాచికొందురో అట్టి యా భృత్యులకై దేహమును త్యజించువాఁడు శూద్రకుఁడే గొప్ప వాఁడు.' ఇట్లు విక్రమార్కుఁడు చెప్పఁగా బేతాళుఁడు బుజము నుండి దిచ్చుమొగం బై తనతావునకుం బోయెను. రాజు అట్లే వల్లకాటిలో ఆ రాత్రి బేతాళునిం దేరసమకట్టి వెండియు ఆ శింశుపాతరువుం గూర్చి పోయెను.

---

## కథ—౬.

విక్రమార్కుఁడు మరల రాత్రి చీఁకటిలో శింశుపా తరువునకుం బోయి అందు వ్రేలాడుచున్న నరశరీరమును బేతాళాధిష్ఠితమును గని చెట్టునుండి దింపి బుజమునఁ బెట్టుకొని వడివడిగా నడవసాఁగెను.—రాజా, నీకు శ్రమ అంత అతిప్రియమేని అగుఁగాక, వినోదార్థము నేను కథ చెప్పెదను వినుము. ఉజ్జయినిలో పుణ్యసేన మహారాజుదగ్గఱ హరిస్వామి యను

బ్రాహ్మణుడు సద్గుణుడు ప్రియమంత్రి ఉండెను. ఆమంత్రికి తగినభార్యయందు గుణవంతుడు తండ్రికిసమానుడు దేవస్వామి యని పుత్త్రుడు పుట్టెను; అట్లే సాటి లేని లావణ్యము గలది సోమప్రభ యని కూతు రొకతె పుట్టెను. ఆకన్య యౌవనవతి యైనంతట సౌందర్యాతిశయాభిమానము వహించినదై, తన్ను శూరునికిఁ గాని, జ్ఞానికిఁ గాని, విజ్ఞానికిఁ గాని, ఈవలసినది గాని అన్యుని కీఁగూడ దని తల్లితో చెప్పి, తండ్రికిని అన్నకును ఆమెచేఁ జెప్పించెను. అది మొదలు తండ్రి ఆ చెప్పిన మూఁడు తెగలలో నొకని నామెకై వెదకుచుండెను. ఇంతలోపల పుణ్య సేనమహారాజు తనరాష్ట్రముపై దండెత్తి రానున్న దక్షిణ దేశపు రాజుకడకు సంధి సేయుటకు రాయబారినిగా ఆ హరి స్వామిని పంపెను.

అచట ఆకార్య మయినతర్వాత ఆయనకడకు సోమ ప్రభా సౌందర్యమును విన్న బ్రాహ్మణకుమారుఁ డొకఁడు వచ్చి సోమప్రభను తన కిమ్మని యడిగెను. 'నా కూఁతురు శూర జ్ఞాని విజ్ఞానులలో నొక్కనిఁగాని యన్యుని వరింపదు, నీవు అం దెవ్వఁడవు?' అని యాతనిని హరిస్వామి యడిగెను. తాను విజ్ఞాని యని యాచిన్నవాఁడు పలికెను. అంత హరిస్వామి యతనిని విజ్ఞానముం బ్రదర్శింపు మనెను. అంత నాకుమారుఁడు తన శక్తిచేత ఆకాశగామి యగు మాయ తే రొకటి నిర్మించి, అందు హరిస్వామి నెక్కించుకొని, కొని పోయి స్వర్గాదిలోక

ములను కానిపించి. తనకు ఆదక్షిణదేశపురేని విడిదలో విడిచి
పెట్టెను. హరిస్వామి సంతోషించి యతనికి సోమప్రభను వా
గ్దానము చేసి ఏడవదినము వివాహమునకు నిశ్చయించెను.
ఆకాలమందే ఉజ్జయినిలో మఱి యొక విప్రకుమారుఁడు దేవ
స్వామికడకు వచ్చి చెల్లెలి నిమ్మని యడిగెను. 'నాచెల్లెలు జ్ఞాని
విజ్ఞాని శూరులలో నొకనిం దక్క తక్కొరుని వరియింపదు.
అందు నీ వెవఁడవు?' అని దేవస్వామి యడుగఁగా నితఁడు తాను
శూరుఁ డని చెప్పుకొని, తనశస్త్రాస్త్రవిద్యా ప్రభావముం గనఁ
బఱిచెను. అంతట దేవస్వామి యతనికి చెల్లెలిని వాగ్దానము
చేసి జోస్యుల నడిగి ఏడవదినము వివాహమునకు నిశ్చయించి
ఆవృత్తాంతమును తల్లికిం దెలియఁజేసెను. ఆసమయమందే తల్లిని
ఒక విప్రకుమారుఁడు వచ్చి కొమారిత నడుగ, ఆమె 'నాకూఁ
తునకు జ్ఞాని విజ్ఞాని శూరులలో నొకఁడు గాని యన్యుఁడు పనికి
రాఁడు, నీ వెవ్వఁడ వ'ని యడుగఁగా, తాను జ్ఞాని యని చెప్పి
యతఁడు వర్తమానభూతభవిష్యత్తులు చెప్పఁగా, ఆమె వానికి
కుమారితను వాగ్దానము చేసి ఆయేడవదినము నే వివాహమునకు
నేర్పఱిచి యుండెను

మఱునాఁడు హరిస్వామి దక్షిణరాష్ట్రమునుండి వచ్చి
తాను చేసినవాగ్దానమును భార్యతోను కుమారునితోను తెలి
యఁజేసెను. వారును తాము ఒకరియెఱుక లేక యొకరు చేసిన
యా యా కన్యాదాన నిశ్చయములను ఆయనతోఁ జెప్పిరి. ఇట్లు

ముప్వురు వరులు దాపరింపఁగా హరిస్వామి చేయునది లేక చిక్కునంబడి చింతిల్లసాగెను. వివాహదినము రాఁగానే వరులు ముప్వురును జ్ఞాని విజ్ఞాని శూరులు హరిస్వామియింటికి వచ్చిరి. ఆసమయమునందు నొకవింత జరిగెను. ఏమన, హరిస్వామి కూఁతురు ఆసోమప్రభ ఎటకు పోయెనో ఏ మాయెనో ఎంత వెదకినను అగపడ దాయెను. హరిస్వామి దిగు లొంది జ్ఞానిని 'ఓజ్ఞానీ, నా కొమారిత యిపు డెట నున్నదో నీవు చెప్పుము.' అని యడిగెను. 'ధూమశిఖుఁ డను రక్కసుఁడు కొనిపోయి వింధ్యారణ్యములో తనయింట నుంచుకొనియున్నాఁడు' అని జ్ఞాని చెప్పెను 'అయ్యో! నాసుత నాకెట్లు దొరకును ? వివాహ మెట్లు జరుగును?' అని హరిస్వామి మొఱవెట్టసాగెను అంతట విజ్ఞాని 'అయ్యా, భయపడవలదు, మీకొమారిత యెట నున్న దని ఈజ్ఞాని పలికినాఁడో అటకు మి మ్మెల్ల నే నిపుడ కొని పోయి చేర్చెద.' అని యొూదార్చి, తత్క్షణమే నానాశస్త్రాస్త్ర సంయుత మైన రథము నొకదానిని నిర్మించి, అందు వారి నెల్ల నెక్కించుకొని, కొని పోయి వింధ్యారణ్యములో ధూమశిఖుని నివాసముకడ నిలిపెను. వారిరాక యెఱింగి కోపముతో వెలు వడిన ధూమశిఖునితో శూరుఁడు పోరెను. చిత్రాస్త్ర శస్త్ర ములతో స్త్రీకై వారు పోరిన యా పోరు రామరావణుల పోరివలె లోకభయంకరముగా నుండెను. ఇట్లు పోరుచు క్షణ ములో నాశూరుఁడు ఆ రక్కసునితలను అర్ధచంద్రబాణమునం

ద్రుంచెను. రక్కసుఁడు మడిసినంతట రక్కసునియింటనుండి సోమప్రభం గొని తెచ్చి వార లందఱును ఆ విజ్ఞాని రథమున హరిస్వామి యిల్లు సేరిరి.

అంతట లగ్న వేళ సమీపమునకు రాఁగా జ్ఞాని విజ్ఞాని శూరులకు ముగ్గురకును ఇట్లని జగడము కలిగినది. జ్ఞాని చెప్పెను:—'నే నెఱుఁగకుంటినా ఎటనో దాఁపటికంబున నున్న యీకన్య మీ కెట్లు దొరకును? కాన నీకన్యను నాకు ఈయ వలసినది.' విజ్ఞాని చెప్పెను:—'నేను నింగిం జరించు మాయా రథమును నిర్మింపనేని మీకు క్షణములో దేవతలకుం బోలె రాకపోక లెట్లలవడును? రథము కలవాఁడైన రక్కసునితో రథము లేక యుద్ధ మెట్లు జరుగును? కావున ఈకన్నెను నేను గడించితిని, నా కీయ వలసినది.' శూరుఁడు వలికెను:—'నేను రక్కసునిఁ బోరఁ బరిమార్పనేని మీరిరువురు ఏమి యత్నములు చేసినను ఏమి ప్రయోజనము? కన్యను ఇట కెవఁడు తెచ్చును? కావున ఈకన్యను నా కీవలసినది.' ఇట్లు వారు జగడము లాడు చుండఁగా హరిస్వామి యేమియుఁ దోఁపక యూరకుండెను.

ఓ రాజా నీవు చెప్పుము, ఆ కన్య నెవని కీయవలసినది? ఎఱింగియుఁ జెప్ప వేని నీతల వ్రయ్యలగును—ఇట్లని బేతాళుఁడు అడుగఁగా విక్రమార్కుఁడు మౌనముం ద్యజించి యిట్లనియె:—'ఆ కన్యను శూరుని కీవలసినది. ఏల యన, నతఁడు ప్రాణమునకుఁ దెగించి బహుపరాక్రమముచే రక్కసుం గూల్చి

ఆకన్య నార్జించినాఁడు. జ్ఞాని విజ్ఞానులను ఇతనికి పనివాండ్రను గా బ్రహ్మ చేసినాఁడు. లోకములో గణకుఁడును వడ్లంగియు ఎప్పుడును ఇతరుల కుపకరణములే గదా.' ఇట్లు రాజు చెప్పఁగా బేతాళుఁడు మాయ మై యెప్పటిచోటికి పోయెను. రాజు అతనిం దెచ్చుటకు మఱల శింశుపాతరువు కడకుం బోయెను.

---

క థ—౬.

మరల ఆ యర్ధరాత్రమందు విక్రమార్క మహారాజు నరశవగతుని బేతాళుని శింశుపాతరువునుండి బుజమున నెక్కించుకొని భిక్షువుకడకుం దరలఁగా, దారిలో బేతాళుఁ డిట్లు వక్కాణింపం దొడంగెను:—రాజా, బుద్ధిమంతుఁడవు సత్త్వసంపన్నుఁడవుం గావున నీయందు నాకు ప్రీతి గలిగినది కావున వినోదార్థము కథను ప్రశ్నను వినుము:—శోభావతీనగరము రాజధానిగా యశఃకేతు వనురాజు మహీమండల మేలుచుండెను. అతని యా నగరమునందు దివ్య మయిన గౌరిదేవళము కలదు. దానికి దక్షిణమున గౌరితీర్థ మను పేరం బుష్కరణియుం గలదు. ప్రతివత్సరంబును ఆషాఢశుక్ల చతుర్దశినాఁడు అమ్మవారికి జాతర జరుగును. అపుడు నానాదిగంతములనుండి మహాజనులు వచ్చి యాపుష్కరిణిలోఁ గ్రుంకిడుదురు. ఒక యేఁడు ఆ దినమందు అచట స్నానము సేయుటకై బ్రహ్మస్థల మను గ్రామమునుండి

లేఁత ప్రాయమువాఁడు ధవళుఁ డని చాకలి యొకఁడు వచ్చెను. వానికి అచట ఆ సమయమున స్నానార్థము వచ్చినట్టిది శుద్ధ పటుం డను చాకలి కూఁతురు మదనసుందరి యనునది కనుఁగవ విందై, జలకమాడి పోవుచు వానిమనస్సును దొంగిలించుకొని పోయెను. అంత నామడివేలు వలరాయని మోఁదులకుఁ దాళ లేక దాని కుల నామములు తెలిసికొని తన యూరికిఁ బోయి, ఇంట నిలుకడ యెడలి తాలుమాలై తిండి మాని యుండెను. తల్లి దిగులుపడి వానిని ఆ నెగులునకు కారణము చెప్పుమని బతి మాలగా, వాఁడు మనస్సులోని చింతను వెడలఁబుచ్చెను. అది యా వృత్తాంతమును తనమగనికి విమలునికిం దెలిపెను.

తండ్రి ఆయవస్థలో నున్న కుమారునితో నిట్లనియె;— 'నాయనా ఏల యిట్లు వగచెదవు ? నీకోరిక తీఱుట యొక గడ్డు గాదు; నేనడిగిన యెడల శుద్ధపటుఁడు నీకు పిల్ల నిచ్చును. మనము ఆయనకంటె కులవృత్తులలో తక్కువవారము గాము గదా. నన్నతఁ డెఱుఁగును, నేనతని నెఱుంగుదును, కావున ఈ కోరిక దుర్ఘటముగాదు.' విమలుఁడు ఇట్లు పుత్త్రుని ఓదార్చి, భోజనాదికమందుఁ బ్రవర్తిల్లంజేసి, మఱునాఁడు వానిని వెంటఁ గొని శుద్ధపటునియింటికిఁ బోయి, వానికొమార్తెను ధవళునికి అడిగెను. శుద్ధపటుండును ఆదరముతో వాగ్దానము చేసెను. మఱునాఁడే మంచిలగ్నము నిర్ణయించి శుద్ధపటుఁడు ధవళునికి సరి యైనదానిని తనకొమారితను మదనసుందరిని ఇచ్చి వివా

హోము చేసెను వివాహమైనతర్వాత ధవళుఁడు భార్యందోడ్కొని కృతార్థుఁడై తన తండ్రియింటికిం బోయెను. అచట వారిరువురు సుఖ ముండఁగా నొకప్పుడు బావమఱఁది మదనమంజరి తమ్ముఁడు వారియింటికి వచ్చి తమయింట జరుగఁబోవు దేవీ పూజకై అక్కను బావను తోడితెమ్మని తన్ను తనతండ్రి పంపె నని చెప్పెను. వానిమాటను ఒప్పుకొని వానిని వియ్యంకుఁడు లో నగువారు ప్రీతితో ఆ దినము మేలయిన యన్నపానములతో గౌరవించిరి.

మఱునాఁడు వేకువ ధవళుఁడు భార్యం దోడ్కొని బావమఱఁదితో మామగారియింటికిం దరలెను; ముప్వురును శోభావతీపురము చేరిరి. అట ధవళుఁడు గొప్పగొర్వాలయముం గని, అమ్మవారిదర్శనము చేసికొని పోవుదము రం డని, పెండ్లా మును బావమఱఁదిని పిలిచెను. 'మన మింతమందిమి ఉత్త చేతులతో ఎట్లు అమ్మవారిని దర్శింతుము?' అని బావమఱఁది పలికెను. 'అటయిన నే నొక్కఁడనే పోయి చూచెద, మీరు ఇచటనే యుండుఁడు' అని పలికి వారి నచట నిలిపి ధవ ళుఁడు దేవిని దర్శించుటకు తానుమాత్రము గుడికి పోయెను. అట రక్కసియుక్కుండ్రను పదునెనిమిది చేతులతోఁ జక్కుసేసి అమగుఁదామరతో మహిషాసుర నడంచిన యాదేవికి మ్రొక్కి, ధవళుఁడు దైవయోగంబున 'ఈ యమ్మవారిని లోకులు ప్రాణిబలులచేఁ గొలుచుచున్నారు, నేను నన్నే బలియిడి

యనుగ్రహంబు వొందెద ' అని తలపోసినవాఁడై, అమ్మ వారి కెవ్వరో యాత్రికులు సమర్పించుకొని పెట్టిపోయిన కత్తిని గైకొని, తనజుట్టును గంటగొలుసునకు ముడివేసి, ఆ కత్తితో మెడ తఱిగికొని, ప్రాణ ద్రావెను. వీ డెంతసేపటికిని రానందున బావమఱఁది వెదకుకొని వచ్చి, అమ్మవారి సన్నిధిని తల దఱుఁగుకొని పడియుండుట గాంచి, దుఃఖావేశంబునఁ దాను నట్లే ఆకత్తితో తనతలను బలి యిచ్చెను

వీఁడును రామిచే వీనియక్క మదనసుందరి దిగులుపడి గుడిలోనికి వచ్చి, అచట అట్లు తలలు డ్రెంచుకొని పడియుండు మగనిని అన్ననుం గని, దుఃఖసముద్రములో మునింగి ఏడ్చుచు మూర్ఛిల్లి నేలఁ గూలెను. క్షణములో లేచి, అట్లాకస్మికముగా మరణము నొందిన యా యిరువురకును శోకించుచు, తాను మాత్రము బ్రదికియుండి ప్రయోజనము లే దని తలంచి, దేవిం గూర్చి 'ఓయమ్మ తల్లీ, సౌభాగ్యము నిచ్చు దేవీ, మన్మథ శత్రు నయినను భర్తను సగముదేహమునం జొచ్చిన తల్లీ, సకల స్త్రీలకును రక్షకురాలా, శోకమును దీర్చు దేవతా, నా మగనిని తమ్మునిని ఆకస్మికముగా ఏకకాలమున నేల చంపితివి? నీకు నిత్యభక్త నగు నా కిట్లు సేయుట తగునా? కావున నేను నిన్నే శరణుఁ బొచ్చెదను, ఈ దీనురాలి మొఱ ఒకటి మాత్రము నెఱవేర్పుము. దౌర్భాగ్యదూషిత మయిన యీదేహమును నేను వదలెద్దను, నేను మఱల ఏయేజన్మ మెత్తుదునో ఆయా

జన్మమందెల్ల నాకు ఇతనినే పతినిగాను అతనినే తమ్మునింగాను చేయుము’ అని వేడుకొని మరల మ్రొక్కి అచ్చట నశోక వృక్షమున తీఁగతో ఉరిఁబోసికొను నిముసంబున ఆకసమునుండి యీ యశరీరవాక్కు స్పష్టముగా వినఁబడెను ‘కూఁతురా, బాలవయ్యును ఇట్టిసత్త్వోత్కర్ష కలదాన వైనందులకు సంతసించితిని, కావున ఈ యురిని విడువుము, నీ మగని మొండెయమునకును నీతమ్ముని మొండెమునకును వాని వాని తలం దగిలింపుము. నా వరమున నిరువురును జీవము నొంది లేతురు.’ ఈ యాకాశవాణిని విని మదనసుందరి పట్టరాని హర్షమున తడఁబడు పాటున ఒకని తల నింకొకని మొండెయమునకుం దగిలించినది. అంత నాయిరువురు గాయము లేని యొడళ్లతోను తలమొండెముల సంకరముతోను బ్రదికి లేచి, ఒకరొకరికి తమ తమ వృత్తాంతము చెప్పుకొని సంతోషించి ముప్వురును అమ్మవారికి మఱల మ్రొక్కి యింటికిం బోయిరి.

దారిలో మదనసుందరి తాను తత్తరమునఁ దలకాయలు మార్చిన సంకరమును గని, దిగులొంది, యేమి సేయనుం దెలియక భ్రమగొని యుండెను. ‘రాజా, నీవు చెప్పుము, ఆ సంకీర్ణు లిరువురలో ఆమె భర్త యెవఁడు ?’ ఎఱిఁగియు చెప్పవేని నీకు ఆమునుపటిశాపమే. రాజిట్లనియె:— ‘యోగీశ్వరా, ఇందు చిక్కే మున్నది? పతితల గలవాఁడే పతి. దేహమునకెల్ల తల ప్రధానావయవము గదా, దానివలననే గదా ఆన

వాలు పట్టుట.'— ఇట్లు రాజు మౌనము త్యజించి పలుకఁగా సంతోషించి బేతాళుఁడు అదృశ్యుఁడై మరల శింశుపావృక్షము నెక్కం బోయెను. రాజు అతనిం దెచ్చుటకు మరల నా చెట్టుకడఁ కేఁగెను.

---

## క థ—౮.

మరల యథాప్రకారము విక్రమార్కుఁడు శింశుపా తరువునుండి బేతాళుని భుజమునం గొని తెచ్చుచుండెను. బేతాళుఁడు దారిలో రాజుతో నిట్లనియె:—రాజా, శ్రమాప నోదార్థము కథ యొకటి చెప్పెద వినుము. పూర్వసముద్రము నొడ్డున తామ్రలిప్తి యని ఒక నగరము కలదు. అందు చండ సింహుఁడు రాజు. ఒకనాఁడు దక్షిణదేశమువాఁడు సత్త్వశీలుఁ డను రాజపుత్త్రుఁడు జనప్రియుఁడు సింహద్వారమునకు వచ్చి, వేదటికము చే రాజుంగూర్చి తన్నుం దెలుపుకొనెను. తాను చింపివస్త్రముల వాఁ డయినందున కార్పటికుఁ డని పేరొంది పెక్కువత్సరములు రాజును కొలుచుచుండియు ఫల మేమియుం బొందఁ డాయెను. 'రాచవంశమునఁ బుట్టిన నాకు ఈదారిద్ర్య మేల కలుగవలయు! దారిద్ర్యములో నిట్టి యౌదార్య మేల సంభవింపవలయు ? ఇట్లు నేను అన్న వస్త్రములు లేక కొలుచు చున్నను రాజు సన్నిప్పటికిం గాన కున్నాఁడు.' అనియిటు

కార్పటికుఁడు తలపోయు చుండ రాజు వేఁటకై వెలువడెను. కార్పటికుఁడు దుడ్డుగుదియను చేతం గొని ముందు పరువిడుచుం డఁగా, గుఱ్ఱపుఁబౌఁజును కాల్బలమును వెంటవచ్చుచుండఁగా, రాజు మృగములకానకుంబోయి, వేఁటయాడి, యొూచెంత నొక గొప్ప యొుంటిగానిని వెంటఁదఱుముచు క్షణములో మఱియొక యడవిలోఁజొచ్చి కడుదూరము పోయెను. అచట పచ్చికచేతను ఆకులచేతను దారి కానరా ధాయెను. పంది తప్పించుకొని పోయెను. అంతట రాజు అలసి ఆమహావనములో దిక్కులు తెలియక చిక్కుసం బడెను. కార్పటికుఁడుమాత్రము ఆఁకలి దప్పులకు డస్సియు ప్రాణములపై ఆసయుంపక ఱేనిగుఱ్ఱము వెంటవచ్చుచునే యుండెను. అట్టి యవస్థలో సయితము వెంట వచ్చిన యాతనిం గని రాజు స్నేహముతో 'ఓయి, మనము వచ్చినదారిని నీవు ఎఱుఁగుదువా ? యని యడిగెను. అంత కార్పటికుఁడు చేదోయి మోడ్చి దేవా, ఎఱుంగుదును, కాని యేలినవారు క్షణ మిచట విశ్రమించుట యుచితము, ఏలన నిపుడు సూర్యుఁడు మింటినడుమ మంటలు గ్రక్కుచున్నాఁడు.' అని విన్నవించెను. ఆమాట కంగీకరించి రాజు 'అటయిన నీ విచట నెందేని త్రాగుటకు మంచినీళ్లు కలవేమో కనిపట్టుము' అని యడిగెను. సరియే యని కార్పటికుఁడు పొడవుపాటి చెట్టొకటి యెక్కి ఒకయేటిం గాంచి దిగి రాజు నక్కడికి కొని పోయెను.

అచట తేని గుఱ్ఱమును జీను విప్పి తోమి నీళ్లు పెట్టి గడ్డికవళములు మేపి సేవ దేర్చెను. రాజు స్నానము చేసి నంతట ఆయనకు కార్పటికుఁడు తనకర్పటముతుదను ముడిచి యుంచిన మనోహరంపు టుసిరికపండ్లు కడిగి తెచ్చి యిచ్చెను. 'నీకు ఈపండ్లు ఎక్కడివి?' అని రాజడుగ కార్పటికుఁడు దోసిట నుసిరిక లుంచుకొని మోఁకారించి 'మహాప్రభూ, ఈపదియేండ్లును నేను వీనిం దిని బ్రదుకుచు ఏలినవారిం గొలుచుచు ముని వ్రత మాచరించు చుంటిని.' అని చెప్పుకొనెను. 'వాస్తవముగా నీవు సత్త్వశీలుఁడవే, ఏమి చెప్ప వచ్చును!' అని పలికి రాజు కరుణించి లజ్జించి 'అయ్యో! సేవకులలో కష్టపడువారిని కష్ట పడనివారిని ఎఱుంగ లేని రాజు లేల? అట్టిభేదము నెఱుంగ నేరని పరివారమును ఏల!' అని తలపోసి, కార్పటికుని ప్రార్థనపై రెండు ఉసిరికకాయలను బుచ్చుకొని భక్షించి మంచినీళ్లు త్రాగి, అట్లే ఉసిరిక కాయలు తిని నీళ్లు ద్రావిన కార్పటికునితోఁ గూడ ఇంచుకంత సేపు విశ్రమించెను. రాజు అనంతరము కార్ప టికునిచే సిద్ధముసేయఁబడిన యాగుఱ్ఱము నెక్కి, తనకు వెనుక గుఱ్ఱము మీఁదఁ గూర్చుండుమని తా నెంతచెప్పినను వినక కార్పటికుఁడు ముందు దారి సూపుచు నడువ, తరలి, దారిలో తనపరివారమును గలసికొని నిజపురిం జేరెను. అచట సత్త్వ శీలునిభక్తని ప్రకటించియు అతనికి ధనములును దేశములును ఇచ్చియును అతనియుపకారమునకుఁ బ్రత్యుపకారము కా లేదని వగ

తలంచి యుండెను. అట్లు కృతార్థుఁడై సత్త్వశీలుఁడు కార్పటి కాచారము మాని చండసింహమహారాజునకు పార్శ్వచరుఁడై కాలము పుచ్చుచుండెను. ఒకానొకసమయమున రాజు సింహళ ద్వీపేశ్వరుని తనకు వివాహార్థము కొమారిత నడిగి రమ్మని సత్త్వ శీలుం బంపెను.

సత్త్వశీలుఁడు తన యిష్టదేవతలం గొలిచి సముద్ర మార్గమున ఓడ యెక్కి రాజు పంపిన బ్రాహ్మణులతోఁ గూడ నేగుచుండెను. ఓడ సుఖముగా సముద్రమునడిమికిం బోయి నంతట నచట వింతగా గొప్ప బంగారు టెక్కె మొకటి పలు వన్నెల వస్త్రముతోఁ గూడ సముద్రమునుండి లేచి ఆకాశము నొరయ సాగెను. అంతట ఆకస్మికముగా మొగిళ్లమొత్తములు పొడసూపి జడివాన గొట్టసాగెను. పెనుగాలియు దొరకొనెను. గాలివిసరునకు ఆయోడ కొట్టుకొనిపోయి ఆటెక్కెపు గంబ మున కంటుకొనెను. అంతట ఓడతోఁగూడ నాధ్వజస్తంభము కొండలంతయలలతోడి మహాసముద్రములో మునుంగం దొడం గెను. అంతట నందలి బ్రాహ్మణులు భయపడి చండసింహునిం గూర్చి కావుకావు మని మొఱపెట్ట సాగిరి. సత్త్వశీలుఁడు ఆ మొఱ విననోర్లక ఆయాపదకు సముద్రుఁడే కారణ మని తలంచి ప్రతీకారము సేయువాఁడై స్వామిహితము గోరి, ఉత్తరీయము మొలకు దట్టిగా కట్టి, కేలఁ గత్తిం బూని, ప్రాణమునకు తెగించి

నీట దుమికెను. గాలికి రేఁగిన పెద్దయలచే నోడ ఆకాశమున కెగసి పగిలెను. అంపలిజనులు నీటిజంతువుల వాతం బడిరి.

సముద్రాన మునింగినమాత్రాన సత్త్వశీలునికి సముద్రంపు కానఁబడఁడాయెను; దివ్యనగర మొకటి కనఁబడెను. అందు మణికంబములతో వెలుఁగొందు బంగారుమందిరంబున రతనాల మెట్లతోడి నిగుడుబావులు గల యాటతోఁట చెంగట మాణిక్యాల గోడలును రత్నాలధ్వజస్తంభంబును గలిగినదై మేరుపర్వతమునంత పొడవైన కాత్యాయనీ దేవి గుడి యొకటి వెలుంగుచుండెను. లోనంజని యమ్మవారికి మ్రొక్కి, అది యింద్రజాలమో యని ఆశ్చర్యపడుచు సత్త్వశీలుఁడు కూర్చుండెను. అంతలోపల అమ్మవారిమ్రోల నున్న ప్రభామండలకమునుండి ఆకస్మికముగా తలుపు తెఱచుకొని దివ్యకన్య యొర్తుక వెలువడియెను. ఆమెతో వేగురు చేటికలు పరివారముగా వచ్చిరి. అంత నామె అమ్మవారి గదిలోఁ జొచ్చి దేవిని పూజించి యట నుండి తరలి పరిజనసమేతముగా మరల ప్రభామండలకముం జొచ్చెను. సత్త్వశీలుఁడును ఆమెవెంటనే పోయి, యచట మఱియొక యుత్తమపురముం గనియెను. అచట రతనాల మంచముపైఁ గూర్చున్నట్టి యా కన్యామణి ప్రక్కనే సత్త్వశీలుఁడు కూర్చుండి, యామె మోమునం గనులు నాటి, చిత్తరుబొమ్మవోలె నుండెను. ఆతనియంగములు గగుర్పాటుచేతను వడఁకుచేతను కౌఁగిలించుకోరికను దెలుపుచుండినవి.

అట్లు మదనపరవశుఁడైన యాతనిం గని యాతరుణీమణి చేటికలదెస చూచి కనిగిడించెను. వారు ఇంగిత మెఱింగి సత్త్వశీలునితో నిట్లనిరి: 'అయ్యా, నీవు మాస్వామినియింటి యతిథివైతివి, కావున నామెయొసంగునాతిథ్యమును గ్రహింపఁదగును. లేచి స్నానముచేసి భోజనము కానిమ్ము' ఆమాటవిని యతఁడు ఎట్లో అటనుండి లేచి చేటికలతో నొక యుద్యాన వాపిక కేఁగి అందుఁ గ్రుంకిడినమాత్రాన తామ్రలిప్తినగరములో చండసింహ మహారాజుతోఁటబావిలో తేలెను. ఆకస్మికముగా నటఁ జేరిన తన్ను చూచికొని సత్త్వశీలుఁడు 'అహో! ఈతోఁట ఎక్కడ! ఆ దివ్య నగర మెక్కడ! అందలి యా కన్యాముఖ దర్శన మెక్కడ! వెంటనే ఆ యలరుఁబోఁడితోఁడి వియోగవిష మి దెక్కడ! ఇది కల గాదు, నేను మేలుకొనియే యనుభవించితిని. నిక్కముగా మూఘుని నన్ను ఆపాతాళకన్యలు మోసపుచ్చిరి.' అని తలపోయుచు ఆకన్నియం గోలుపోయి, వెఱ్ఱి పట్టిన వాని చందాన తోఁటలో త్రిమ్మరుచు మదనుబారింబడి ఏచ్చుచుండెను. గాలికి రేఁగిన యెఱ్ఱని పుప్పొడి మొత్తములు ఒడలెల్లం గ్రమ్ముకొనఁగా ఆతీసునం దిరుగుచున్న యాతనిం గని తోఁటమాలీలు వెంటనే ఆ వృత్తాంతమును చండసింహ మహారాజునకు నివేదించిరి. అతఁడును ఆశ్చర్యపడి వచ్చి సత్త్వశీలుం గాంచి ఓదార్చి యడిగెను. 'మిత్త్రమా, ఇదేమి? నీ వెచట బయలు వెడలితివి, ఎటఁజేరితివి! ఎటవేసినబాణము ఎటఁ బడి

నది?' సత్త్వశీలుఁడు ఉన్నది యున్నట్లు నిజ వృత్తాంత మంతయు తెలియఁ జెప్పెను. అంతట రాజు 'ఆహా! ఈ వీరుఁడును నా పుణ్యముచేత మాకునికలలో లభించినాఁడు, కాన నితని ఋణముం దీర్చుకొనుటకు నాకు సమయము దొరకినది.' అని మనంబునం దలపోసి, సత్త్వశీలుని 'ఓయి మిత్త్రమా, ఇక్లేని దుఃఖము మానుము. నేను నిన్ను ఆ దారిలోనే కొనిపోయి ఆ సుందరీ లలామతోఁ గూర్చెదను.' అని యోదార్చి ఆతనికి స్నానా ద్యుపచారములు గావించెను.

మఱునాఁడు చండసింహ రాజు రాజ్యభారము మంత్రుల కప్పగించి, సత్త్వశీలునితోఁగూడ ఓడ యెక్కి, అతఁడు చూపిన త్రోవను కడలియందు పయనంబు సాగించెను. కడలి నడుమ మునుపటివలెనే కెరటంబుతోడి ధ్వజంబము లేచెను. దానిం జూపి సత్త్వశీలుఁడు రాజుతో 'మహారాజా, ఇదే యా ధ్వజము, ఇట ముందు నేను మునిఁగెద, నావెంటనే నీవును మున్గవలయును.' అని చెప్పి, ఓడ ధ్వజస్తంభముం దఱియఁగానే తాను ముందుగా మున్నీటి పెల్లునం బడి మునింగెను. రాజు సయితము వెంటనే అట్లే పడెను అంత నయ్యిరువురును ఆదివ్య నగరముం జేరిరి. రాజు దానిం గని యాశ్చర్యపడి సత్త్వశీలుని తోఁ గూడ నాపార్వతీదేవికిం బ్రణమిల్లి యటఁ గూర్చుండెను. అంతలో నచ్చటికి ప్రభా మండలకమునుండి తలుపు తెఱచుకొని యాకన్య సఖసమేతయై వెడలి వచ్చెను. సత్త్వశీలుఁడు ఆమెయో

తాఁ జెప్పినదివ్యాంగన యని రాజునకుఁ దెలిపెను. ఆకన్యయు శుభలక్షణలక్షితుని చండసింహుం గని అతఁ డెవరో అపూర్వ మహాపురుషుఁ డని తలంచి, అమ్మవారి పూజకై లోపలి సన్నిధికిం బోయెను. రాజు అలక్ష్యముగా సత్త్వశీలుని తోడ్కొని యచ్చట నున్న యుద్యానవనమునకుం బోయెను. క్షణములో ఆదైత్యకన్య పూజ ముగించి, మంచిమగని నిమ్మని అమ్మవారిని వేఁడుకొని గర్భగృహము వెలువడి ఒక చేటిం బిలిచి 'చెలీ, ఇందాఁక నే నిటఁ గాంచిన మహాపురుషుఁ డెచ్చట నున్నాడో వెదకుము ; ఆయన ఎవరో పురుషోత్తముఁడు, పూజ్యుఁడు; కరుణించి వచ్చి యాతిథ్యముం గొను మని వేఁడుము.' అని బోధించి పంపెను. అదియును వెదకి మహారాజుం గని వినయముతో తనస్వామినియానతిప్రకారము విన్నవించెను. రాజు బీరము విడక సరకుగొనక దానితో 'మా కిదియె యాతిథ్యము, వే ఉపచారము లేల ? అని పల్కెను. అది పోయి స్వామినికి ఆమాట విన్నవింప నా యసురాంగన మనుష్యుల కందనియాతిథ్యమును సైతము సరకు సేయని యాతని యౌదార్యమునకు మెచ్చి, తనకు వివాహార్థమై లభించిన పూజాఫలముగా నతనిని భావించి, స్వయముగా నా యుద్యానమునకుం బోయి వినయ సంభ్రమములు మీఱ చండసింహునిం బలిసి యాతిథ్యము గొను మని వేఁడెను. అతఁడు సత్త్వశీలుం జూపి యి ట్లనియె:— 'నే నిచటి దేవిని ఇతనివలన విని కన

వచ్చితిని. ధ్వజసూచితమార్గమున ఈపరమాద్భుతస్థానమందలి యీ దేవతను దర్శించితిని. నిన్నునుం గంటిని. ఇట నాకు అతి థ్యావసర మెక్కడిది?' అట్లతఁడు పల్కఁగా, నయ్యసురకన్య 'అట్లని, యోమహానుభావా, ముల్లోకములలోను వింతలకు వింతయైన నా రెండవనగరముం గాంతువు రమ్ము.' అని పిలిచెను. రాజు నవ్వి ఎఱుంగుదు నెఱుంగుదును, దానిఁ గూడ నితఁడు చెప్పినాఁడు, ఆ స్నానపు బావిగల ప్రదేశము గదా.' అనెను.

కన్య యి ట్లనియెః—'దేవా, అట్లు పలుకఁ దగదు, నేను మోసగత్తెను గాను. పూజ్యుల విషయమందు మోసమా? మీసత్త్వాతిశయముచేత నేను మీకు దాసి నైతిని. కావున నా వేఁడికోలును భంగపఱుపఁ దగదు.' అని ప్రార్థించెను. అంతట రాజు అంగీకరించి, సత్త్వశీలునితోఁ గూడ ఆమెతో ఆ ప్రభామండలకము చెంత కేఁగెను. దానితలుపు తెఱచి ఆమె తన్నుం దోడ్కొని లోనికి పోఁగా నచట రాజు ఆమెదైన యీ రెండవ దివ్యనగరముం గాంచెను. ఎల్లప్పుడును సకల ఋతువులకు నాటపట్టయి, ఎల్లప్పుడును పూవులుం గాయలుం గల తరులతలచే నభిరామం బయి, రత్నకాంచనమయం బై, యానగరము మేరువునెత్తమువోలె విరాజిల్లుచుండెను. ఆమె రాజును రతనంపు గద్దియపైఁ గూర్చుండఁ జేసి, తగిన యర్ఘ్య మొసంగి, యిట్లు వక్కాణించెను. 'నేను మహాత్ముఁ డయినయసురేంద్రునికి కాలనేమికి తనయను, నాతండ్రిని చక్రాయుధుఁడు స్వర్గముం

జేర్చెను. ఈరెండునగరములును నాతండ్రికై విశ్వకర్మ నిర్మించి నవి. ఇచట నెల్లకోరికలుం దీఱును. ఇందు ముదిమియు చావును లేవు. నాకు ఇపుడు నీవ తండ్రివి. ఈపురములతో నేను నీవశమందు ఉన్నాను.' ఇట్లామ సర్వస్వసమేతముగా తన్నర్పించుకొనఁగా రాజు 'అక్కని, ఓనాపుత్త్రి కామణీ, నే నిదె నిన్ను ఈవీరునికి మిత్త్రునికి బంధునికి సత్త్వశీలునికి ఇచ్చి తిని.' అనియెను. మూర్తిం దాల్చినదేవీప్రసాద మో యన నొప్పుచున్నరాజు ఇట్లు పలుకఁగా, గుణగ్రహణప్రవీణయాకన్య సరియే యని యంగీకరించెను. అంతట రాజు వారికి వివాహముం గావించి సత్త్వశీలునికి కృతార్థునికి అసురపురైశ్వర్య మొసంగి యిట్లనియె:—'మిత్త్రమా, అపుడు నేను భుజించిన యారెండు ఉసిరికాయలలోను ఒకదానిఋణము ఇప్పటికి తీర్చుకొంటిని. రెండవదానికై యింకను ఋణపడియున్నాఁడను' రాజు ఇట్లు నమ్రుని సత్త్వశీలుని మందలించి దైత్యకన్యను తాను నిజనగరము నేర దారి సూపు మని యడిగెను. ఆమె రాజునకు అపరాజిత మనుపేరి కత్తియు, జరామృత్యుహర మైన పండును ఇచ్చెను. వానిం గైకొని చండసింహుఁడు ఆమె చూపిన యా బావిలోఁ గ్రుంకి తనదేశములో తేలి క్రమముగా ఎల్లకోరికలు తీరినవాఁడై సుఖముండెను. ఇట సత్త్వశీలుఁడును దైత్యకన్యా నగరిద్వయమును నేలుచు సుఖముండెను:—

అని బేతాళుఁడు కథ ముగించి యడిగెను.—'మఱి చెప్పుము, మున్నిటం గ్రుంకుటయందు ఆ రాజ సత్త్వశీలు రయిపురలో సత్త్వాధికుఁ డెవఁడు?' విక్రమార్కుఁ డిట్లనియె:— ఆయిరువురలోను సత్త్వశీలుఁడే సత్త్వాధికుఁడు, అతఁడు గదా తత్త్వ మెఱుఁగక నిష్ప్రయోజనుఁడై దుమికినవాఁడు. రాజు తత్త్వ మెఱిఁగి ఆస్థ గలిగి దిగినవాఁడు రాజు దైత్యకన్యను కోరికలకు దొరకదని కోరఁడాయెను.' ఇట్లు మౌనము మాని విక్రమార్కుఁడు పలుకఁగా బేతాళుఁడు సంతసించి మునుపటివలెనే తన యిక్కయగు శింశుపావృక్షమునకుం బోయెను. విక్రమార్కుఁడును మరల నతనిం దెచ్చుటకు వెంటనే పోయెను. మహాత్ములు తొడంగిన పని ముగింపక జతనము నుజ్జగింపరు గదా

---

క థ—౮

---

వెండియు విక్రమార్క మహారాజు ఆ శింశుపావృక్షంబు కడ కేఁగి నర శవ గతుని బేతాళుని భుజంబునం బెట్టుకొని భిక్షువుకడకు వచ్చుచుండెను. దారిలో బేతాళుఁ డిట్టు లనియె: రాజా, శ్రమపరిహారార్థము ఈకథ వినుము.—అంగదేశమున వృక్షపుట మని గొప్ప యగ్రహారము కలదు. అందు మహా ధన వంతుఁడు బ్రాహ్మణుఁడు యజ్ఞ విష్ణుస్వామి యని యుండెను. ఆయనకు అనురూప యైన భార్యయందు ముగ్గురు పుత్త్రులు

జనించి కాలక్రమమున యౌవనవంతులయి తద్దయు నేర్పరులయిరి. ఒకానొకప్పుడు తండ్రి యాగము దొడంగి తదర్థమై తాఁబేటి నొకదానిం దెమ్మని పంపఁగా, వారు ముగ్వురును సముద్రమున కేఁగి తాఁబేటి నొకదానిని సంపాదించిరి. అంతట పెద్దవాఁడు అనుజులతో 'నాయన సేయు క్రతువునకై మీ యిరువురలో నొకఁడు ఈతాఁబేటిని మోచికొని పోవలసినది. నీచుఁగంపు కొట్టుచు పట్టు ఇయ్యక చేయిజాఱుచున్న దీనిని నేను గొనిరాను' అని చెప్పెను. 'దీనిం గొన నీకు రోఁతయేని మా కేల అది యుండదు?' అని తమ్ము లడిగిరి. 'మీరు తప్పక దీనిం గొనిపోవలసినది. గొనిపోరేని నాయనకు క్రతుభంగము చేసిన పాపము మీకుఁగలుగును, దాన మీరు తప్పక నరకముసం గూలుదురు.' అని యన్న మరల వారిని మందలించెను. అంతట తమ్ములు నవ్వుచు 'మాకు నీ విప్పుడు చెప్పిన ధర్మము నీకును సమానమేగదా.' అనిరి. 'ఏ మట్లు పల్కెదరు, నా నేర్పును మీ రెఱుఁగరా? నేను తిండి నేర్పరిని గానా ? కాన రోఁతవస్తువును దాఁకుట నాకు సరిపడదు.' అని యన్న మాఱు పల్కెను. అంతట నడిమివాఁడు, 'ఓహో! అట్లైన నే నంతకన్న నేర్పరిని, నేను పడఁతి నేర్పరిని గదా' అనెను:—'అటు లయిన, కడగొట్టు వాఁడు వీఁడు దీనిం గొనిపోవుఁ గాక,' అని యన్న పలికెను. అంతట కడవాఁడు కనుబొమలు ముడిచి 'ఓరీ మూర్ఖులారా,

నేను గదా మనయందఱిలోను ఎక్కువ నేర్పరిని; నేను పడకి నేర్పరిని గా నటరా!' అని జగడ మాడెను

ఇట్లు వారు కలహించి, నిర్ణయార్థమై తాఁ జేటిసి బాలిఱ వైచి, ఆ చెంగట విటంకపురము నేలుచున్న ప్రసేనజిత్తుకడకుం బోయి, ప్రతీహారముఖముగా తమ రాక రాజున కెఱింగించుకొని, దర్శించి, వచ్చిన కార్యముం దెలుపుకొనిరి. రాజు వేడుకపడి వారిని నిలిపి పరీక్షింప సమకట్టి, తన భోజన సమయమున అగ్రభోక్తలనుగా గూర్చుండఁబెట్టి వారికి రాజార్హము లైన షడ్రస భోజనంబులు పెట్టించెను. అందఱును భుజించుచుండఁగా, భోజనచంగుఁడు మాత్రము ఏమియు భుజింపనొల్లక మొగము ముడిఁచికొని రోఁతపడుచు ఉండెను. రాజు 'ఓ బ్రాహ్మణా, నెత్తావులు వెదజల్లుచున్న తియ్యని యీ యోగిరంబులను ఆరగింప వేమి?' అని యడుగఁగా, 'రాజా, ఈబియ్యపుటన్నము పీనుఁగు పొగ కంపు కొట్టుచున్నది, ఎట్లు భుజింతును?' అని యుత్తరము చెప్పెను. అంతట రాజు అందఱను పరీక్షింపు మనెను. అందఱును వాసన చూచి,ఆవరిబియ్యపుటన్నము పరిమళించుచున్న దనియు నిర్దోష మనియు వచించిరి. భోజనచంగుఁడు మాత్రము దానిని దినక ముక్కు బిగఁ బట్టుకొని కూర్చుండెను. రాజు అధికృతులను రావించి క్రమముగా విచారింపఁగా, ఆ యన్నంపు వరి వారి వల్లకాటి చెంగటి పొలమునం బైరైనదిగా తెలియ వచ్చినది. రాజు ఆశ్చర్యపడి యాతనితో 'సత్యముగా నీవు భోజన

చంగుఁడవే. కడమ మంచి పదార్థములను భుజింపుము.' అని పల్కెను.

భోజనానంతరము రాజు ఆ బ్రాహ్మణులను పడుక టిండ్లకుం బంపి, తన వార సుందరి లలామను అలంకరించి ఆ రెండవవాని కడకుం బంపెను. రాజభృత్యులు తోడి తేరఁగా గణిక గదిలోపల నడు గిడియు నిడక ముందే నారీచంగుఁడు మూర్ఛిల్లనై ఎడమచేతి వ్రేళులతో తన ముక్కు బిగఁబట్టి, ఆవెలయాలిని అవలికి కొని పొం డనియు, క్షణము మసలిన తన ప్రాణము పోవు ననియు, దానియొడలినుండి మేఁకకంపు గొట్టుచున్న దనియు, రాజభృత్యులను బతిమాలుకొనెను. ఆ చర్యకు వేశ్య డిల్లవోయెను. రాజభృత్యులు దాని నవలికి కొనిపోయి రాజున కా వృత్తాంతముం దెలిపిరి. అంత రాజు నారీచంగుని రప్పించి, 'ఓ బ్రాహ్మణుఁడా, కపురము, గందము, అగరువు, కస్తూరి, వీనితో నలంకృత యై దిక్కుల నెత్తావులు గుబాళించుచున్న యీ వారవిలాసిని దెస మేఁక కం పెక్కడి దయ్యా?' అని యడుగఁగా, నారీచంగుఁడు తనమాటయే మరలం బలికెను రాజు విచారణ సేసెను. అంత నా వారవనితవలననే అది బాల్యమునందు తల్లిని, దాదినిం, గోలుపోయి మేఁకపాలం బెరిఁగిన దని తెలియ నాయెను. అంత నత్యంతాశ్చర్యము పాలయి రాజు నారీచంగునిచతురతను మెచ్చుకొని, ఆయుత్సాహముతో మూఁడవవానికి తూలికాచంగునికి మంచముపై

ఏడుపదులుపులు ఒకదానిమీఁద నొకటి పఱిపించి మీఁద తెల్లని చలువ దువ్వలువ కప్పించి పఱుక సిద్ధము చేయించెను.

అందుపై రాత్రి అరజాము నిద్రించి తూలికాచంగుఁడు ఏడ్చుచు, నొప్పి చెప్పుచు, చేత దేహపార్శ్వమును పట్టుకొని, లేచెను. అచట నున్న భటులు అతనిఁబరికించి, అతనిప్రక్కలో వంకరగా ఎఱ్ఱనైన యొక ముద్రను తలవెండ్రుకవంటిదానిని గని, పోయి రాజుతోఁ జెప్పిరి. సెజ్జలో నేమయిన వెండ్రుక ఉన్నదేమో పరికింపుఁడని రాజు ఆజ్ఞ యిడఁగా, వారుపోయి వెదకి ఏడుపదులుపులకును క్రింద మంచము మీఁద వెండ్రుకం గనిపట్టి రాజునకుం జూపిరి. రాజు పరికించి, తూలికాచంగుని యొడలిప్రక్క నున్న ముద్రకు ఆ వెండ్రుక సరిపోవుటం గని, 'ఏడుపదులుపుల క్రింది వెండ్రుక ఇతని యొడల నెట్లొత్తుకొన్నది? అని యాశ్చర్యమగ్నుఁడయి ఆరాత్రి గడపి మఱునాఁడు వారి యబ్బురపు నేర్పులకై ముప్వురుచంగులకును మూఁడు లక్షల వరహాలిచ్చెను. అంతట నా ముప్వురును తండ్రితోఁబేటిని మఱచి తండ్రి యజ్ఞమును చెఱిపిన పాతకమును కట్టుకొని ఆ నగరముననే సుఖముండిరి.—

ఇట్లు కథ చెప్పి బేతాళుఁడు విక్రమార్కుని ఎప్పటి శాపమును జ్ఞాపక పఱచి ఆ ముప్వురలో చంగతముఁ డెవఁడో చెప్పు మని యడిగెను. బుద్ధిమంతుఁడా మహారాజి ట్లనియె. 'ఈ ముప్వురలో కపటమున కవకాశము లేని తూలికాచంగుని

అధికునిఁగా నెంచెదను, అతనియొడలం బ్రత్యక్షముగా వెంప్రుక యొత్తడి కనఁబడెను, ఇతరులు ఆ యా విషయములను ముందుగా నుపాయాంతరముల నెఱింగిన నెఱుంగ వచ్చును.'—ఇట్లు తండు పల్కినంతట బేతాళుఁడు మౌనభంగమునను సంతసించి బుజమునుండి మాయ మాయెను. రాజు విసువక పండేయు నతనిం దేఁబోయెను.

---

కథ—౯.

విక్రమార్కుఁడు వెండియుం బోయి శింశుపావృక్షమునుండి బేతాళుని శవగతుని బుజంబునం గొని శ్రమణునికడకుంబోవు చుండ, బేతాళుఁ డిట్లనియె:— రాజా, దొరతన మెక్కడ? వల్లకాటిలో రాత్రి ఈరీతిం ద్రిమ్మరుట యెక్కడ? బూతంబులు నిండి, పొదల పొగలో యన అంతటను చీఁకట్లు జిమ్మనుచున్న, యీ రాత్రివేళ భయంకరమైన యీశ్మశానము నీకుం గనఁ బడదా యేమి? ఆ పాడు శ్రమణునికై నీ కింత పట్టుదలయేని, మార్గ వినోదార్థ మీప్రశ్న వినుము. ఈ యవంతిదేశమున ఈ చతుర్యుగమునకు ఆరంభములో దేవతలు ఈ యుజ్జయినీ నగరిని నిర్మించినారు. దీనికిఁ గడచిన మూఁడు యుగముల యందును, పద్మావతి, భోగవతి, హిరణ్యావతి యని పేరులు. ఇందు రాజేంద్రుఁడు వీరదేవుఁ డేలుచుండెను. ఆతనిపట్టపుదేవి

పేరు పద్మవతి. ఆమెను తోడ్కొని ఆరాజు మందాకినీ తీరమున్కు కేఁగి చిరకాలము పుత్త్రార్థమై తపస్సు సలిపి త్రిపురహరుని మెప్పించెను. అనంతరము స్నానార్చనవిధాన మయిన తర్వాత హరునియాజ్ఞ నతి ఈతీరున మింటినుండి వినఁబడెను. 'ఓరాజా, నీకు వంశకరుఁడు శూరుఁడు నగు కొమారుఁడు మున్నుగా జనించును, అనంతరము అచ్చరల మెచ్చని జగ్గు నిగ్గుల కూఁతు రొకతె పుట్టును.' ఇట్లు వరము పొంది యా మహారాజు పట్టపు దేవిం దోడ్కొని నిజరాజధానికిం బోయెను.

అట్లే ఆ దంపతులకు తొలుత శూరదేవుఁడని కుమారుఁడును పిమ్మట కన్యయు కలిగిరి కన్యకు తండ్రి యనంగరతి యని పేరుపెట్టెను. ఆకన్యకు వయసు వచ్చినంతట తండ్రి నానా నృపకుమారుల ప్రతిమా పటములను తెప్పించి చూచి, ఒక్కని నేనియు ఆమెకు సరియైనవానిం గానక, ఆమెతో నిట్లు పలికెను — ' పట్టీ, ఎంత వెదకియు నీకు సరియైన వరుని నేను గాననైతిని, రాజుల నెల్ల రావించెద, స్వయంవరమున నొక్కని వరియింపుము.' కొమారిత యిట్లు బదులు పల్కెను:—నాయనా స్వయంవరము చాటుటయు, చివరకు అవమానము దెచ్చుటయు, నే నొల్లను. మంచి యాకృతికలవాఁడై ఒక్కవిద్యను దేనినేని చక్కఁగ నేరిచిన యౌలజవ్వనపు వరునికి నన్నిమ్ము, అంతకన్న నధికుఁడు నా కక్కఱలేదు.' ఆమాటవిని రాజు అది మొదలుగా నట్టివారిని వెదకించుచుండెను.

అంత నావృత్తాంతమును లోకులవలనవిని దక్షిణదేశము నుండి, నలువురు వీరులు విజ్ఞానులు సుందరాకారులు వచ్చిరి. అందు ఒకఁడు శూరుఁడు, అతఁడు తనపేరు పంచపట్టికుఁ డనియు, తాను దినమునకు అయిదు దోవతులచాఁపులు నేయు ననియు, అం దొకచాఁపు దేవునికి, ఒకటి బ్రాహ్మణునికి, ఇచ్చు ననియు, తనకు వస్త్రార్థ మొకటి, వివాహ మైనపిమ్మట భార్యకు వస్త్రార్థము ఒకటియు, ఒకటి యన్న పానాదికములకును విని యోగించువాఁ డనియుం దెలిపి తా నట్టివిద్దె గలవాఁడగుటచేత అనంగరతిని తన కీయవలయు నని యడిగెను. రెండవవాఁడు వైశ్యుఁడు, పేరు భాషాజ్ఞుఁడు, సకల జంతు భాషల నెఱింగిన వాఁడు. అతఁడు ఆవిద్యనుబట్టి తనకు రాజకన్య నడిగెను. మూఁడవవాఁడు ఖడ్గధరుఁ డను క్షత్త్రియకుమారుఁడు, బాహు శాలి కత్తిసాములో నతనికి సములు లేరు. ఆకారణంబున నతఁడు అనంగరతిని తన కిమ్మనెను. నాలవవాఁడు బ్రాహ్మణుఁడు, పేరు జీవదత్తుఁడు, ఇంద్రజాలికుఁడు, చచ్చిన జంతువుల నెల్ల క్షణములో బ్రదికింపఁగలవాఁడు, అతఁడు ఆవిద్యం జెప్పి అనంగ రతిని తన కిమ్మని యడిగెను. ఇట్లు లక్షణవంతులు నలువురుం బలుక రాజును రాజతనయయు నేమి సేయనుం దెలియక డోలాయమాన మానసు లై యుండిరి.

ఇట్లు కథ చెప్పి బేతాళుఁడు మునుపటి శాపమును జ్ఞప్తి పఱచి విక్రమార్కుని 'ఓ రాజా, ఆనలువురలో ననంగరతిని

ఎవని కీయవలసినది?' అని యడిగెను. రాజిట్లనియె:—'యో
గీశ్వరా, నామౌనమును చెఱుచుటకు ప్రశ్నల నిట్లు కల్పించు
చున్నావు గాని, ఇందులో తెలియ రాని విషయ మే మున్నది?
శూద్రునికి సాలీనికి క్షత్రియకన్య నెట్లీయ నగును? వైశ్యుని
కేనియు క్షత్రియ నెట్లీయ నగును ? అతని మృగాది భాషా
విజ్ఞానమునకు ఉపయోగ మేమి? నాలవవాఁడు విప్రుఁ డయినను
ఐంద్రజాలికుఁడై స్వకర్మ భ్రష్టుఁడై యుండ నతనికి కన్య నె
ట్లీయ నగును ? కావున క్షత్రియునికి స్వవిద్యావీర్యశాలికి సము
నికి సమను క్షత్రియను అనంగరతిని ఈయ వలయును.'

ఈవిధమున మౌనభంగము గావించి బేతాళుఁడు మరల
తన యిక్కకేఁగెను. రాజు మరల వానిం చేర నరిగెను. ఉత్సా
హైకధను లగు వీరులహృదయమున విసుగు పొడసూపదు.

---

## కథ—౧౨.

మరల విక్రమార్కుఁడు శింశుపాతరువునుండి బేతాళుని
బుజంబునం గొని యథాప్రకారము పోవుచుండ, బేతాళుఁడు
ఇట్లనియె:—రాజా, అలసియున్నాఁడవు, కాన శ్రమాపహారిణి
నీకథను వినుము:— వీరబాహు వని రాజాధిరాజొకఁడు
ఉండెను. ఆయనరాజధాని యనంగపుర మను నగరము. అందు
మహాధనికుఁడు అర్థదత్తుఁడని సార్థవాహుఁ డొకఁ డుండెను.

అతనికి ధనదత్తుఁ డని కుమారుఁడును వాని చెల్లెలు మదనసేన యనుకూఁతురును ఉండిరి. ఆ కన్యారత్న మొకనాఁడు చెలుల తోఁ గూడ నుద్యానవనమున నాడుకొను చుండఁగా అన్న చెలికాఁడు ధర్మదత్తు డను వణిక్కుమారుఁడు కాంచెను. ఆకన్య కనులకుఁ దోఁచిన మాత్రాన ధర్మదత్తుఁడు మదనుని ములుకులకు గుఱియై డిల్లవోయి ఆమెను రెప్పవేయక కను చుండెను. ఇంతలో నతనికి చక్రవాకమునకుం బోలె ప్రొద్దు గ్రుంకెను. అంత మదనసేన తనయింటం బ్రవేశించను, ఆమెం గనిన దుఃఖము ధర్మదత్తునియెదలోను బ్రవేశించెను ప్రొద్దు గ్రుంకెను. చంద్రుఁడు మెలమెల్లన మింటం బొడసూపెను. ధర్మదత్తు. డింటికిం బోయి ఆమెను ధ్యానించుచు శయ్యాపయిం బడి చంద్రపాదముల తాఁపులకు చీకాకు పడుచు ఉండెను. మిత్త్రులును బంధుగులును ఎంత యడిగినను మదనపిశాచము గొట్టినవాఁడై ఏమియు మాఱు వలుక కుండెను రాత్రి ఎట్లో కొంచెము నిద్రం గూరి కలలో నా కన్యారత్నముం గని బతి మాలుకొని ఏ మేమి చేసెనో! వేకువనే మేలుకాంచి పోయి, ఆచెలువను ఉద్యానమున చెలికై ఒంటి వేచియున్న దానిని ఏకాంతమునం గని, కౌఁగిలి గోరి నేర్పు మెఱసిన ననుఁబల్కుల బెలిపించి యిట్టుగుల వ్రాలెను.

కన్య యి ట్లనియెః— 'నేను కన్యను, నీ కిపుడు పర భార్యను; ఏలన,నన్ను మానాయన సముద్రదత్తునికి వాగ్దానము

చేసినాఁడు. కొలఁది దినములలోనే నాకు పండిలి. కావున ఊరక పొమ్ము. ఎవరేని చూచిన చెఱుపగును.' ధర్మదత్తుఁడు 'నాకేమయిన నగుఁగాక, నీవు లేక నేను బ్రదుకఁజాలను' అనియెను. అంతట వణిక్కుమారి బలాత్కార శంక గలదై భయపడి యతనితో నిట్లనియె:— 'అటు లయిన, నాకు వివాహము కానిమ్ము, మా నాయనకు చిరకాంక్షిత మయిన కన్యాదాన ఫలంబు గలుగును గాక. అనంతరము నిశ్చయముగా నేను నిన్నుఁ గూడెదను. నీవు అనురాగముచేత నన్ను గడించితివి.' ఆమాట కతఁడు 'నాకు అన్యపూర్వ పనికి రాదు. ఒరులు పీల్చినతామర తేఁటిని దివుచునా?' అని బదులాడెను అంతట మదనసేన 'అటు లయిన వివాహ మయిన మాత్రాన మగనిం గూడకయే నేను నిన్నుం గలసెదను, అనంతరము మగనిం గలసెదను.' అని పల్కెను. అట్లు పల్కినను ధర్మదత్తుఁడు ఒట్టు లేక వదలనందున, ఒట్టు పెట్టుకొని సత్యము చేసి విడిపించుకొని భయముతోనే యిల్లు సేరెను

లగ్నదినము రాఁగా, వివాహమంగళము జరిగినపిదప మగనియింటం బ్రవేశ మయి పవ లెల్ల నుత్సవంబునం గడపి రాత్రి మగనితోఁగూడం బడుకటింట చేరియు, అతనితోఁగూడ శయ్యాగత యయ్యును, అతని కౌఁగిటికిం బోక, యొల్లమిగా నూరకుండెను. అతఁడు మంచితనమున వేఁడఁగా మదనసేన కన్నీళ్లు నించుకొని యుండెను. అంత నతఁడు తనయం దామెకుం

ప్రీతి లేదని తలంచి ఓసుందరీ, నామీఁద నీ కిచ్ఛ లేదేని నీతో నాకును పనిలేదు, నీకు ప్రియుఁ డెవఁడో వానికడకు నీవు పొమ్ము' అని పలికెను. అంత నాచెలువ తల వాంచి మెల్లగా 'ఆర్యపుత్త్రా, నీవు నీకు ప్రాణములకన్నం బ్రియుఁడవు, ఒట్టు పెట్టుము. నావిన్నప మొండు గలదు, నాకు అభయమిమ్ము చెప్పెదను.' అని విన్నవించెను. అతఁ డంగీకరింపఁగా ఆమె సిగ్గును వగయు భయంబును బెనంగొన నిట్లనియె:—
'మున్నొకనాఁడు నేను మాయింటితోఁటలో నొంటిపాటున నుండఁగా, మాయన్న చెలికాఁడు ధర్మదత్తుఁ డనువణిక్సుతుఁడు తన్ను అడ్డగించి తనకౌఁగిటికి రమ్మని వేఁడెను ఆతఁడు హితము సేయ నుంటం గని, మానాయనకుఁ గన్యాదానఫలము సెడు ననియుం దలంచి, నేను, 'మున్నుగా నా వివాహము కానిమ్ము, వెంటనే నిన్నుం గూడెదను.' అని సత్యము చేసి వాని నాఁపితిని. కావున, ఆర్యపుత్త్రా, ఇపుడు ఆ సత్యమును పరిపాలించుకొన నాకు సెల విమ్ము. వానియొద్ద కేఁగి వెంటనే నిన్నుం జేరెదను. పిన్నటనాఁటి నుండియును అలవాటు పడిన సత్యమును భంగపఱుప నొల్లను.'

ఈ మాట పిడుగుదెబ్బయుం బోలె తన గుండియం దాఁకుడు, సముద్రదత్తుఁడు కలగుండుపడి తెప్పిరిలి సత్యమునకుం గట్టువడి 'ఆహా! ఎఱుఁగనైతి; ఇది పరపురుషాసక్త! ఎట్టయినను ఇది పోవునదియే కాన దీని సత్యమును నేనుఁ

జెలుగ నేల ? పోవుఁ గాక, ఇన్నికై నాకింత పట్టుదల యేల? ' అని యాలోచించి ఆ కలికిని పో నిచ్చెను.

మదనసేన యంతట లేచి మగనియింటినుండి తరలెను. అప్పుడే రేరాజు పొడసూపెను. చీఁకటియు విరిసియు విరియక యుండెను. ఆసమయమున మదనసేన ఒంటరిగా ధర్మదత్తుని సంకేతస్థానమునకుం బోవుచుండ, దారిలో దొంగ యొకఁడు తలుముకొని వచ్చి 'ఎవతెవు నీవు ? ఎచటి కేఁగెదవు?' అని యడిగెను. అంత నాతొయ్యాలి 'ఆజోలి నీ కేల, నన్ను వదలు, నా కిటం బని యున్నది.' అనెను. 'నేను దొంగను, నన్ను ఎట్లు తప్పించుకొని పోవుదువు?' అని దొంగ పలికెను. 'అటయిన ఈ యాభరణములం గైకొనుము' అని మదనసేన చెప్పెను. అంతట వాఁడు 'ఓ గోలా, ఈరాలు నా కేల? నీవు వలయు గాని. నిను నే విడువఁ జాలను.' అని వాక్రుచ్చెను. చోరునకు ఇట్లు పలుక నావనితకు మారి చేయునది లేక తన వృత్తాంతము వానికిం జెప్పి 'ఓ సౌమ్యుఁడా ఒకించుక తాళుము, ఇచటనే యుండుము, సత్యము పాలించి వచ్చి నిన్నుం గూడెదను' అని వేఁడుకొనెను. వాఁడును ఆమెను సత్యసంధనుగాఁ దలంచి వదలిపెట్టి యటనే ఆమె నెదురుచూచుచుండెను. అంత నామె ధర్మదత్తునికడకుం బోయెను. అతఁడు తాను వలచిన యాప్రే యసి వచ్చి ఏకాంతమున నొంటిపాటున కై వసమై యున్నను, తమకపడక వృత్తాంత మడిగి క్షణ మాలోచించి ' ఓ తరుణీమణీ,

నీసత్యమునకు సంతసించితిని. పరదారవు నీవు నా కేల? నిన్ను ఎవ్వరు నొరులు చూడకముందే వచ్చిన దారిని బొమ్ము.' అని పల్కి వదలెను.

అంత నాకన్యామణి తన్ను దొంగ ఎదురు సూచుచున్న తావునకు వచ్చెను. వాఁడును ఆమెను పోయినచోటివృత్తాంత మడిగి విని 'అటులేని నేనును నీసత్యమునకు మెచ్చితిని, నిన్ను వదలితిని, నీ యాభరణములతో నింటికిం బొమ్ము' అని పలికి తోడుగా వెంటఁ బోయెను. అట్లు మదనసేన శీలభ్రంశము లేక సంతోషముతో పోయి రహస్యముగా మగనియిల్లు చొచ్చి, మగఁ డడుగఁ వృత్తాంతము చెప్పెను. నెమ్మోము తేట వాడక సంభోగలక్షణములు లేక యున్న భార్యం గని చారిత్రము చెడ లే దని యెఱింగి ఆ సత్యమునకును ఆ మంచిమనస్సునకును సంతోషించి తనకుం దగిన యిల్లా లని తలఁచి సముద్రదత్తుఁడు ఆమెతో సుఖముండెను.

ఇట్లు రుద్రభూమిలో కథ చెప్పి బేతాళుఁడు రాజును 'ఓ రాజా, సముద్రదత్త చోర ధర్మదత్తులలో ఎవఁడు త్యాగి? ఎఱింగియు చెప్పవేని నీతల వేయి వ్రయ్య లగుట ఎఱుంగుదువు గదా?' అని యడిగెను. రా జనియె:— 'వీరిలో దొంగ త్యాగి, వైశ్యు లిరువురునుం గారు. కులీనుఁడు పతి వివాహ మైనను, అన్యాసక్త యని యెఱింగి, ఎట్లుంచుకొనును? ధర్మదత్తుఁడును అప్పటికి కాలక్రమమున మరు లుడిగి తన యపరాధమును మఱు

నాఁడు భర్త రాజున కెఱింగించు నని భయపడి వదలినాఁడు. దొంగయో, ఎవ్వరికిం దెలియ రాకయే వ్యవహరించువాఁడు, సదా పాపమున కొడిగట్టినవాఁడు వాఁడు స్త్రీరత్నమును నగల తోడ విడిచెను గాన వాఁడే త్యాగి.' రాజు మౌనము విడిచి యిట్లు పలుకఁగా బేతాళుఁడు మరల బుజమునుండి లేచి పోయెను. రాజు విసువక మరల వానిం దేఁబోయెను.

---

## కథ—౧౧.

మరల ఎప్పటియట్లు విక్రమార్క రాజు శ్మశానములో బేతాళుని బుజమునం బెట్టుకొని శ్రమణుని కడ కేతెంచుచుండ, బేతాళుఁడు వినోదార్థ మని రాజున కీకథ చెప్పెను:—

ఉజ్జయినీనగరమందు ధర్మధ్వజుఁ డని మహారా జుండెను. ఆయనకు ఇందులేఖ, తారావళి, మృగాంకవతియు. నని సాటి లేని లావణ్యము గలవారు ముప్వురు దేవేరులు అత్యంతప్రియ లుండిరి. ఆరాజు ఒకప్పుడు వసంతకాలములో ఆ సుందరీమణు లను దోడ్కొని యుద్యానవనమునకుం బోయి వారి సంగడిని మద్యపాన మారంభించి, వారు త్రావి యెంగిలిచేసి యిచ్చిన సారాయిం బానము చేయుచుం గ్రీడించుచుండెను. సయ్యాటలో రాజు పెద్దరాణిని ఇందులేఖాదేవిని సిగఁ బట్టుకొనఁగా నామె చెవికొనయందలి నల్లగలువ చిలుదొడ్డపై పడెను. అంత నా

కోమలి లేడయందు గాయపడి సొమ్మసిల్లి, మంచునీరు చలువ గాలి లోనుగా పరిజనులు రచించినశీతలోపచారములకు తెప్పిరి లెను. అంత రాజు ప్రేయసిని రాజధానికిం గొనిపోయి వైద్యుని రావించి గాయమునకు కట్టు కట్టించి వాసి చేయించెను. ఆమె స్వస్థత నొందం గాంచి, రాజు రాత్రి రెండవదేవి తారావళితో చంద్రప్రాసాద మెక్కి విహరించుచుండెను. అచట నతని కవుం గిట నామె నిద్రించుచుండి, వస్త్రము తొలంగిన చోట దేహ మందు చంద్రకిరణము సోఁకనంతనే తటాలున నులికిపడి 'హా! హా! నాయొడలు కాలినది!' అని పలుకుచు సెజ్జనుండి లేచెను. అంతట రాజు నివ్వెఱపడి మేలుకాంచి ఆమెయొడలం బొడమిన బొబ్బలం గాంచి కారణమడిగెను వస్త్ర మెడలినతావున చంద్ర కిరణము దాఁకి యట్టు గావించె నని తారావళి తెలియఁ జేసి మంటకు నేడ్చుచుండ, రాజు ఆమెయూడిగపుటాండ్రను పిలిచి వారిచే నామెకు నీటిబొట్లతోడి తామరాకులపాన్పు పఱపించి ఒడలికి గంధపుఁబూఁత పూయించెను. అంతట నా వార్త యెఱిఁగి మూఁడవ దేవేరి మృగాంకవతి ఆయన కడకు తన లోఁగిలి వెలువడి యేతెంచుచు నొకచో సద్దులేని యానిశీథ వేళ దూరపు వడ్లదంపు చప్పుడు విని, అయ్యో! అని చేతులు జాడించుచు నొప్పి కోర్వక దారిలో చదికిలంబడెను.

అంతట పరిజనులు ఆమెచేతులం బరికించి రోఁకటి బొబ్బలం గాంచి పోయి యావృత్తాంతమును రాజున కెఱుక

పఱచిరి. రాజువిభ్రాంతుఁడై వచ్చి ప్రియను కారణ మడుగఁగా, ఆమె నొప్పితోడి చేతు లతనికి చూపి 'ఆర్యపుత్త్రా, రోకటి చప్పుడు వినఁగా నా చేతుల నీబొబ్బలు లేచినవి.' అని చెప్పెను. అంత నారాజు ఆమె చేతులను మంట తీర్పు చందనాదికపు మందు పూయించెను 'ఒకతెకు నల్లగలువ తాఁకున గాయ మైనది, రెండవదానికి చంద్ర కిరణములచే సయితము ఒడలు కాలినది. ఈ మూఁడవదానికి రోఁకటి పోటుశబ్దమును విన్నమాత్త్రాన చేతుల బొబ్బలు లేచినవి. హా! ఒక్కటనే నా ప్రాణనాయికలకు ముగ్వురకును గుణ మైన సౌకుమార్యము దైవ యోగమున ఎగ్గు నే కలిగించినది!' అని రాజు తలపోయుచు అంతిపురమునం గ్రుమ్మరుచు ఆ రాత్రిని గష్టముతోఁ గడపెను తెల్లవాఱఁగానే ఆయన ప్రణవైద్యుల రావించి వైద్యము సేయించి రాణులను ముగ్వురను త్వరలో స్వస్థపఱచి సుఖ ముండెను.

ఇట్లు అబ్బురంపుఁగథను చెప్పి బేతాళుఁడు 'ఆముగ్వుర లోను సుకుమారతమ యెవతె?' అని విక్రమార్కుని అడిగి, తొంటిశాపమును జ్ఞప్తిపఱచెను. 'తాఁకుడు లేకయే రోఁకటి పోటు విన్నమాత్త్రాన నెవతె చేతుల బొబ్బలు లేచినవో ఆమె సుకుమారతమ, కడమ యిరువురకు నల్లగల్వయు చంద్ర కిరణములును తగిలి బొబ్బలు లేచినవి, కాన వారామెకు సాటి గారు.' అని రాజు పలికెను. అంతటఁ బేతాళుఁడు యథా ప్రకారము అదృశ్యుఁడై తనయిక్కకుం బోయెను.

కథ—౧౨.



మరల రాజు తెచ్చుచుండఁగా బేతాళుఁ డిట్లు కథ చెప్ప సాగెను:—రాజా, నీవు ఎప్పటికిని విసుగవు, నీయందు నా కనురాగము కలిగినది. నీ శ్రమను నివారించుటకు గథ చెప్పెదను వినుము. అంగదేశమున యశఃకేతు వని రాజు, అపరకాముఁడో యన రూపసంపన్నుఁడు ఉండెను. అతఁడు బాహుపరాక్రమముచే సకలశత్రువులను జయించెను. ఇంద్రునికి బృహస్పతివలె నాతనికి దీర్ఘదర్శి యని మంత్రి యొకఁడు ఉండెను. నిష్కంటక మయిన రాజ్యమును ఆమంత్రి కప్పగించి యశఃకేతుఁడు రూపగర్వముచె సుఖైకాసక్తుఁడై యెప్పుడును ప్రమదాన్వితమయిన యంతఃపురముననే యుండెనుగాని కార్యాస్థానమునకు రాఁడాయెను; సంగీతమును వినునే గాని హితుల మాటను వినఁడు. చల్లగాలికి కిటికీలం జేరునే కాని, రాజ్యకార్యముం బరిశీలింపఁడు. దీర్ఘదర్శి యాతని రాజ్యభారమును తాను వహించినవాఁడై రేయుంబవలు జాగరూకుఁడై ఉండెను. ఇట్లుండఁగా దేశ మంతట 'మంత్రి దీర్ఘదర్శి యశఃకేతునిం బేరికి మాత్రము రాజుగా నుంచి, దుర్వ్యసనములం జిక్కించి, అతని సిరి నెల్ల తా ననుభవించుచున్నాఁడు.' అని అపవాద పుట్టెను. అంత నతఁడు తనభార్యను మేధావిని యనునామెను బిలిచి

'ప్రియా, రాజుభోగాసక్తుండై యుండఁగా, తద్రాజ్యభార మెల్ల నేను వహించియున్నను, అతని రాజ్యమును నేను భక్షించు చున్నా నని యపవాద కలిగియున్నది అనృతమే యయినను లోకవాదము గొప్పవారికి చేటు దెచ్చును, జనవాదముచేత శ్రీరాముఁడు జానకిం ద్యజింపలేదా? కావున ఈవిషయములో నే నేమి చేయఁగఁగునో చెప్పుము.' అని యడిగెను. ఆధీపరా లిట్లు చెప్పెను:—'ఓ మహామతీ, తీర్థయాత్ర కని మిష పెట్టి సెలవు గొని కొంతకాలము పరదేశములం గడపి రమ్ము. అట్లు వైరాగ్యము వెల్లడియై నీమీఁది జనవాదము శమించును, నీవు లేని సమయములో రాజు తన రాజ్యమును స్వయముగానే విచారించుకొనును, అంతట నతనిం బట్టిన దుర్వ్యసనము కూడ తొలఁగిపోవును. నీవు మరల వచ్చినప్పుడు నింద తీఱి నీ మంత్రి యధికారము నీకు సిద్ధముగా నుండనే యుండును.'

భార్య యిట్లు పలుకఁగ దీర్ఘదర్శి సంతోషించి యంగీకరించి రాజును దర్శించి, మాటలనడుమ తన తీర్థయాత్రాభిలాషం దెలిపి సెల వడిగెను. 'తీర్థయాత్ర యేల? స్వర్గమునకు దాన ధర్మాదిక సాధనములు లేవా?' అని రాజు నివారింపం గడంగెను. 'మహారాజా, దానాదులచేత నర్థశుద్ధి యగును తీర్థము లన్ననో నిత్య శుద్ధములు, యౌవనము ఉన్నప్పుడే బుద్ధిమంతుఁడు తీర్థములకుం బోవలయును, ఈదేహము నమ్మ రానిదై యుండఁగా పిమ్మట తీర్థసేవ యెట్లు గలిగెడును?' అని

మహామంత్రి విన్నవించెను. ఇట్లు రాజు వల దనుచు, మంత్రి తప్పక పోవలయు ననుచు, మాటలాడుచుండ ప్రతీహారుఁడు వచ్చి రాజుతో 'మహారాజా, సూర్యుఁడు ఆకసము నడుమ నున్నాఁడు, ఏలినవారికిని స్నానవేళ దాఁటుచున్నది.' అని విన్నవించెను. అంతట రాజు తటాలున స్నానమునకు లేచెను. యాత్రోన్ముఖుఁడు మంత్రియు రాజునకు మ్రొక్కి యింటికిఁ బోయెను.

అనంతరము దీర్ఘదర్శి భార్యను కూడ వచ్చెద నన్నను నివారించి యింటనే నిలిపి, తన సేవకులకేనియుం దెలియ నీయక, ఒంటిగా బయలువెడలి, దేశములు సంచరించి తీర్థములు సేవించి క్రమముగా పుండ్రదేశమునకుం జనియెను. అందు సంద్రమునకు దూరముగాని యొక నగరమున నొక శివాలయంబుం బ్రవేశించి దాని ముంగిటం గూర్చుండెను దూరము నడచి దుష్కు గ్రుష్మి యొండవేఁడికి డస్సి యున్న యా దీర్ఘదర్శిని శివపూజార్థము వచ్చిన యొక వర్తకుఁడు నిధిదత్తుఁ డనునాతఁడు కాంచి జన్నిదము చేతను శుభలక్షణముల చేతను సద్బ్రాహ్మణుఁ డని యెఱింగి అతిథి పూజార్థమై తనయింటికిం దోడ్కొనిపోయి యుత్తమ మయిన స్నానభోజనములతో నుపచరించి నేదదేర్చి 'అయ్యా, నీ వెవరవు? ఎట కేఁగుచున్నావు ?' అని యడిగెను. తాను బ్రాహ్మణుఁ డనియు తనపేరు దీర్ఘదర్శియనియు తీర్థయాత్రకై దేశములు తిరుగు చున్నాఁ డనియు గాంభీర్యము దోప నతఁ

సదుత్తరము చెప్పెను. అంత నా గొప్పవర్తకుఁడు నిధిదత్తుఁడు ‘అయ్యా, నీవు తీర్థయాత్రచే బడలియున్నావు, నేను సువర్ణ ద్వీపమునకు బేరము పోనున్నాఁడ, నేను వచ్చువఱకు మా యింటనే ఉండి బడలిక తీఱి మఱి యేఁగుదువు గాక.’ అని యడిగెను. ‘అటయిన, నాకుమాత్ర మిట నేమి పని ? నేనును నీతోనే సువర్ణద్వీపమునకు సుఖముగా వచ్చెదను.’ అని దీర్ఘ వర్మ చెప్పెను వర్తకుఁ డంగీకరించెను

ఆమంత్రి యతనియింట ఊరు విడిచిన చిరకాలమునకు లబ్ధశయనుఁడై యారాత్రి గడపెను. మఱునాఁడు మహామంత్రి యావర్తకునితోఁగూడ వెలపొడవు సరకులతో నిండిన యతనియోడ నెక్కి అద్భుతభీషణమైన సంద్రముం గాంచుచు క్రమముగా స్వర్ణద్వీపము చేరెను. మంత్రిముఖ్యత యెక్కడ, మార్గవశమున సముద్రమును దాఁటుట యెక్కడ? అయ్యా, అపకీర్తికి వెఱచిన సాధువులు ఏమి చేయరు! నిధిదత్తుఁ డచ్చట బేరసారములు జరిగించుచుండఁగా, దీర్ఘవర్మ అతనితోఁగూడ కొంతకాలముండి, మరలి వచ్చుచు దారిలో సముద్రములో ఆకస్మికముగా అల వెనుక లేచిన కల్పవృక్షమును ఓడలోనుండి కాంచెను. బంగారపుఁబలవలు పగడంపుఁగొమ్మలు రతనంపుఁ బండ్లు అట్టివే పుష్పములుం గలిగి యావృక్షము శోభిల్లుచు ఉండెను. దాని తొలిపలవపై మేలైన రతనాల మంచముమీఁద అబ్బురంపు రూపసంపద కలిగిన కన్నియ నొకతెను మహామంత్రి

కాంచి, 'ఆహా! ఏమి యిది!' అని వెఱఁగుపడి ఆలోచించుచుండ, తటాలున ఆకన్య వీణమీఁద ఇట్లు పాడెను.

క. మున్నెవఁడే పనివిత్తన
మున్నాటెనొ తప్పకతఁడు పొందుర్ దానిర్;
మున్నొనరించినదానికి
నన్నలువయుఁ గాఁడు దటుఁ డన్యత సేయన్.

ఇట్లు బిగ్గరగా దైవమును పాడి తటాలున ఆదివ్యకన్య కల్పవృక్షముతోను మంచముతోను శయ్యతోను సముద్రములోఁ గ్రుంకి కాన రాదాయెను. 'ఇదేమి యీవింత, సముద్రమేడ? అందుఅగపడియు నగపడకపోయిన పాడుచుండిన దివ్యాంగనతోడి యాంచె ట్లెక్కడ? అట్లు గాదు, మాటిమాటికి ఇట్టి వింతలకు గని యైన యీసముద్రమును కొనియాడవలయును. లక్ష్మీచంద్ర పారిజాతాదులు ఇందుండి జనించిన యద్భుతములు గావో?' అని యాశ్చర్యపడి తలపోయుచున్న దీర్ఘదర్శితో ఓడ మాలిమి లోనగువారు 'అయ్యా, ఇట్లే యీకన్యామణి సదా అగపడుచుండును, తత్క్షణమే మరల మునుఁగుచుండును నీకు ఈవర్ణనము క్రొత్త.' అని తెల్పిరి. అనంతరము మంత్రి క్రమముగా నిధిదత్తునితోఁగూడ రేవు చేరెను. వర్తకుఁడు సరకు గుమాతి చేసికొని యింటి కేగెను అతనితోఁగూడ దీర్ఘదర్శియుం బోయెను. వర్తకుఁడు వచ్చినందులకు ఇంట బంధువులు నేసిరి. దీర్ఘదర్శి అతనియింట కొలఁది దినము లుండి

అనంతరము 'వర్తకుఁడా, నీ యింట నేను చిరకాలము బడలిక తీఱ సుఖ ముంటిని, ఇఁక స్వదేశమునకుం బోయెద, నీకు సేమ మగుఁ గాక.' అని చెప్పి, యతని యర్ధాంగీకారముతోడ వీడు కోలు వడసి, అటనుండి తరలి దూరమార్గము నడచి, చివరకు తన యంగదేశమునకు వచ్చెను.

అతని వెదకుటకై రాజు పంచిన వేగులు ఆతని రాకను దూరమునుండి కని రాజునకు నివేదించిరి. నగరమునుండి రాజు అతనికి ఎదురేఁగి కవుంగిలించి గౌరవించి యాత్రాక్లేశితుని మార్గధూళీ ధూసరుని కృశుని అతని తన నగరికిం గొనిపోయి యిట్లు సల్లాపించెను:— 'అయ్యా, నీ మనస్సువోలె దేహము సయితము మమ్ము వదలి పరుషతను వహించినది? దైవగతిని ఎవ్వ రెఱుంగుదురు! నీకు ఆకస్మికముగా ఈ తీర్థయాత్రా బుద్ధి యేల కలుగవలయు! మఱి చెప్పుము, ఏయే దేశములు తిరిగితివి, ఏమి వింతలు గంటివి?' ఇట్లు రాజడుగఁగా దీర్ఘవర్మి సువర్ణ ద్వీప వృత్తాంతము తుదిగా దారి నెల్ల వర్ణించుచు సముద్రము నడుమ త్రైలోక్య సారభూత యగు దివ్యకన్యక కల్పవృక్షము పలవమీఁద అగపడుటయు పాటపాడిమునుంగుటయును వక్కా ణించెను. అంతమాత్రాన యశఃకేతుఁడు ఆచెలువ లేక తనకు రాజ్యజీవితములు వ్యర్థము లని తలంచి మంత్రిని ఏకాంతము నకుఁ గొనిపోయి యిట్లనియె:—'మంత్రివరా, నీవు చెప్పిన కన్యను చూడక నేను బ్రదుకఁజాలను, నీవు చెప్పిన దారిని

దైవమునకు మ్రొక్కి నే నేఁగెద. నన్ను నీవు అడ్డగింపవలదు. నాతో రానుం గూడదు. నేను, గుప్తముగా నొంటిగా నేఁగెద, నా రాజ్యమును నీవు రక్షించుచుండుము: నామాట తప్పకుము, ఇందులకు వేఱు తలంతువేని నన్నుం జంపినట్లు.' ఇట్లు ఒట్టు పెట్టి మాఱు పలుక నీయక రాజు మంత్రిని ఇంటికిం బంపెను. మంత్రి మరల వచ్చినందులకు ఇల్లంతయు మహోత్సవముగా నుండఁగా, నతఁడు మాత్రము మనమున కలఁతపడి కుందుచుండెను. ఏలినవాఁడు అసాధ్య వ్యసనంబుల మునింగినచో మంచి మంత్రులకు సుఖ మెక్కడిది?

మఱునాఁడు రాజు రాజ్యభార మెల్ల దీర్ఘదర్శికి అప్పగించి, రాత్రి తాపసవేషమున తరలెను పోవుచు దారిలో కుశనాభుఁ డను ఋషిని గాంచి అతనిపాదములకు మ్రొక్కి నిలిచెను. అంతట ముని 'ఓ రాజా, లక్ష్మీదత్తుఁ డను వర్తకునితో ఓడయెక్కి సముద్రమునందు సబురవోయి నీయిష్ట కన్యను పొందెదవు, చింత లేక పొమ్ము.' అని యానతిచ్చెను. అతనిమాటకు సంతోషించి రాజు అతనికి వందన మాచరించి, దేశములను నదులను కొండలను దాఁటి సముద్రతీరమునకుం బోయెను. అచట నా రాజునకు ముని చెప్పినట్టు స్వర్ణద్వీపమునకుం బోవుచున్న లక్ష్మీదత్తునితో సంగాత మాయెను. యశఃకేతుని యడుగుజాడయందలి చక్ర ధ్వజాది రేఖలం గాంచి లక్ష్మీదత్తుఁడు వినయముతో నతనిని తనయోడలో నెక్కించు

కొని సముద్రమున సబురుసేయుచుండెను నడిముద్రమునకుం బోయినంతట నాదివ్యకన్య కల్పవృక్షంపుఁబలవపై కూర్చుండి నీటిలోనుండి వెలువడి పాడసాగెను. వెన్నెలను చకోరము వోలె తన్ను రాజు కాంచుచుండ నాకన్య వీణతోఁ బగా నిట్లు బిగ్గరగా పాడం దొడంగెను.

క. మున్నెవఁడే పని విత్తన
మున్నాటెనో తప్పకతఁడు పొందుఁ దానిన్
మున్నొనరించినదానికి
నన్నులువయుఁ గాఁడు దక్షుఁ డన్యత సేయన్.

క. కావున నెల్లట నెయ్యది
కావలయు నెవనికి దైవగతి యూతని స
ట్లావలన దానిఁ బొందుట
కై వివశునిఁ దెచ్చి యుంచుఁ గదు చోద్యముగాన్.

దైవగతిని ఇట్లు పాడుచున్న యాదివ్యకన్యను గాంచుచు ఆసౌందర్యమునకు నివ్వెఱపడి క్షణ మట్లుండి యశఃకేతుఁడు 'ఓరత్నాకరుఁడా, నీకు నమస్కారము, నీహృదయములోఁతు నెవ్వ రెఱుంగఁగలరు? నీవు ఈకన్యను దాఁచుకొని, సిరిని ఇచ్చి హరిని వంచించితివి గదా. దేవతలకు సయితము తెలియరాని లోఁతువానిని ఱెక్కలతోడి కొండలకు ఇల్లయినవానిని నిన్ను శరణుఁ జొచ్చితిని, నాకోర్కెం దీర్పుము.' అని వేఁడుచున్నంత లో నాదివ్యకన్య చెట్టుతోఁగూడ మునిఁగెను. అది కని రాజు

తానును సముద్రమున దుమికెను. అట్లతఁ డాకస్మికముగా పడి కానరాకపోఁగా మృతుఁడాయె నని తలంచి యాసాధువు లక్ష్మీదత్తుఁడు దుఃఖముచే తానునుం దనువు వీడ దొరంకొనెను. అంతట ఆకాశవాణి యిట్లు పలికెను:— 'ఓయి, సాహసము సేయకు, సముద్రమున మునింగినయీతేనికి భయ మేమియు కలుగదు. ఈతఁడు యశఃకేతుమహారాజు, తాపస వేషమున నున్నాఁడు, ఈకన్యకై యిట కేతెంచినాఁడు. ఈమె యితనికిం బూర్వభార్య, ఈమెను బడసి యీతఁడు వెండియుం దనయంగ రాజ్యమునకుం బోవును.' ఇట్లాకాశవాణి యోదార్పఁగా సార్థవాహుఁడు లక్ష్మీదత్తుఁడు ఆశ్వాసితుఁడై తన పనిమీఁదం దాఁ బోయెను.

రాజు సంద్రములో మునింగి ఒకదివ్యనగరము గాంచెను. అందు మణికంబంబులు బంగారపుగోడలు ముత్యాల కిటికీలుం గలమేడలును, రతనాలమెట్లు గల దిగుడుబావులు కోర్కులం దీర్చు కల్పవృక్షములుం గలయుద్యానములును, వెలుఁగొందుచుండెను. నగర మిట్లు సంపదలతో నిండి యున్నను జను లెచ్చటను లేరు. రాజు ఇల్లిల్లు దిరిగియు నెందును తనప్రియం గానఁ డాయెను. అంతట యశఃకేతుఁడు ఎత్తయిన రతనాల మేడం గాంచి, మెట్లెక్కి, తలుపు తెఱచుకొని, లోనం జొచ్చి, అందొక్కెడ వెలలేని రతనాల మంచముపై ఒడ లెల్ల వస్త్రముఁ గప్పుకొని పవళించి యున్న యొకతెంగాంచి, తనప్రియయే యని

శంకించి, తమకంబున మొగముపై వస్త్రము నోసరిలం జేసెను. ఆమె యతనిప్రియ యాదివ్యకన్యయే ఆప్రియం గాంచినంత యశఃకేతుఁడు వేసవిలో తేట మీఁటిన నీటి యేటింగన్న యొడారి బాటసారివోలె మాటల కందని యానందముం బొందెను. ఆమెయు ఆకస్మికముగా నటు వచ్చిన యా శుభలక్షణుని చూచి తత్తరంబునం పానుపు వదలి ఆతిథ్య మొనర్చి, తలవంచుకొని యి ట్లనియె:—

'ఓ మహానుభావా, నీ వెవరవు ? అగమ్యప్రదేశమైన యీ పాతాలమునకు ఎట్లు వచ్చితివి ? మహారాజలక్షణములు గల నీ యొడలికి ఈతాపస వేష మెట్లు ? నాయందు దయయేని తెలియఁజెప్పుము.' రాజి ట్లనియె:—'సుందరీ, నే నంగరాజను, పేరు యశఃకేతువు, నీ విట సంద్రములో ప్రతిదిన మగపడుదువని మిత్త్రునివలన విని, నీకై రాజ్యము విడిచి యీ వేసంబు దాల్చి, ఓడ యెక్కి-వచ్చి, నీవెంబడి నిట సంద్రమున దుమికి నీకడ కేతెంచితిని. మఱి నీ వెవతవో నాకు నెఱింగింపుము.' అంత నా లీలావతి లజ్జానురాగానందంబులును డెందంబునం బెనంగొన ని ట్లనియె:— 'మృగాంకసేనుఁ డని శ్రీమంతుఁడు విద్యాధర రాజు ఉన్నాఁడు. నేను ఆయనకొమారితను, నా పేరు మృగాంకవతి. మానాయన నన్ను తన యీనగరాన ఒంటిగా విడిచి, ఏలోకో ఎటకో పౌరసమేతముగా పోయినాఁడు. నేను ఈ శూన్యగేహమున దుఃఖిత నై యంత్ర కల్పవృక్షము నెక్కి,

సముద్రముమీఁదికి వచ్చుచు, నియతిం బోవుచు, నుందును'
ఆమె యిట్లుపలుక, యశఃకేతుఁడు మునివచనమును స్మరించుచు
నామెను నునుఁబల్కులచేత సంతోషపెట్టి, ప్రేమ పుట్టించి
వైవసము సేసికొని, తత్క్షణమే వివాహమున కంగీకరింపంజేసెను
ఆ బోటి యిట్లొకకట్టుఁబాటు పలికెను, 'ఆర్యపుత్త్రా, శుక్ల
కృష్ణ చతుర్దశ్యష్టములయందు నెలకు నాలుగుదినములు నేను
నీతో నుండను, అపుడు నేనెటకో పోదును, నన్ను నీ వడుగఁ
గూడదు, అడ్డగింపఁగూడదు. అందులకుం గారణము కలదు.'
రాజు అట్లే ఒప్పుకొని యాదివ్యాంగనను గాంధర్వవిధానమున
పెండిలియై యామెతో సంభోగసుఖము లనుభవించెను.

ఇత్తెఱంగున భోగములలోఁ గాలము పుచ్చుచు యశః
కేతుఁ డుండఁగా నొకనాఁడు మృగాంకవతి యతనితో 'ఆర్య
పుత్త్రా, నీవు నన్నిటనే యెదురు సూచుచుండుము, నేఁడు
కృష్ణచతుర్దశి, ఇచ్చటి యీ పటికంపులోఁగిటికి నీ వేమాత్రముం
బోకుము. ఇంపలిబావిలో నడుగిడి భూలోకముం జేరకుమీ.'
అని యతనివలన సెలవు గొని వెలుపలి కేఁగెను. జిజ్ఞాసువై
రాజు కత్తింబూని ప్రచ్ఛన్నముగా వెనువెంటం బోయెను. అంత
నచటికి చీఁకటివలె నల్లనివాఁడు పెద్ద నోటిగుహను తెఱచుకొని
రాక్షసుఁ డొకఁడు రూపుదాల్చిన పాతాళమో యన వచ్చెను.
వచ్చుచునే యారక్కసుఁడు భయంకరముగా అఱచి మృగాంక
వతిని నోటం గప్పుకొని దిగ మ్రింగెను. దానిం గని యశః

కేతుండు కోపమున మండిపడుచు కత్తిని ఒఱనుండి దూసి పరువెత్తి, తనమీఁదికి పరువెత్తుచున్న యారక్కసుని తలను తెగనఱికెను. రాకాసిమొండెంబు గ్రక్కున నెత్తురు వెల్లువగట్టెను గాని మృగాంకవతి కానరాదాయెను. రాజు ఇట్లు గతి గానక మోహాసముద్రంబున మునింగి యుండఁగా తటాలున మబ్బువంటి నల్లని రాకాసిదేహమునుండి చంద్రమూర్తివోలె దిశలను వెలింగించుచు మృగాంకవతి గాయపడని మేనితో ప్రాణముతో వెలువడెను. అట్లు ఇడుమ దప్పి వచ్చిన యా ప్రేయసిని రాజు, రారమ్మని, పరుగున నెదురుగ పోయి కవుంగిలించెను. 'ప్రేయసీ, ఇదేమి ? కలయా మాయయా?' అని అడుగఁగా విద్యాధరి స్మృతి పొంది యిట్లు చెప్పెను.

"వినుము ఆర్యపుత్రా, ఇది కల గాదు, మాయయుఁ గాదు, మాతండ్రి నాకిడిన శాప మిది. పూర్వము ఈపురమున వసించుచు మాతండ్రి పలువురు కొమారు లున్నను, నామీఁది యతివాత్సల్యముచే, నేను సరసను లేక, ఎప్పుడును భోజనము చేయఁడు. నేనెప్పుడును శివపూజాసక్తనై ఈనిర్జనప్రదేశమునకు రెండుపక్షములను అష్టమియందును చతుర్దశియందును వత్తును. ఒక చతుర్దశియందు ఇట నేను భక్తి పారవశ్యంబున గౌరీదేవిం బూజించుచుండ పగలు ముగిసిపోయెను. ఆపగలు ఆఁకలిగొనియు మానాయన నన్నెదురు సూచుచు నాపైఁ గోపగించి ఏమియు భుజింపక త్రావక యుండెను నేను రాత్రి

యింటికిఁ బోయి సాపరాధ నయినందువలన తల యెత్తక యుండఁగా, నా నియతిబలముచే మాతండ్రి నామీఁది కరుణ దూలి నన్ను శపించెను 'ఈ దిన మెట్లు నీ గర్వముచేత నేను ఆఁకటికి భోజనము నైతినో, అట్లే పక్షపక్షము, నీవు అష్టమి యందును చతుర్దశియందును హరాగ్నినాసక్తిచేత నటకే యూరి బయటికి వెఁగినంతట కృతాంతసంత్రాసుఁ డను రక్కసునికి భోజన మగుదువు. నీవు జీవముతోనే వాని హృదయమును చీల్చుకొని బయటికి వత్తువు. వాఁడు మ్రింగునట్టి నొప్పి యేని, శాపమేనియు నీకు జ్ఞప్తి యుండదు. ఇట నీవు ఒంటరిగా నుందువు.' అనంతరము కొంతసేపటికి నేను బతిమాలఁగా మా నాయన శాపాంతము నిట్లు నిర్ణయించినాఁడు. 'యశఃకేతు వనునగరాజు నీకు భర్తయై, నిన్ను రాక్షసుఁడు మ్రింగఁగాఁ గాంచి, వానిం జంపును. అంతట వానియెదనుండి వెలువడఁ గానే నీశాపము తీఱును అంతట ఈ శాపమును నీవిద్యలును అన్నియు నీకు జ్ఞప్తి యగును.' ఇట్లు నాయన శాపాంతము చెప్పి నన్నిట నొంటిగా విడచి, తాను పరివారముతోఁ గూడ భూలోకములో నిషధ పర్వతమునకుం బోయెను. నేను అట్లు తిరుగుచుండియు శాపమోహంబున నిటనే నిలిచితిని ఆశాపము ఇపుడు తీఱెను. నాకు అన్నిటను ఇపుడు స్మృతి యుద్భవించినది. కాన నిపుడు నేను మానాయనకడకు నిషధాద్రికిం బోయెదను. శాపము తీఱిన పిమ్మట మొదటి య ట్లుండమని మానియమము.

నీవు నీ యిచ్ఛమెయి ఇటనేని యుండుము, నీ రాజ్యమునకేనియుం బొమ్ము.”

ఇట్లు మృగాంకవతి పలుకఁగా అంగరాజు కను నడలి ‘ఓ సుముఖి, నాకై యిట ఏడుదినములు మాత్రము నుండుము. ఇట నుద్యానవనములలో క్రీడించుచు ఔత్సుక్యమును మఱతము. తర్వాత, నీవు నీతండ్రికడ కేఁగుము, నేను నాతావున కేఁగెద.’ అని బతిమాలెను. ఆముద్దరాలు సరి యని యొడంబడియెను. యశఃకేతుఁడు ఆమెతోఁగూడ ఆఱు దినములు ఉద్యానములలోని బావులలో విహరించి, ఏడవ దినము భూలోకమునం జేర్చు నాయంత్రద్వారపు బావి యున్న యింటికి ప్రాణప్రియను యుక్తిగాఁ దోడ్కొనిపోయి ఆకస్మికముగా నామెను కంఠమునం గవుంగిలించికొని, ఆ బావిలో పడి, ఆమెతోఁగూడ తనపట్టణమున తనయుద్యానములో డిగ్గియునుండి వెలువడెను. కాంతాసహితుఁడై యిక్కరణి నేతెంచిన యేలికం గని, ఉద్యానపాలురు వెంటనే పోయి మంత్రివరునికి దీర్ఘదర్శి కెఱింగించిరి. ఆతఁడు వచ్చి ప్రియకాంతను గొని వచ్చిన నిజప్రభునిం గని, యడుగులకు మ్రొక్కి పౌరబృంద సమేతుఁడై రాచనగరం బ్రవేశము సేయించెను. ‘ఆహా! ఆకాశమున మెఱపు మెఱసినట్లు నాకంటికి సముద్రములో క్షణ మగపడి కానరాక పోయిన యీదివ్యకన్యను ఇతఁ డెట్లు సాధించినాఁడు! ఎవని నొసట బ్రహ్మ యేమి వ్రాఁత వ్రాసియున్నాఁడో’ అని యెంత

యసంభావ్య మయినను వానికి అలవడక మానదు గదా!' ఇట్లని మంత్రిముఖ్యుఁడు ఆశ్చర్యపడెను. రాజు దివ్యాంగనం దెచ్చికొన్నందులకు అన్యజనులును ఉత్సవములు సల్పుచుండిరి. రాజు తనదేశము చేరెనని ఎఱింగి, మృగాంకవతి, ఏడుదినములు ముగియఁగానే, విద్యాధరీగతిని బొందుటకు సంకల్పించి జ్ఞప్తి చేసికొన్నను, ఉత్పతనవిద్య తోఁపదాయెను. అంత నామె కొల్ల పోయినదివోలె కరము వందురసాగెను. రాజు 'ప్రేయసీ, ఏల యాకస్మికముగా వెనువగవు జెందిన ట్టగపడుచున్నావు?' అని యడుగఁగా 'ఆర్యపుత్త్రా, నేను, శాపము తొలంగినను, నీమీఁది బాళిచే ఇంత కాల మున్నందున, నావిద్య పోయినది, నాదివ్యగతి గతించినది.' అని చెప్పెను. అంతట రాజు తనకు విద్యాధరి దక్కినది గదా యని గొప్ప యుత్సవము చేసెను. దానిం గని మంత్రి దీర్ఘదర్శి రాత్రి యింటికి పోయి పరుండి యాకస్మికముగా గుండెయ వ్రీలి కాలధర్మము నొందెను. ఆ దుఃఖమును అనుభవించి, రాజు రాజ్యభారమును స్వయముగా మోచుచు, మృగాంకవతితోఁ గూడ చిరకాలము సుఖ ముండెను.

ఈకథ చెప్పి బేతాళుఁడు విక్రమార్కుని నిట్లడిగెను:— 'రాజా, చెప్పుము, దొర యట్లు మహోత్సవమం దుండఁగా, మహామంత్రి గుండె పగిలి చావ నేల? ఆ దివ్యాంగన తనకు అబ్బ దాయె ననుశోకముచేతనా? రాజ్యము హరింపఁగోరి తా నుండ రాజు మరల వచ్చె నను దుఃఖముచేతనా? నీవు ఎఱిఁగి

పలుకవేని నీ విప్పటికి చేసికొన్న పుణ్య మెల్ల నశించును, నీతల నలినలిగా పగిలిపోవును.' రాజి ట్లనియె:—'కల్యాణ చరిత్రుండగు ఆ మంత్రి, అతనియందు ఈ రెండు హేతువులును గలుగవు. మఱి యే మన, స్త్రీమాత్రలంపటత్వము చేత రాజ్యము నుపేక్షించిన యీ రాజునకు, ఇపుడు దివ్య స్త్రీ దొరకినది, ఇంక చెప్పవలయునా? కావున నేను ఎంత కష్టపడినను చెఱుపే అధికమైనది.' అను చింతచేత మంచిమంత్రికి ఆతనికి హృదయము పగిలినది.'—ఇట్లు విక్రమార్కుఁడు చెప్పినంతట మాయావి బేతాళుఁడు అదృశ్యుఁడై తన తావున కేఁగెను. రాజు ధైర్యము విడక ఆతనిం దెచ్చుటకు మరల ఆ చెట్టుకడ కేఁగెను.

---

## కథ—౧౪.

అనంతరము మరల శింశుపాతరువునుండి బేతాళుని విక్రమార్క మహారాజు బుజానం గొనివచ్చుచుండ, బేతాళుఁడు ఇట్లు వచించెను:— రాజా, వినోదార్థము సంగ్రహముగా నొక కథ చెప్పెదను వినుము. హరునికిం గాపురము వారాణసీ నగరము కలదు గదా. అందు రాజపూజ్యుఁడు దేవస్వామి యని బ్రాహ్మణుండు మహాధనికుఁడు ఉండెను. ఆతనికి హరిస్వామి యని కుమారుఁ డుండెను. ఆచిన్నవానిభార్య పేరు లావణ్యవతి. ఆకాంతతో నొకనాండు హరిస్వామి మేడమందు మై మఱచి

నిద్రించుచుండఁగా; అంతరిక్షంబున మదనవేగుఁ డను విద్యాధర కుమారుఁడు పోవుచుండి, యచట మగని ప్రక్కను నిదురించుచున్న యీ లావణ్యవతిం గాంచి, కామాంధుండై, ఆనిద్రలోనే ఆమెను హరించి, ఆకాశమునం జనియెను. అంతట క్షణము సేపటికి హరిస్వామి మేల్కాని ప్రక్కలో, ప్రాణేశ్వరిం గానక తొట్రుపడుచు లేచి 'అహో! ఏమి యిది ? ఎట కేఁగినది ప్రియ? నామీఁద నేమేని యలిగినదా ? నన్నుఁబాలను నామనస్సును బరీక్షింప నిచటనే యెందైన దాఁగినదా?' అని పరిపరి విధముల వితర్కించి,ఆమెనుఇక్కడనక్కడ మేడపంచపాళిలలో వెదకుచు రాత్రియే తిరిగి, ఇంటను బయటను ఎల్ల చోటులను వెదకి కానక, దుఃఖాగ్నికి వేఁగి, కన్నీళ్లు జడి గురియ, ఎలుంగు ఉల్వడ, నేడ్వం దొడంగెను, 'హా! చంద్రవదనా, అయ్యో ! చంద్రికాగౌరి, అయ్యో! ప్రేయసీ, నన్ను విడనాడి ఎట కేఁగితివి?' అని యంగ లార్చుచు హరిస్వామి క్రమముగా రాత్రి తుద ముట్టించెను. తెల్లవాఱఁగానే యతనియేడ్పు నూఱంతలాయెను. బంధువు లెంత యోదార్చినను ప్రేయసి లేక యీ బ్రాహ్మణ కుమారుఁడు ఎప్పాటను ధైర్య మూనఁడాయెను. ఇచ్చట నిలిచినది, ఇట పసుపాడినది, ఇటం గైసేసికొన్నది, ఇట నాడినది, అని యేడ్చుచు నిట నట భ్రమయుచుండెను. బంధువులును చెలికాండ్రును, 'ఏల యి ట్లడలెదవు ! ఆమె బ్రదికియే యున్నది, ఊరక తన్ను ఏల చంపుకొనును ! నీవును బ్రదికి యుండువేని

తప్పక ఆమెం గలయుదువు. కావున ధైర్యము తెచ్చుకొమ్ము, ప్రేయసిని వెదకుము. ధైర్యముతో యత్నము సేయువానికి దొరకనిదే మున్నది?' అని బోధింప నెట్లో కొన్ని దినములకు హరిస్వామి ఆశచే ధైర్యము వహించి తలఁపోసెను:—'నా ధనమెల్ల బ్రాహ్మణుల కొసంగి తీర్థములు సేవించి పాపక్షయము సేసికొనియెద, పాపక్షయముచేత ప్రియ నెప్పటికేని తిరుగఁ గాంచెదను గాక.' ఇట్లు నిశ్చయించుకొని స్నానాదికము లాచరించెను. మఱునాఁడు విచిత్రాన్నపానములతో నవారిగా బ్రాహ్మణులకు భోజన సంతర్పణ గావించి, ధనమెల్ల బంచి పెట్టి స్వదేశమునుండి వెడలి, ప్రియ దొరకు ననునాశతో తీర్థములు తిరుగఁబోయెను.

హరిస్వామి యట్లు యాత్రలు సేయుచుండఁగా వేసవి కాలము వచ్చెను గాలి యుడుకుగా వీచెను. జలాధారములు వేసవియెండకు నీ రిగిరి బురద యెండి బీటలు వాఱి యుండెను. అట్టి యా కాలమం దొకప్పుడు హరిస్వామి ఎండ తాఁకుచే, వలవంత చే, ఆఁకలిదప్పుల చే, నిత్యము దారి నడచుటచేతను, డీల్లపోయి, తేజ మెడలి, కృశుఁడై, దుమ్ము గ్రమ్మి, భోజనార్థి యై, యొకయూరికిఁ బోయి, అందు పద్మనాభుఁ డను బ్రాహ్మణుఁడు సత్త్రము పెట్టుచుండ, నతని యింటికిం బోయినవాఁడై, లోపల పలువురు బ్రాహ్మణులు భోజనము సేయు చుంటం గని, ద్వారశాఖం బట్టుకొని, పలుక లేక కదల లేక నిలిచి యుండెను. ఆ

తీరున నున్న యాతనిం గని యాసత్త్రి యిల్లాలు పరమ సాధ్వి జాలిగొని యిట్లు చింతించెను:—'అయ్యో! ఆఁకలి యన్నిటిలో గొప్పది, ఎవనికి లాఘువము నిడదు? ఇదే నిదర్శనము, ఇతఁడెవరో అన్నాతురుఁడు గడపలో ఎట్లు మొగము వ్రేలవేసికొని నిలిచియున్నాఁడో! ఇతఁడు దవ్వునడచినయభ్యాగతుఁడు, స్నానమై వచ్చినాఁడు, ఆఁకటికి ఇంద్రియములు వశము దప్పుచున్నవి. పాపము! ఇతఁడు అన్నము పెట్టుటకు కడు మంచి పాత్రము!' ఇట్లని యాయిల్లాలు తలపోసి ఒకపాత్రములో పరమాన్నము నించి పంచదార వేసి నేయిపోసి రెండుచేతులతోను ఎత్తి తెచ్చి వినయముతో నిచ్చి, 'అయ్యా, ఎటకేని డిగ్గియకడ కేఁగి దీనిని భుజింపుము, ఈచోటు ఎంగిలిగా నున్నది, బ్రాహ్మణులంతటను భుజించుచున్నారు.' అని చెప్పెను.

హరిస్వామి పరమాన్నపాత్రమును కొని, చేరువ నొక మఱ్ఱిక్రింద డిగ్గియగట్టున ఉంచి, దిగి, కాలుసేతులు గడిగికొని ఆచమనముచేసి, సంతోషముతో భుజింప వచ్చు నంతలో డేగ యొకటి నల్లత్రాఁచును ముక్కునను గాళ్లలోను ఇఱికించుకొని ఎటనుండియో వచ్చి యా చెట్టున వ్రాలెను పక్షి పట్టి తెచ్చి తినుచున్న యా గుహుగుడుజీవపుఁ బాామునోటిలోనుండి విసపుఁ జొంగ కాఱుచు కొంచెము ఆ యన్న పాత్రమునం బడియెను. దాని నెఱుంగక హరిస్వామి భుజించెను. ఆఁకటిచే వడివడిగా నిశ్శేషముగా భుజించినట్టి యా మధురాన్నముచేత నతనికి

తీవ్ర మయిన విషవేదన యారంభించెను:—'అమ్మో, విధి ప్రతికూల మైనప్పుడు ఈలోకములో నేది ప్రతికూలము గాదు! ఇట్లు నాకు పాలు నేయి పంచదారల యన్నము సయితము విష మైనది !' అని యార్తుఁ డై విలపించుచు హరిస్వామి తొట్రుపడుచుం బోయి యా సత్త్రి యిల్లాలితోడ 'అమ్మా, నీవు పెట్టిన యన్నమువలన నాకు విషము కలిగినది, కావున తక్షణమే విషవైద్యుని రప్పింపుము, రప్పింపవేని నీకు బ్రహ్మహత్య సిద్ధించును.' అని మొఱపెట్టెను ఇ దేమని యామె దిగులుపడి కాంచుచుండ క్షణములో హరిస్వామి గ్రుడ్లుతిరుగుడు పడి ప్రాణముం గోలుపోయెను. అంతట ఆసత్త్రి భార్యను నిర్దోషనే అతిథిభక్తనే అతిథిని చంపిన దనుభ్రమచే ఇంటినుండి తఱిమివేసెను. ఆసాధ్వి ఆదినమున మంచిపనియే చేసియు అపనిందం బొంది అవమానపడి తపస్సుకై తీర్థ మాశ్రయించెను. 'సర్ప శ్యే నాన్నదాతలలో ఆబ్రహ్మహత్య యెవరిది?' అని యమధర్మరాజు నెదుట వాదము జరిగెను గాని నిర్ణయము కాలేదు కావున విక్రమమహారాజా, ఆ కొల యెవ్వరిదో, నీవు చెప్పుము నీకు మునుపటి నాశాపమును మఱవకు.

ఇట్లని బేతాళుఁడు పల్కఁగా, రాజు మౌనము మాని వచించెను:— 'సర్పమునకు పాప మెక్కడిది? శత్రువు తన్నుం దినుచుండఁగా విసము దప్పియున్న దానియందు దోష మెట్లు కలుగును? డేగ చేసిన త ప్పేమి? అది ఆఁకలిగొని ఆకస్మికముగా

తనకు లభించిన తనయాహారమును తినుచుండెను. అన్నదాత లయిన యాదంపతులయందుఁ గాని అంగొరకరియందే గాని దోషము చెప్పఁ గూడదు. వారు ధర్మ ప్రవృత్తులు. కావున విచారింపక ఆబ్రహ్మహత్యను వారిలో నొకరి కెవఁడు చెప్పునో ఆ మూఢునికి ఆబ్రహ్మహత్య యని నేఁ దలంతును.' ఇట్లు రాజు పలుకఁగా బేతాళుఁడు మరల మాయమాయెను. రాజు అతనిని మరల దేఁబోయెను.

---

కథ—౧౭.

మరల విక్రమార్కుఁడు శింశుపాతరువునుండి బేతాళుని బుజంబునం గొని శ్రమణునికడకుం బోవుచుండ, దారిలో బేతాళుఁడు రాజుతో నిట్లనియె:—రాజా, అలసితివి, వినోదార్థ మీచిత్రకథను వినుము: శ్రీరామరూపమున అవతరించిన విష్ణుదేవునికి రాజధాని యయోధ్యానగరము కలదు గదా. అందు వీరకేతు వనురాజు ఏలుచుండెను. ఆకాలంబునందు రత్నదత్తుఁ డని వైశ్యుఁడు పెద్ద సెట్టి ఒకఁ డుండెను అతఁడు వేల్పులం గొలిచి నందయంతి యను తనయిల్లాలియందు రత్నవతి యను కొమారితం బడసెను. అక్కన్నియ తండ్రి యింట రూప లావణ్య వినయ గుణములతో పెరుఁగుచుండెను. ఆమెకు జవ్వనము వచ్చినంతట ఆమె నిమ్మని రత్నదత్తుని గొప్ప

అని మరల దేవుఁడు పలికెను: అంత నామె 'ప్రభూ, నాయందు కరుణగలవేని ఈ నామగఁడు బ్రదికి సదా ధార్మికుఁ డగుఁగాక.' అని వర మడిగెను ' మంచిది, అట్లే అగును, ఈ నీ మగఁడు వజ్రదేహుఁ డై బ్రదికి లేచును, ధార్మికుండు నై వీరకేతునికి సంతుష్టి యొసంగెడును.' అని శర్వుఁడు కంటి కగపడకయే మింటినుండి యానతీయఁగా నప్పుడే చోరుఁడు ఏకవీరుఁడు అక్షతశరీరుఁడై బ్రదికి లేచెను. అంతట రత్నదత్తుఁడు అద్భుత పడి సంతసపడి కూఁతును దొంగయల్లునిం దోడ్కొని, ఇంటికిఁ బోయి పుత్త్రవర హర్షాంబుధిలో నోలలాడుచు, బంధు మిత్త్ర సమేతము మహోత్సవ మొనర్చెను. ఆవృత్తాంత మెఱిఁగి వీర కేతుఁడు అప్పుడే చోరుని ఏకవీరుని రావించి తనకు సేనాపతిం గావించికొనెను దొంగతనము మాని వణిక్కుమారి నుద్వాహమై ఏకవీరుఁడును రాజుసంగడిని మంచిమార్గమున నుండెను.

ఇట్లు కథచెప్పి బేతాళుఁడు తన యెప్పటి శాపమును జ్ఞప్తి పఱిచి విక్రమార్కుని 'రాజా, తల్లిదండ్రులతోఁ గూడ వచ్చిన యావణిక్కన్యం గాంచి యాచోరుఁడు గొఱుతనుండి యట్లు ఏల ఏడ్చినాఁడు, ఏల నవ్వినాఁడు?' అని ప్రశ్న చేసెను.

రాజ నియె:—'అకారణబంధు వైన యీవర్తకుని ఋణము తీర్చుకొనకపోయితిని గదా యని దుఃఖము చేత నేడ్చెను. 'ఏమి వింత ఇది ! ఈకన్య తన్నుఁ గోరి వచ్చిన రాజవరులను వరియింపక ఇట్టి నాయం దనురాగము పూనినది! ఆహా! స్త్రీ

మనస్సు విచిత్రము గదా.' అని ఆశ్చర్యముచేత నవ్వినాఁడు. ఇట్లు విక్రమార్కుఁడు ఉత్తరము చెప్పఁగానే బేతాళుఁడు మరల అదృశ్యుఁడై పోయెను. విక్రమార్కుఁడును బేతాళుని గొని వచ్చుటకు మరల నాశింశుపావృక్షముకడకుం బోయెను.

---

కథ—౧౫.

అనంతరము విక్రమార్కుఁడు వెండియు బేతాళుని బుజమునం గొని కదలఁగానే బేతాళుఁడు మరల కథ చెప్ప నారంభించెను. నేపాళదేశములో శివపురంబునందు యథార్థ నాముఁడు యశఃకేతుఁడు ఏలుచుండెను. అతఁడు ప్రజ్ఞాసాగరుఁ డను మంత్రి చేతులో రాజ్యభార ముంచి చంద్రప్రభ యను పేరి తన పట్టపు దేవితో భోగము లనుభవించుచుండెను. కాల క్రమమున నాదంపతులకు శశిప్రభయను కన్యక జన్మించెను. క్రమముగా ఆమెకు జవ్వనము రాఁగా, ఒకప్పుడు ఆమె వసంత మాసములో పరివారముతోఁగూడ జాతర చూచుటకై నగ రోద్యానమునకుం బోయెను. అందొకతావున నామె పువ్వులు గోయుచుండఁగా జాతరకై వచ్చిన ధనికపుత్త్రుఁడు మనఃస్వామి యనుబ్రాహ్మణకుమారుఁడు ఆమెను కన్నుదోయి తనియునట్లు గాఁ గని ఆమాత్రాననే తన మనస్సునకు స్వామి గాక, 'ఈ తొయ్యలి మదనునికి బాణములకై స్వయముగా పువ్వులు

కోరుచున్న రతీదేవియా? కాదేని వసంతుని పూజింప జతన
పడుచున్న వనదేవతయా?' అని, నామెలువంగూర్చి యనేకము
తలంచుచుండఁగా, నా రాజకన్యయు రూపవంతుఁడయిన
నవమన్మథునిం బోని యా విప్రకుమారుని కనులకుం దోఁచి
నంతమాత్రాన పువ్వుల నెఱుంగక, ఒడలెఱుంగక, తన్నే
మఱచి పోయెను ఇట్లయ్యిరువురును ఒండొరులను కాంచుచు
నుండఁగా, నచట జనుల హాహారవ మొకం డుత్పత్తిల్లెను ఏమి
యని? అని మెడ యెత్తి యా యిరువురుం గన, మదపుటేనుం
గొక్కటి మఱియొక యేనుఁగుయొక్క మదగంధము నాఘ్రాణించి
కోపమూని కట్టుఁగంబము వెఱికి విడఁబడి దారిలోని చెట్లను
విఱుచుచు మావటీనిం బడఁద్రోసి, చెవియందు అంకుశమును
ప్రేలుచునే యున్నను, జనులమీఁదికి తఱుముకొని వచ్చి
పడుచుండెను. అంతట పరిజనము భయమునం జెదరి పోఁగా
నద్దరిల్లిపోయిన యా శశిప్రభను పుష్పవనం దత్తీసి చేతులతో
ఎత్తుకొని మనఃస్వామి యేనుఁగు దారికి దూరముగాఁ గొని
పోయెను పిమ్మట పరిజనులు వచ్చి ఆ బ్రాహ్మణ కుమారుని
స్తుతించి రాజకన్యను నగరికిం గొనిపోయిరి. అక్కన్య మాటి
మాటికిని వెనుకకుఁ దిరిగి మనఃస్వామిని కాంచుచు నింటికిం
బోయెను. ఇల్లు సేరి రేయుంబవలు మన్మథుని పుటములలో
క్రాఁగుచు ప్రాణదాతను అతనినే ధ్యానించు చుండెను

మనఃస్వామియు నుద్యానమునుండి శశిప్రభ తనకంటి కగపడు నంతవఱకును వెంటం బోయినవాఁడయి, యా లేమ యాంతిపురముఁ జొచ్చినంతట, వెనుకకు మరలి, వలవంత పాలై 'ఈకన్య లేక నేను బ్రదుకు నోల్లను. కావున నివ్విషయమున నాకు ధూర్తసిద్ధుఁడు గురుఁడు మూలదేవుఁడే శరణము' అని యాలోచించి యెట్లో ఆదినము గడపి, అనంతరము మూలదేవుని కడకుం బోయెను. మూలదేవుండును ఆసమయమున మిత్త్రుఁడగు శశితోఁగూడ నుండెను మనఃస్వామి అతనికి తనకోరికను తెలియఁజేసెను. మూలదేవుఁడు నవ్వి నెఱవేర్ప నంగీకరించెను. అనంతర మామోసాలరాయుఁడు యోగగుళికను నోటవేసికొని తాను వృద్ధబ్రాహ్మణాకారముం బొంది, ఇంకొకగుళికను మనఃస్వామికి నోటవేసికొన నిచ్చెను. దానిని నోటం బెట్టుకొన్నంతట మనఃస్వామి యందంబులు సంగడించు కన్యకామణి రూపు నొందెను. ఆకన్నియం దోడ్కొని యాధూర్తాధిపుఁడు యశఃకేతుని ఆస్థానమందు ప్రవేశించి 'మహారాజా, నాకు కుమారుఁ డొకఁడు కలఁడు, వానికొఱకు ఈ కన్యను దూరమునుండి యాచించి తెచ్చితిని, కుమారుఁ డెచటికో పోయినాఁడు, నేను వానిని వెదకఁ బోవుచున్నాను, పుత్త్రుని వెదకి నేను దెచ్చువఱకు ఈకన్యను నీవు రక్షింప వలయును, నీవు గదా లోకమునకు రక్షకుఁడవు' అని విన్నవించుకొనెను రాజు శాపభయంబున నంగీకరించి తనకూఁతును శశిప్రభను అంతఃపురము

నుండి రావించి 'పట్టీ, ఈకన్నెను నీయింటం గాపాడుము, నీ ప్రక్కనే భోజనశయనాదికములు ఈమెకుం గావింపుము.' అని యప్పగించెను. తండ్రిమాటప్రకారము శశిప్రభ కన్యారూప మున నున్న మనఃస్వామిని తనలోగిటికిం దోడ్కొని పోయెను వృద్ధబ్రాహ్మణరూపమున మూలదేవుండు తన యిచ్చ నేగెను మనఃస్వామి కన్యారూపమున తన ప్రియసరస నుండెను

క్రమముగా కొన్నిదినములకు తనయందు శశిప్రభకు చెలిమి బలిమి నొంది నమ్మకము కుదిరినతర్వాత ఒకరాత్రి పడుక పై నిలువరము లేక ఉరలుచున్నట్టి యా శశిప్రభను చెంగటి శయనమున నున్న కన్యారూపి మనఃస్వామి యడిగెను:—'సఖి, శశిప్రభా, ఏమి ఇట్లు దినదినము పాలి కృశించి చెలువుని ఎడం బాసిన దానివలె సదా వనరుచున్నావు ? నీవే ప్రాణ మయిన నాయందు నమ్మకము లేదా? నీ దుఃఖము నాకుం జెప్పవేని ఈ దినము నేను భుజింపను.' ఆమాటకు రాసుత నిట్టూర్పు నిగిడించి యిట్లుత్తర మిచ్చెను:—'సఖిరో, నీయందును అపనమ్మకమా, మఱి చెప్పెదను వినుము:— ఒకప్పుడు నేను వసంతో ద్యాన యాత్రం జూడంబోయి అట నొకసొబగుని బ్రాహ్మణకుమారుని వసంతదేవునింబోలె కాంచితిని. అంతలో మహాగజ మొకటి ఆకస్మికముగా విడంబడి మదధారల జడిం గురియుచు అకాల మేఘమువోలె గర్జించుచు వచ్చెను. ఆ హావడికి పరిజనులు నన్ను వదలి చెదరి పోంగా, నేను భయంబునం గళవళపడు

చుండఁగా, ఆ విప్రకుమారుఁడు న న్నెత్తుకొని పోయి దూరాన నుంచెను. ఇంతలో పరివారము వచ్చి కలసికొని అతనికడనుండి నన్నుం దోడ్కొని వచ్చి స్వర్గమునుండి భూలోకంబునం బోవ నిచట నిల్పినది. అది మొదలుగా మేలుకొనఁగను దును ప్రాణప్రదుని ఆ మనోనాయకుని నా ప్రక్కనే కాంచుచున్నాను, కన్నుఁగవ మూసితినా, కలను, ఆవలఁ బుకాఁడే యగ్గబోట్ల పలుకులు పల్కి, హారంబునం బైకొని, చుంబనంబులం గవుంగిలింతల నిం కే మేమో చేఁతలను నాసిగ్గును ఎడలించును. మందభాగ్యరాలను ఆతనికిఁ గోత్రానక మెఱుఁగను, కావున నతనిం బొందఁజాలను, ఇట్లు ఈ దుఃఖాగ్ని నన్నుం గ్రాఁచుచున్నది.' రాచకన్నియపలుకులు విని మనఃస్వామి ఆనందపూర్ణుఁడై తన్నుం దెలుపుకొనుటకు అదే సమయ మని తలంచి నోటినుండి గుళికను తివిచి తనవాస్తవ రూపమును చూపెను. 'ఓ లోలలోచనా ఉద్యానమున నీదాసుఁడ నైనవాఁడను నేనే, నినుఁ జూసినప్పటినుండి నేను పడిన కామబాధలను మే మెలదు ? కావున మనము పడిన వియోగ భారమును సఫలీకరింపుము ఇంకను విలంబించితి మేని మనల నిరువురను మన్మథుఁడు ఉండనీయఁడు' తటాలున నిట్లు అగపడి ప్రాణేశ్వరుఁ డిట్లు పలుకఁగా రాజసుత స్నేహాశ్చర్య లజ్జాపరాధీన యాయెను అంతట నయ్యిరువురు గాంధర్వ విధానంబున వివాహ మైరి. అట్లచట మనఃస్వామి

చిన, నితని తండ్రి నా మహామంత్రి తప్పక నశించును. అతఁడు పోయిన నారాజ్యము పోవును, ఇవ్విషయమున నేమి సేయఁ దగునో చెప్పుఁడు' అంతట ప్రకృతు లందఱు నేక గ్రీవముగా నిట్లు పలికిరి. 'మహారాజా, ప్రజల ధర్మమును గాపాడుట రాజునకు నైజధర్మ మని పెద్దలు చెప్పుదురు. ప్రజాధర్మమునకు మంత్రము మూలము, ఆ మంత్రము మంత్రులయం దుండును. మంత్రి నశించిన మూలనాశ మై నిశ్చయముగా ధర్మ నాశము గలుగును కావున నిట్లు సమకూడిన యీ ధర్మవిఘ్నమును తప్పక తొలఁగింపవలయు. కాన మంత్రిపుత్త్రునికి బ్రాహ్మణుని యిల్లడ కన్యను ఈయవలసినదే పిమ్మట ఆబ్రాహ్మణుఁడు వచ్చి కోపగించినప్పుడు అందులకు సమాధానము సేయవచ్చును' ప్రకృతు లిట్లు పలుకఁగా మహారాజు అంగీకరించి మంత్రిపుత్త్రునికి ఇచ్చుటకై లగ్ననిశ్చయము సేసి యామాయకన్నియను కూఁతు నింటినుండి మంత్రి యింటికి రప్పించెను. వచ్చి కన్యక చూపి మనఃస్వామి రాజుతో నిట్లనియె:— 'ఒకఁడు ఒకనికై తెచ్చిన నన్ను వే ఱొకనికి నీ విత్తువేని మంచిది; అట్లే చేయుదు గాక: రాజవు నీవు, ఎంతలి ధర్మాధర్మములు నీవి నేను ఒక్క యొడంబడికమీఁద వివాహము నంగీకరించెదను. నా మగఁడు తాను ఆఱుమాసములు నానాతీర్థములు సేవింపక నన్ను బలాత్కారంబున నేక శయ్యకుం దార్ప గూడదు. ఇట్లు ఒప్పనియెడల నేను దంతములతో నాలుక కఱచుకొని ప్రాణ

ములు విడిచెను.' ఇట్లు కన్యారూపి పలుకఁగా రాజు మంత్రి పుత్త్రుని అందుల కొడంబఱిచి వెంటనే వివాహము నెఱవేర్చెను. అంత మంత్రిపుత్త్రుఁడు తొలిభార్యను మృగాంకవతిని ఈకపటభార్యను మనఃస్వామిని ఒక్కయింటనే పదిలముగా నుంచి, మూర్ఖుఁడు కాంతమునకుఁ దీర్చువాఁడై తీర్థములు కొలువం బోయెను. మనఃస్వామి మృగాంకవతితోఁగూడ ఒకయింటనే నివసించుచు ఒకచోటనే భుజించుచు ఒకపడకనే శయనించుచు ఉండెను

అట్లుండ నొకరాత్రి పరిజనము బయట నిద్రపోవుచుండఁగా పడకటింట మృగాంకవతి ఏకాంతమున నామాయా కన్యకతో 'సఖి, నిదుర రాకున్నది, కథ యేమేని చెప్పుము' అని యడిగెను. అంతట మనఃస్వామి పూర్వము ఇలుఁడను సూర్యవంశపు రాజు గౌరీశాపంబున విశ్వైకమోహనం బగు స్త్రీరూపముం బొంది, అన్యోన్య దర్శన ప్రీతిచే దైవతోద్యానవనమందు బుధునిం గూడి పురూరవునిం గనిన యా కథను చెప్పి 'సఖీ, ఈతీరున దేవతాదేశంబునను మంత్రౌషధ ప్రభావమునను ఒకానొకప్పుడు పురుషుఁడు స్త్రీయగును, స్త్రీయుఁ బురుషుఁడగును. ఇవ్విధమున అట్టి గొప్పవారికిం గూడ సంయోగములు ఘటిల్లును.' అని పలికెను. అంతట పెండ్లినాఁటినుండి కాంతు నెడఁబాసియున్న యాలేఁబ్రాయపు ముద్దరాలు మృగాంకవతి 'చెలీ, ఈకథను విన్నంతట నాయొడలెల్ల నేమో సిమసిమ

యనుచున్నది దినము దినము పెరుగుచున్నది ఇదేమి చెప్పుము నెచ్చెలీ.' అని యడిగెను. 'ఇవి తెమ్మవిల్తుని చిన్నెలు నీకుం గ్రొత్తలు, వీనిని నేను అనుభవించి యున్నాను. నీవలననుండి దాంచను గదా.' అని మూఢకన్యకామణి పలికెను అంతట మృగాంకవతి 'సఖీ, నీవు నాకు ప్రాణసమవు, కాలజ్ఞవు, కాన నీతో జెప్పెదనా, ఏయుపాయంబున నేని ఇచటికి మగవాండు రానగునా?' అని యల్లన నడిగెను అంతట చక్కంగ సందుం బొంది ధూర్తేంద్ర శిష్యుఁడు 'సఖి, అట్లని, ఒకటి చెప్పెదను వినుము, విష్ణుప్రసాదంబున నేను రాత్రి స్వేచ్ఛచే పురుషుఁడను గాఁగలను, ఇదే నీకై పురుషుండ నైతిని' అని నోటిలోనుండి గుళికం దివిచి జవ్వనంపుటుక్కుఁగాఁడై సొబగులు విరియుచు కనువిం దొనర్చెను. అంతట నచ్చికలు మచ్చికలు నై ఎందును బందు లేక కాలమునకుం దగినయట్లు తియ్యపుఁగం గామక్రీడలం దేలిరి. అట్లే ప్రతిదినము మనఃస్వామి ఆ మంత్రిపుత్త్రుని కాంతతో, పవలు కన్యకయు రాత్రి చెలువుఁడు నై విహరించు చుండెను. మంత్రిపుత్త్రుఁడు తీర్థయాత్రనుండి వచ్చుసమయము సంప్రాప్తించి నంతట ఒకరాత్రి మనఃస్వామి మృగాంకవతిం దోడు కొని మంత్రియింటినుండి పలాయితుఁ డాయెను.

ఈ యవసరమున మూలదేవుఁడు ఆవృత్తాంత మెల్ల నెఱింగి, వెండియు తాను ముదుసలి పుడమివేల్పు రూపు గొని తనమిత్త్రుని శశిని బాపనకొమరుని రూపున తోడ్కొని యశః

కేతుని యాస్థానికిం బోయి 'ఓమహారాజా, వీఁడుగో నాసుతుఁడు, దొరకినాఁడు, నా కోడలిని పంపుము' అని యడిగెను. అంతట రాజు ప్రకృతులతో కలయఁబలికికొని శాపభీతుఁడై 'భూదేవా, నీకోడ లెటకుఁ బోయెనో నే నెఱుంగను. నా యపరాధమునకు పరిహారముగా నీ కొమారునికి నా కొమారితను ఇచ్చెదను, గయికొమ్ము' అని వేఁడెను. వృద్ధబ్రాహ్మణ రూపి జగమోసగాఁడు మాయకోపము నభినయించి కఠినత్వము చూపి యా మాప్పన కొప్పక యుండఁగా, రాజు బతిమాలుకొని ఒప్పించి అతనిపుత్త్రుఁడుగా నటించుచున్న శశికి తనకూఁతురు శశిప్రభ నిచ్చి యథావిధిగా వివాహముం గావించెను. ఆతీరున నున్న యా వధూవరులం దోడుకొని మూలదేవుఁడు రా జొసంగునట్టి విభవంబులమీఁద కోర్కి లేక తనతావున కేఁగెను. అట మనఃస్వామియుం గలసికొనఁగా, మూలదేవునిమ్రోల శశి మనఃస్వాములకు మహావివాదము కలిగెను 'నాది శశిప్రభ, నేను గురుకృపచే మున్నే వివాహ మాడితిని.' అని మనఃస్వామి వాదించెను. 'మూర్ఖా, నీ వెవఁడవు శశిప్రభకు? ఇకన్యను నాకు తండ్రి అగ్నిసాక్షికముగా దానము చేసినాఁడు.' అని శశి పలికెను. ఇట్లు మాయాప్రభావముచేత తమకు సాధించిన యా రాజకన్య కోసము వారిరువురును ఎంత వాదులాడినను నిర్ణయము కలుగలేదు. మహారాజా, నీవు చెప్పుము, ఎవని భార్య శశిప్రభ? నీకు నా శాపము ఎఱుకయే గదా:—

ఇట్లు బేతాళుఁడు కథ చెప్పి ప్రశ్న వేయఁగా విక్రమ మహారాజు ఇట్లనియె:—'ఆ కన్య శశిభార్యయే, తండ్రి యథాధర్మము ఆమెను శశికి ఇచ్చినాఁడు. మనఃస్వామి ఆమెను దొంగతనముగా కైకొన్నాఁడు. దొంగకు పరస్వమందు ఎవ్వఁగ నేనియు స్వామ్యము కలుగదు గదా!' ఇట్లు రాజు పలుకఁగానే బేతాళుఁడు ఆతనిబుజమునుండి కానరాక పోయెను. రాజు ఆతనిని వెదకుచుం బోయెను.

---

## కథ—౧౬.

విక్రమార్కుఁడు మరల శింశుపాతరువునుండి బేతాళుని కొనివచ్చుచుండఁ బేతాళుఁ డిట్లనియె:—రాజా, మంచి కథ యొకటి చెప్పెదను వినుము. సర్వరత్నములకు నాస్పదము, శివభార్యలైన గౌరిగంగలకు ఇరువురకును తండ్రి, హిమవన్నగేంద్రుఁడు కలఁడు గదా ఆ కొండలరాయని శిఖరమునందు కాంచన పుర మని యొకనగరము సార్థకనామము, ఒప్పును. ఆ నగరంబున పూర్వకాలములో జీమూతకేతు వను విద్యాధరరాజు మేరుపర్వతమున నింద్రుని వోలె నేలుచుండెను. అతనియింటి తోఁటలో వంశక్రమాగతము కల్పవృక్షము ఉండెను. దానిం బూజించి మహారాజు తత్ప్రసాదంబున పూర్వజన్మజ్ఞానము కల సుపుత్త్రునిం బడసెను. ఆ తనయుఁడు జీమూత

వాహనుఁ డను నామమునం బరఁగి దానవీరుఁడును మహాసత్త్వుఁడును ఎల్లభూతంబులందు కరుణాళువును పితృశుశ్రూషణ పరాయణుండును గా నుండెను. అతనికి యౌవనము రాఁ గాంచి తండ్రి మంత్రులతో నాలోచించి యౌవరాజ్యాభిషేకము చేసెను. ఇట్లు ఆకుమారుఁడు యువరాజుగా కొంత కాల మున్నంత తండ్రిగారిమంత్రు లాతనికి నిట్లు హితము చెప్పిరి. 'దేవా, మీకు ఎల్లకోర్కులం దెచ్చునది ఏభూతముల చేతను కీడ్వడనిది యీకల్పవృక్షము: దీనిని సర్వదా నీవు పూజ సేయుచుండవలయును. ఇది యుండఁగా దేవేంద్రుఁడేనియు మనల బాధింప నేరఁడు, ఒరులమాట చెప్పవలయునా?'

మంత్రు లట్లు చెప్పఁగా దానవీరుఁడు జీమూతవాహను డిట్లు తలపోసెను:— 'అయ్యో! ఇట్టి యీ దేవపాదపము కలిగియు నా పెద్దలు తగినఫలమును పొందరైరి. లుబ్ధులగు అర్హాము లైన కొన్నియర్థము లేవో వేఁడిరి. నేను దీనినుండి నామనంబులోని గొప్పకోరికను సాధించెద.' ఇట్లు నిశ్చయించుకొని మహాసత్త్వుఁడు జీమూతవాహనుఁడు తండ్రియొద్దకుం బోయి, చేయవలసిన శుశ్రూష యొల్లం జేసి, తండ్రి శుశ్రూషాతుష్టుఁడై ఏకాంతమందు సుఖంబుగాఁ గూర్చుండి యుండఁగా, అతనితో ఇట్లు విన్నవించెను: 'నాయనా, ఈ సంసారసాగరములో ఈ దేహము మొదలుగా సర్వమును నీటి యలల విలాసముపోలె అస్థిర మని నీ వెఱుంగుదువు గదా. అందును

సంజయు మెఱుపును లచ్చియు అచిరముగా ప్రకాశించి నశించునవి. ఈసంసారములో పరోపకార మొకటి నశింపనిది; అది కనునట్టి ధర్మకీర్తులు నూఱుకల్పములు ఉండును. కావున, నాయనా, భోగము లిట్లు క్షణికంబు లై యుండఁగా, వ్యర్థముగా ఇట్టి యీకల్పవృక్షమును మనము రక్షించుకొనుచు నుండి యేమి ప్రయోజనము? మాది మాది యని అభిమానముతో దీనిని రక్షించుకొన్న మన పెద్ద లిప్పు డేరి? వారికిని దీనికిని ఏమి సంబంధము? పరోపకారైక ఫలసిద్ధికై నీయాజ్ఞచేత కామప్రదమును ఈకల్పవృక్షమును నేను వినియోగము సేసెదను.' ఇట్లు పుత్త్రుఁడు పలుకఁగా తండ్రి యంగీకరించెను. అంతట జీమూతవాహనుఁడు పోయి కల్పవృక్షమును ఇట్లు వేఁడుకొనెను:—'దేవా, నీవు మాపెద్దల కోరికల నెన్నిటినో తీర్చితివి. నాకు ఒకకోరికను మాత్రము తీర్పుము. ఈభూమిలో దరిద్రులు లేకుండునట్లు అనుగ్రహింపుము. నీకు మేమగుఁగాక. ధనార్థులకు నిన్నిచ్చివేసితిని.' జీమూతవాహనుఁ డిట్లు పలికి చేతులు మోడ్చుకొని నిలిచియుండఁగా కల్పవృక్షమునుండి 'నన్ను విడిచి పెట్టితివి ఇదే నే నేఁగితిని.' అని వాక్కొకటి వినంబడియెను క్షణములో కల్పవృక్షము దివంబునకు ఎగసి, భూమిలో దరిద్రుఁ డెవ్వఁడును లేకుండునట్లుగా బంగారముం గురిసెను. అంత నా యఖిలభూత దయచేత జీమూతవాహనునికీర్తి ఎల్లలోకంబులును వ్యాపించెను.

అంతట సతనిదాయాదులు మచ్చరికించి కల్పవృక్ష
విహీనులను అతనిని అతనితండ్రిని జయింపశక్యమని తలంచి,
అందఱుం గలసి యతనిరాజ్యమును హరించుటకు యుద్ధ
సన్నద్ధులైరి. అది యెఱింగి జీమూతవాహనుఁడు తండ్రితో
నిట్లనియె:— 'నాయనా, నీవు కైదువుంబూనిన నెదుట
నిలువఁ గలవాఁ డెవఁడు? ఐనను వినాశి యగు పాపపుశరీర
మున్నకై బంధువులను జంపి రాజ్య మేలుటకు ఏ లోభి యభి
లషించును! మన కేల యీరాజ్యము? మనము వే ఱొక
చోట కేఁగి ఇహపరసుఖకర మయిన ధర్మమునే ఆచరింతము.
రాజ్యలోభులు ఈ దాయాదులు సంతోషింతురు గాక.'
అంతట తండ్రి యిట్లనియె:—'పుత్త్రా, నీకొఱకే గదా నేను
రాజ్యముం గోరుట, నీవే కరుణ పెంపున దానిం త్యజింతువేని
నాకేల యిది ముసలివానికి?' ఇట్లు తండ్రి యనుజ్ఞ యీ
యఁగా, జీమూతవాహనుఁడు, రాజ్యము వదలి తల్లిని తండ్రినిఁ
దోడ్కొని, మలయాద్రికిం బోయి, గంధపుమ్రాఁకుల యడవు
లును కొండవాఁకలు ఒరలుగుహలును గల యాకొండపై
నాశ్రమ మేర్పఱిచి అందు తండ్రిని శుశ్రూషించుచుండెను.

అచట జీమూతవాహనునికి ఆకొండయందే నివసించు
చున్న విశ్వావసుఁ డనుసిద్ధరాజుకుమారుఁడు మిత్త్రావసువుతో
చెలిమి కలిగెను. ఒకనాఁడు జీమూతవాహనుఁడు అచ్చటఁ
దిరుగుచు నుపవనమందు గౌరీదేవి దేవళముఁ గని అమ్మవారిని

దర్శింపఁబోయెను. అచట నాపమయంబున దివ్యకన్య యోర్తు చెలులతోఁ గూడ వచ్చి దేవిని బూజించి వీణాగానసేవ సేయు చుండెను. లేళ్లు కదలక మెదలక ఆవీణాగానమును వినుచుండి నవి తన్నుఁ గన్నమాత్రాన ఆకన్నియ చూపుదారినే చొచ్చి జీమూతవాహనుని హృదయమును ముచ్చిలించెను. జీమూత వాహనుం గని ఆకన్నెయు మదనుని బాణములకు గుఱి యైనది. అంతట జీమూతవాహనుఁడు తత్సఖిని 'నీ చెలిపే రేమి? వంశ మేది?' అని యడిగెను. ఆమెపేరు మలయవతి యనియు, ఆమె మిత్రావసుపు చెల్లెలు, సిద్ధరాజు విశ్వావసుపుకూఁతురు, అనియు, చెప్పి, ఆ సఖి జీమూతవాహనుని కులనామములను అతనితో వచ్చియున్న యొక మునికుమారునివలన తెలిసికొని మలయవతితో నగుమొగంబుతో ని ట్లనియె:—'సఖీ, విద్యాధరేంద్రుని కీయనకు ఆతిథ్యము సేయ వేమి? జగత్పూజ్యుఁడు గదా యీయతిథి మనకు దొరకినాఁడు.' ఇట్లు సఖి పల్కఁగను మలయవతి సిగ్గుచేత నెమ్మోము వాంచి యూరక యుండెను. అంతట నొకచెలి 'ఈ చెలువ లజ్జావతి, నావలన నర్చనం గై కొనుఁడు.' అని పలికి జీమూతవాహనునికి అర్ఘ్యముతోడ నొక పూదండ నర్పించెను. జీమూతవాహనుండు దానిం గయికొని ప్రేమచేత మలయవతిమెడలో వైచెను. మలయవతియు తన క్రేగంటిచూపుఁ అనల్లగలువదండతో అతని నలంకరించెను. ఇట్లు అయ్యిరువురును మాటలు లేకయే స్వయంవరము గావిం

పఁగా, చేటి ఒకతె వచ్చి, యాసిద్ధకన్యను 'అమ్మ నిన్ను తలంచుకొనుచున్నది, యింటికి రమ్ము' అని పిలిచెను.

అంతట మలయవతి ఎట్టకేలకు జీమూతవాహనునిఁబాసి, తల్లి కడకుం బోయి, ప్రాణేశునిమీఁది వలవంతచేత సెజ్జపైఁబడి, కన్నుల కన్నీళ్లు సరములుగాఁ దొరఁగ, వలరాచకాఁకచే నుడుకుచుండెను గంధంపుఁబూఁతలకు తామరాకులపీవనలకు నూఱటఁ బొందదాయెను. మదనుఁ డెంతప్రేరించినను లజ్జచే మలయవతి దూతిని పంపుటకు సాహసింపక ప్రాణములపైని ఆస వదలెను. అట్లే జీమూతవాహనుఁడును ఆమెం బాసిన వగపున సెజ్జపయిని వ్రాలియు మదనుని కయిని వ్రాలి, పాలి, ఆరాత్రి గడపి, తెల్లవాఱఁగానే ఆఁపరాని తాపంబున, తాఁ దొలుత మలయవతిం గన్న యాగౌరిదేవళముకడకు పోయెను. అతనిని మునుపటి యా మునికుమారుఁడు వెంట వచ్చి యూఱడించుచుండెను. అప్పుడే ఆనిర్జనప్రదేశమునకు మలయవతియు రహస్యముగా ఒంటరిగా వచ్చి, చెట్లచాటుకతమున తనకాంతునిఁ గానక, కన్నుల నీళ్లు నించుచు, అమ్మవారికి ఇట్లు విన్నపము చేసెను. 'దేవీ, నిన్నుఁ గొలిచినను నాకు ఈపుట్టువున జీమూతవాహనుఁడు భర్త కాకున్నను పైపుట్టువున నేనియు అగునట్లు వరమిమ్ము' ఇట్లు పలికి మలయవతి తత్క్షణమే అమ్మవారియెదుటి యశోకవృక్షంపుఁగొమ్మకు తన పయ్యెదనే ఉరిగాఁ కట్టి 'హానాథ, జీమూతవాహనా, లోకములెల్ల నెఱింగిన

కరుణాళువ వయ్యును నన్ను రక్షింపవేమి?' అని పలికి కంఠమున పాశముం దవిలించికొన్నంతట మింటినుండి యమ్మవారివాక్కు ఈతీరున వినంబడియెను: 'పుత్త్రీ, సాహసము సేయకు. విద్యాధరచక్రవర్త్తి జీమూతవాహనుఁడు నీకు భర్త యగును.' దేవి యిట్లు పలుకఁగా చెలికానితోఁగూడ విని, జీమూతవాహనుఁడు సంతోషజడ డైయున ప్రియకడకు వచ్చెను. మునికుమారుఁడు 'ఓ వరవర్ణినీ, సత్యముగా ఇదియె అమ్మవారొసర్చిన వర దానము.' అని యాముద్దరాలిని నునుఁబల్కుల సంతస పెట్టు చుండఁగా, జీమూతవాహనుఁడు వలపులు గులుకు పలుకుఁ దేనియ లొలుకుచు, తన చేతితోనే మంగళసూత్రమును కట్ట వలసిన యామె మెడనుండి పాశముం దొలఁగించెను.

అంతట నాకస్మికముగా నయ్యిరువుర వీనులకును అమృత వర్షముగా, చేటి యొకతె వచ్చి సంతసంబున నిట్లనియె: "చెలీ, కల్యాణినీ, బళి! నీకు మేలు గలిగినది, నీకోర్కె నెఱవేఱినది. ఇప్పుడే మీనాయనగారితో, మిత్త్రావసువు విన్నపము చేసి నాఁడు:—'నాయనా, జగన్మాన్యుఁడు జీమూతవాహనుఁడు ఇట వచ్చియున్నాఁడు. అతిథి నతని మనము సత్కరింపవలసినది. అట్టి వరుఁడు మఱియెటను దొరకఁడు, అతనిని కన్యారత్న మయిన మనమలయవతి నిచ్చి పూజింతము.' అని. అందులకు మీతండ్రి గారు ఒప్పుకొన్నారు. అంతట మిత్త్రావసువు ఆపనిమీఁదనే ఈ మహాభాగుని యాశ్రమమునకుం బోయి యున్నాఁడు. ఇప్పుడే

మీకు వివాహము జరుగును. కావున రమ్ము ఇంటికిం బోవుదము. మహాభాగుఁడును ఆశ్రమమునకుం బోఁ దగును.' ఇట్లు చేటి పలుకఁగా రాజపుత్త్రి అటనుండి మెల్లగా సంతసమున కాంతుని మాటిమాటికి మెడ త్రిప్పి కాంచుచు దానివెంట నింటికిం బోయెను. జీమూతవాహనుండును వెంటనే తన యాశ్రమ పదమునకుం బోయి మిత్త్రావసువుం గని యాతఁడు వచ్చిన పనికి అంగీకారము తెలిపి జన్మాంతరవృత్తాంత మెఱిఁగినవాఁడు గావున మలయవతి తనకు పూర్వజన్మమున భార్య యనియు మిత్త్రావసువు మిత్త్రుం డనియు అతనితో చెప్పెను. మిత్త్రావసువు ఆవృత్తాంతమును జీమూతవాహనుని తలిదండ్రులకు చెప్పి, వారిని అలరించి పోయి, తన తల్లిదండ్రులకుం జెప్పి వారిని సంతోషింపఁ జేసి, అపుడే జీమూతవాహనుని తమ యింటికిం గొనిపోయి, తమ సిద్ధులకు తగినట్లు మహోత్సవముగా ఆ దినమే మంచి లగ్నమున చెల్లెలిని మలయవతిని ఇచ్చి వివాహము గావించెను. అట్లు సిద్ధమనోరథుఁ డై జీమూతవాహనుఁడు పెండ్లికుమారితతోఁ గూడ మామగారి యింటనే కొలఁదికాల ముండెను.

ఒకనాఁడు జీమూతవాహనుఁడు మిత్త్రావసువుతోఁ గూడ గంధపుఁగొండచఱులయందు వేడుకగా సంచరించుచు, సముద్రతీరమున అడవిలో ఎంపప్రోవులను పెక్కింటిని గాంచి, 'ఏవివి ఈ యస్థిరాసులు?' అని మిత్త్రావసువు నడిగెను. బావ

మఱంది ఆ కరుణాపరాయణునితో నిట్లు వచించెను: "ఈ వృత్తాంతము విను, సంగ్రహముగా వర్ణించెద. తొల్లి నాగమాత కద్రువ గరుడమాతను వినతను మాయచేత పందె మోడించి దాసిం జేసికొని యుండెను గదా. తల్లిదాస్యమును ఈఁగియు గరుడుఁడు ఆపగచేత కద్రూపుత్త్రులను నాగులను భక్షింప దొరంకొనెను. అది మొదలు అతఁడు బలాఢ్యుఁడు ఎప్పుడును పాతాళము చొచ్చి నాగులను కొందఱను మెక్కి కొందఱను మర్దించును; ఆతనిభయంబునం గొందఱు చత్తురు. ఇట్లు ఒక్కమ్మడిని సర్వక్షయము కానుండ నాగరాజు వాసుకి గరుడుని బతిమాలుకొని యిట్లు ఒడంబఱిచెను:—'పక్షీంద్రుఁడా, నీకు ఆరగింపునకు నేను ప్రతిదినము ఒక్కొక్కపామును ఈదక్షిణ సముద్రంపు టిసుకతిన్నియకు పంపుచుండెదను. నీ వెప్పుడును ఈపాతాళము చొరఁగూడదు. ఒక్కమాటే పాము లెల్లమడిసిన నీకు మాత్ర మేమి స్వకార్యసిద్ధి?' ఇట్లు నాగరాజు పలుకఁగా గరుడుఁడు మహాపరాక్రమశాలి యయ్యును తన మేలు తాను ఆలోచించి యొప్పుకొనెను. అది మొదలు, గరుడుఁడు దక్షిణ సముద్రముచెంతను ఈ యిసుకతిన్నెమీఁద దినదినము వాసుకి పంపెడుపాముఁను తినుచుండును. అట్లతఁడు దినదినము తిన్న యట్టి పాముల యెముకలరాసు లివి, కాలక్రమముగా నింత లేసి దిబ్బ లయినవి'

ఇట్లు మిత్త్రావసువు పలుకఁగా విని దయా ధైర్య నిధి జీమూతవాహనుండు కనికరముచేత మనస్సు గరఁగి యిట్లు వచించెః—"అయ్యో! వాసుకికై వగవవలసియున్నది! అతఁడు ఎట్లు చేతులార దినదినము పందవోలె తన ప్రజలను శత్త్రువునకుం బట్టి యిచ్చుచున్నాఁడు! అయ్యో! రెండువేల నాల్కలు గల వఁట! ఒకదాననేనియు 'ఓగరుడా, మున్ను గా నన్నారగింపుము.' అని పల్కనేరఁ డాయనే? నాగాంగనల యేడ్పులను సదా వినుచుం గనికరము లేక సత్త్వము లేక నాగరాజు తన కులమును రూపు మాపు మని గరుడుని వేఁడుకొన్నాఁడు! తార్క్ష్యుఁడును కశ్యప తనయుఁ డయ్యును విష్ణువును మోచుటచేతఁ బావనుఁ డయ్యు వీరుఁ డయ్యును ఇట్టిపాపమున కొడి గట్టినాఁడు! హా! అజ్ఞానప్రభావము!" ఇట్లు వచియించి యామహాసత్త్వుఁడు మనస్సులో నిట్లు తలపోసెను.— 'ఈయసారపు దేహముచే నేను సారము సాధింతునా? ఈదినము నన్ను గరుత్మంతుని కర్పించుకొని నిర్బాంధవుని భీతుని ఒక నాగునేనియు రక్షింపఁ గలుగుదునా?' ఇవ్విధమున జీమూతవాహనుఁడు తలంచుచుండఁగా ప్రతీహారి వచ్చి విశ్వావసుమహారాజుగారు రమ్మనుచున్నా రని మిత్త్రావసువును పిలిచెను.

అంత జీమూతవాహనుఁడు తాను పిమ్మట వచ్చునట్లు చెప్పి మిత్త్రావసువుం బంపివేసి, ఒక్కఁడే తనకోరిక నెఱవేఱు నుపాయ మేమేని గాన నగునా యని యచటఁ దిరుగుచుండఁగా,

ఆకరుణానిధికి దవ్వున ఏడ్పొకటి వినఁబడియెను. అంత నతఁడు అచ్చటికిం బోయి, ఎత్తయిన యొక గుంటికడ, జవ్వనంపువాని దుఃఖితుని సుందరాకారుని ఒకకుమారుని రాజభటుం డొకఁడు తెచ్చి యప్పుడచట విడుచుటయు, ఆ కుమారుఁడు ఏడ్చు చున్న యొకముసలిదానిని వెనుకకు మరలింప మంచిమాటలు పల్కుచుండుటయుం, గాంచి, అతఁ డెవఁడో యని తాను చాటుననుండి జాలిగొని చూచుచు వినుచుండఁగా, ముసలిది ఓర్వరానిశోకమున నిట్లు ఏడ్వసాఁగెను. 'అయ్యో! పుత్రకా, శంఖచూడా, పడరాని కడగండ్లును కొలఁదిలేని దుఃఖములును బడి నిన్నుఁ గంటిమి గదరా! అయ్యో! ఓ నాగుణనిధీ, ఈ కులమునకు నీ వొకఁడవే దారమవు గదరా! నాపట్టీ, నిన్ను మరల నే నెట్లు కాంతును! వత్సా, యీ నీమోము నెల క్రుంకి పోయి నంతట నీ తండ్రి వృద్ధు ఈ శోకాంధకారము చే నే మగునో! ప్రొద్దుకరములు సోఁకిన మాత్రానం గందు నీ నెమ్మేను తార్క్ష్యుఁడు భక్షించునొప్పిని ఎట్లు సైఁచును! బాబూ, ఇంత గొప్పనాగలోకములో ఆ బ్రహ్మకును నాగరాజునకును వెదకఁగా వెదకఁగా ఈయభాగ్యురాలి యేకపుత్త్రుఁడవు నీవే దొరకితివా?' వృద్ధ యిక్కరణి పరిదేవించుచుండ లేఁబ్రాయము వాఁడు కుమారుఁడు 'అమ్మా, మొదలే శోకములో మునింగిన నన్ను మఱియు శోకింపఁ జేసెద వేమి? అమ్మా, ఇఁక యింటికిం బొమ్ము. ఇదె నీకు నా కడపటి నమస్కారము, వేళ యైనది.

మన మిట్లుండఁగానే గరుత్మంతుఁడు వచ్చినను వచ్చును.' అని యనునయించెను. ఆమాట విని యాతల్లి 'అయ్యో, చెడితిని, అయ్యో, నాపుత్త్రుని రక్షించువా రెవ్వరు ?' అని యేడ్చుచు, దీనదృష్టులతో దిక్కులు సూడ సాగెను. అంతట జీమూత వాహనుఁడు కని విని కనికరంబు మీఱ 'పాపము, వీఁడు నాగుఁడు, వీనిపేరు శంఖచూడుఁడు. అయ్యో! వాసుకి వీనిని తార్క్ష్యునికి ఆహారముగా నిపుడు పంపినాఁడు ఈమె యితనితల్లి, ప్రేమచే వెంట వచ్చినది. ఈమెకు ఈతఁ డొకఁడే సుతుఁడు, శోకముచే జాలిగా పలవించుచున్నది. కావున తప్పక నశించు నదైన నాదేహము నిచ్చి ఈదీనుని నేను గావనియెడల, ఛీ! నాకు ఈ నిష్ప్రయోజనంపుఁబుట్టు వేల?' అని ఇట్లాలోచించి జీమూత వాహనుఁడు ముసలమ్మకడ కేఁగి సంతోషము తోఁప 'అమ్మా, భయపడకు, నీ పుత్త్రుని నేను రక్షించెదను.' అనెను. ఆమాట కులికి పడి ఆవృద్ధ గరుడుఁ డని భయపడి ' ఓయి తార్క్ష్యుఁడా, నన్ను భక్షింపుము, నన్ను భక్షింపుము.' అనెను. అంతట శంఖచూడుఁడు తల్లితో 'అమ్మా, ఈయన గరుడుఁడు గాఁడు భయపడకు, చంద్రునివలె ఆహ్లాదకరుఁడు. ఈ సౌమ్య దర్శనుఁ డెక్కడ? ఘోరరూపుఁడు గరుడుఁ డెక్కడ?' అని యోదార్చెను. శంఖచూడుఁ డిట్లు చెప్పఁగా జీమూతవాహనుఁడు ముదుసలితో 'అమ్మా, నేను విద్యాధరుఁడను, నీపుత్త్రునిఁ గాచుటకు వచ్చితిని, వస్త్రము గప్పుకొని నా దేహమును నీ

కుమారునికి మాలుగా గరుడునికి ఆహారముగా నిచ్చెదను. నీవు పుత్త్రునింగొని యింటికిం బొమ్ము.' అని వచించెను. ఆమాట విని ముసలిది 'వలదు నాయనా, వలదు, ఇట్టికాలమున మాయందు ఇట్టికరుణగల నీవు శంఖచూడునికన్న నా కెక్కువపుత్త్రుఁడవు.' అనెను ఆమాటకు జీమూతవాహనుఁడు 'నామనోరథమునకు భంగము సేయుట మీకుం దగవు గాదు.' అని పట్టుదలతో పలుకఁగా, శంఖచూడుఁడు ఇట్లనియె:—'ఓమహాసత్త్వుఁడా, నీ కృపాకులత స్పష్టముగా అగపడుచున్నది. నేను మాత్రము నీశరీరముచే నాశరీరమును కాపాడుకొనను. రత్న మిచ్చి యెవఁడు ఱాతిం గాపాడును! తనపై మాత్రము కనికరము పూనుకొనెడు వారు నాబోంట్లు లోక మెల్ల నిండియున్నారు. నీవలె లోకము నెల్లం గనికరించువారు అరుదు గదా. సూర్య బింబమున కొక్కకళంకము పెట్టినట్లు నేను శుచి యైన శంఖ పాలకులమునకు అపకీర్తి కలిగింపను.' ఇట్లు జీమూతవాహనుని తొలఁగం బలికి శంఖచూడుఁడు తల్లితో వెండియు నిట్లనియె:- 'అమ్మా, దారియు తెన్నును లేని యీతావునుండి త్వరగా పొమ్ము. ఇదె యిటం గానవా యేమి నాగుల నెత్తుటిబురదతో పేరుకొని మృత్యుదేవతయొక్క క్రీడాశయ్యవలె భయంకర మైన యీవధ్యశిలాతలమును? నే నిదె యిట సముద్రపుదరిని ఉన్న గోకర్ణేశ్వరునికిమ్రొక్కి త్వరగావచ్చెద. గరుడుఁడువచ్చు నప్పటికి కిట నుండెద.' ఇట్లు శంఖచూడుఁడు ఏడ్చుచున్న దీని

రాలిని తల్లిని ప్రణమిల్లి పీడ్కొని గోకర్ణునికి మొక్కుటకు పరువునం బోయెను

అంతట జీమూతవాహనుఁడు 'ఈ సందునం గనుక తార్క్ష్యుఁడు వచ్చెనా, నా పరోపకారము నెఱవేఱును.' అని మనంబున నెంచి యుండెను అంతలో సమీపించుచున్న పక్షీంద్రుని ఱెక్కలగాలిచే చెట్లు అల్లల్లాడుచు జీమూతవాహనుని వల దని నిషేధించునవివోలె నొప్పుచుండఁగా, గరుడునివేళ వచ్చిన దని యెఱింగి జీమూతవాహనుఁడు పరునిం గాచుటకు తనప్రాణ మిచ్చువాఁడై వధ్యశిల యెక్కి యుండెను. గరుడుఁడు ఱెక్కలతో ఆకాశముం గప్పుచు వచ్చి శిలాతలమునుండి మహాసత్త్వుని ముక్కునం గఱచికొని యెగసి అతనిశిరోరత్నమును పెఱికి క్రిందఁబడవైచి దారిపొడవునను నెత్తుథార జాడకట్టగా, వడిగాఁ గొనిపోయి ఆమలయాద్రియందే ఒక శృంగంబునం బెట్టికొని ఆరగింపదొరంకొనెను. తన్ను తార్క్ష్యుఁడు ఇట్లు భుజించుచుండ, 'ఈతీరున నాదేహముతో ఎల్ల పుట్టువులందును పరోపకారమును సాధించుచుందును గాక, పరోపకారవర్జితములైన స్వర్గమోక్షములు నాకు కలుగవుగాక.' అని ధ్యానించుచున్న మహాసత్త్వుఁ డైన యా విద్యాధరేంద్రునిపై దేవతలు దివినుండి పువ్వులవాన గురిసిరి.

ఈలోపల నతనిశిరోరత్నము నెత్తురులం జొత్తిల్లుచు అతని భార్య మలయవతి ముంగిటంబడియెను. ఆమె దానిం గని గుఱుతు

పట్టి, దిగు లొంది, యుత్తమాంగమును జూచెను. వారును పుత్త్రుని యాశిరోరత్నమును గాంచి, యిదేమని సంభ్రాంతులై విద్యాప్రభావముచే యథావృత్త మెఱింగి, జీమూతకేతుమహారాజును తద్భార్య కనకవతియును, కోడలు మలయవతితోఁగూడ వడివడిగా తార్క్ష్యజీమూతవాహను లున్నతావునకు తరలిరి. ఇంతలో గోకర్ణుం గొలిచి వచ్చి శంఖచూడుఁడు వధ్యశిలాతలము క్రొత్తనెత్తుటం దడిసి యుంటం గని, దిగులుపడి, 'అయ్యో, ఎంత పాపాత్ముఁడను, పాపడైతిని పాపడైతిని; నిశ్చయముగా ఆ మహాసత్త్వుఁడు జాలిగొని నాకై తనదేహమును గరుడునికి ఆహారముగా నర్పించినాఁడు; కావున అతనిని ఎచటికి గరుత్మంతుఁడు కొనిపోయెనో ఈక్షణమే వెదకెద. ఆమహానుభావుఁడు జీవముతో నుండునేని నేను అయశఃపంకములో మునుంగను.' అని కన్నుంగవ బాష్పధార లురలఁ బలుకుచు నా సాధువు భూమిపై ఎడతెంపు లేకుండం బడిన జీమూతవాహనుని నెత్తుటి జాడను పట్టి వడివడిగాఁ జనియెను. ఇంతలో గరుడుఁడు తాను తినుచున్నందులకు జీమూతవాహనుఁడు సంతసించుటం గని తత్క్షణము తిండి మాని ఆలోచించెను:— 'ఆహా! ఏమి యీ వింత! ఇతఁడెవఁడో అపూర్వుఁడు మహాసత్త్వుఁడు, నేను భక్షించు కొలఁదియు సంతసిల్లుచున్నాఁడు: ప్రాణము పోలేదు. తినఁగా మిగిలిన యవయవములందుఁ బులకగవుసెనం దాల్చియున్నాఁడు! నన్ను ఉపకారింబోలె కరుణార్ద్రవీక్షణములం గనుచున్నాఁడు!

ఇతఁడు నాగుఁడు గాఁడు, ఎవఁడో సాధువు. అడిగెదను, ఇతని భక్షింపను.' అంత తార్క్ష్యుని జీమూతవాహనుఁడు ' ఓ పక్షీంద్రుఁడా, భోజనము మానితివి ఏమి ? ఇంకను నా దేహమున రక్తమాంసము లున్నవి గదా, నీకు ఇంకను ఆఁకలి తీఱలేదు; కావున భుజింపుము.' అని హెచ్చరించెను. ఈమాటకు గరుడుఁడు మఱియు నాశ్చర్యపడి 'మహానుభావా, నీవు నాగుఁడవు కావు, ఎవఁడవో చెప్పుము.' అని యడిగెను 'నాగుఁడనే యనుకొమ్ము. ఎవఁడనో ఆప్రశ్న యేల ? ప్రకృతము ననుసరింపుము. తెలివిగలవాఁడు ప్రకృతార్థవిరుద్ధమును చింతించునా?' అని జీమూతవాహనుఁడు బదులు పల్కుచుండఁగా శంఖచూడుఁడు దూరమునుండియే కని యిట్లు మొఱయిడెను.—'వలదు వలదు వైనతేయా ! మహాపాతకము సాహసము సేయకు ! ఏమి నీకీ భ్రమ ? ఈయన నాగుఁడు గాఁడు, నేను నాగుఁడను, నీయాహారమను.' ఇట్లు పలుకుచు శంఖచూడుఁడు తటాలున వచ్చి ఆయిరువురకును నడుమ తాను నిలిచెను. కని భ్రాంతుఁడై యున్న గరుడునితో శంఖచూడుఁడు మరల నిట్లనియె:—'ఏమి నీ కింకను భ్రమయా ! నాఫణములు చూడవా ? నా నాలుక చీలికలం గనవా ? ఈవిద్యాధరుని సౌమ్యాకృతిం గనవా?'

ఇట్లు శంఖచూడుఁడు పలుకుచుండఁగా, జీమూతవాహనుని తల్లి దండ్రులును భార్యయు వచ్చి కలసిరి. తల్లి దండ్రులు ఆతని కొఱమేనిం గాంచి వగలం బొగులుచు 'హా! పుత్త్రా,

జీమూతవాహనా, జాలిగుండెవాఁడా, వత్సా, పరార్థమై ప్రాణము ఇచ్చి వేసితివా! ఓయి వైనతేయుఁడా, ఆలోచన లేక యిట్లు చేసితివి!' అని యేడువం దొడంగిరి. ఆయేడుపు విని తార్క్ష్యుఁడు పశ్చాత్తాపము పొంది 'అయ్యా, అజ్ఞానంబున నేను బోధిసత్త్వాంశసంభవుని జీమూతవాహనుని భక్షించితిని. ఏ మహాత్ముని పరోపకారకీర్తి త్రైలోక్యంబున నెల్లెడల నుద్ఘోషితమగుచున్నదో అతఁ డితఁడు పరార్థము ప్రాణ మిచ్చినాఁడు. కాన నితఁడు మృతిం జెందిన, నాకు అగ్నిప్రవేశమే యీపాతకమునకుం బ్రాయశ్చిత్తము. అధర్మవిష వృక్షమున తియ్యని పండు పండునా?' ఇట్లు గరుడి తలపోయుచుండఁగా జీమూతవాహనుఁడు బంధువులం గని గాయముల నొప్పి చేత పడిపోయి ప్రాణములు విడిచెను. అంతట శోకదీనులయి యాతని తల్లిదండ్రులు ఏడ్చుచుండఁగా, శంఖచూడుఁడును ఏడ్చుచు తన్నుఁదాను మాటిమాటికిం దిట్టుకొనుచుండఁగా, జీమూతవాహనుని భార్య మలయవతి మింటిం జూచుచు కన్నీళ్లు ఉరల ఎలుంగు ద్రొట్రిల అంబికాదేవిని గూర్చి, మున్ను ఆమె తనకిచ్చిన వరముం దలఁపించుచు, నిట్లు దెప్పరముగా మొఱ యిడెను. 'ఓ తల్లీ, భావి విద్యాధర చక్రవర్తి నీకు వరుఁ డగు నని వర మిచ్చితివి. మందభాగ్య నయిన నాకతంబున నీమాటయుం గల్ల యాయెఁగదా!' ఇట్లు మలయవతి పలుకఁగానే దేవి ప్రత్యక్షమై 'పుత్త్రీ, నామాట పొల్లెట్లగును?' అని పలికి తన కమండలువునుండి

యమృతముం గొని జీమూతవాహనుని పైఁ జిలుకరించెను. అంత జీమూతవాహనుఁడు గాయము లేక వజ్రదేహుఁడై మునుపటికన్న నెక్కువ తేజము పొంది బ్రదికి లేచి దేవికి మ్రొక్కెను. అట్లు బ్రదికి లేచిన యాతనిం గాంచి అందఱును అమ్మవారికి ప్రణతు లయిరి. అంతట దేవి 'పుత్త్రా, నీవు చేసిన యీ దేహదానమునకు మెచ్చితిని ఇదె నిన్ను నేను స్వయముగా ఆకల్పము విద్యాధరచక్రవర్తింగా నభిషేకము చేసెదను.' అని యానతిచ్చి తానే కలశోదకములతో నతని నభిషేకించి పూజ లొందించి యంతర్ధాన మాయెను. అంతట నాకసమునుండి పుష్పవానలు కురిసెను. దేవదుందుభులు మ్రోగినవి. ఎల్లవారును హర్షించిరి.

అంతట గరుడాలమంతుఁడు వినయంబున జీమూతవాహనునితో ని ట్లనియె:—'ఓచక్రవర్తీ, మహాపురుషుఁడవు, నీయందు నేను బ్రీతుఁడ నైతిని ముల్లోకములకును వింత యగు నీయపూర్వోదార్యము బ్రహ్మాండపుగోడలయందు చిత్తరువుగా వ్రాయఁబడియున్నది. ఓమహానుభావా, నన్నుం బనిగొమ్ము, నావలన నీకోరినవరంబుం బొందుము.' ఇట్లు గరుడి వచింప జీమూతవాహనుఁడు పలికెను.— 'నీ వింక పాములను భక్షింపకుము. ఇంతవఱకు భక్షించినందులకుం బశ్చాత్తాపము పొందుము నీ విప్పటికి భక్షించిన పాముల యా యెంపప్రోవులు మరల నిపుడు జీవ మొందును గాక.' గరుడుఁడు 'అట్ల యగుఁ

గాక, ఇంక నేను పాములం దినను, మున్ను నే భక్షించినవి యిపుడు బ్రదుకునుగాక' అనియెను. అంత నాయెముకల ప్రోవు లెల్ల నతని వరామృతంబున జీవ మొంది లేచినవి. అంతట సురలు నాగులు మునివరులును ఆమలయపర్వతమందు మహానందంబున మూఁగిరి. ఆపర్వతము ముల్లోకముల మొత్త మో యన నొప్పుచుండెను. ఆకాలమున జీమూతవాహనుని యాయద్భుతచరిత్రమును గౌరిప్రసాదంబును విద్యాధరేశ్వరు లెల్ల ఎఱింగి వచ్చి యాతనిపాదముల కెరఁగి పార్వతీ హస్తాంబుజలబ్ధాభిషేకుని చక్రవర్తిని అతనిని ముద మొందిన బంధుసుహృత్సమూహములతోఁ గూడ హిమాలయమునకుం గొని పోయిరి. అట తలిదండ్రులతోను భార్యతోను మిత్రావసువుతోను, ఇంక, ఇంటికి పోయి వచ్చిన మిత్త్రుఁడైన శంఖచూడునితోను కూడుకొని జీమూతవాహనుఁడు లోకోత్తరచారిత్రాద్భుతము చేత సిద్ధించిన దై రత్నోపచిత మైన విద్యాధరచక్రవర్తిపదమును నిర్వహించు చుండెను.

ఇట్లు బేతాళుఁడు అద్భుతకథను చెప్పి రాజును ప్రశ్న చేసెను. 'రాజా, చెప్పుము. సత్త్వములో శంఖచూడుఁడు గొప్పవాఁడా, జీమూతవాహనుఁడు గొప్పవాఁడా? నీకు మును పటి సమయమే.' ఇట్లు బేతాళుఁడు అడుగఁగా విక్రమార్కుఁడు మౌనము విసర్జించి యి ట్లనియె:— 'జీమూతవాహనుని కిట్టి దివ్యచరిత్రము పెక్కు పుట్టువులనుండి సిద్ధించియే యున్నది,

ఇది యతని కేపాటి? తన చావు తప్పఁగా, అంతటితోఁ బోక తన సహజశత్రునికి తనకు బదులుగా నిం కొకనిం గొని దూరము పోయిన గరుత్మంతునికి వెనువెంటం జని తన్ను అర్పించుకొన్న శంఖచూడుఁడే సత్త్వాధికుఁడు.' ఇట్లు రాజు చెప్పగా విని బేతాళుఁడు అదృశ్యుఁ డై తనతావునకుం బోయెను. మరల విక్రమార్కుఁడు అతనిం దేఁబోయెను.

---

కథ—౧౭.

అనంతరము త్రివిక్రమసేనుఁడు ఆ శింశుపావృక్షము నుండి బేతాళుని బుజమునం బెట్టుకొని తెచ్చుచుండ బేతాళుఁడు ఆరాజునకు శ్రమనివారణముగా కథ చెప్పెద నని యిట్లు చెప్పం దొడఁగెను. గంగాతీరమునందు పూర్ణ మయిన ధర్మమర్యాద గలది కలిపురుషునికి చొరరానిది కనకపుర మని యొక పట్టణము కలదు. అందు సార్థకనాముఁడు యశోధనుఁ డను రాజు ఏలుచు భూమిని ఉపద్రవమునుండి రక్షించుచుండెను. ఆయనకు అపాండిత్యము పరదూషణయందుఁ గాని శాస్త్రములందుఁ గాదు, పేదఱికము దోషములందే గాని కోశదండంబులందుఁ గాదు. ఆయన పాపభీరువు,యశోలోభి, పరనారీషండుఁడు నయ్యు శౌర్యౌదార్యశృంగారమయుఁ డని లోకులచే బొగడ్త నొందెను. అతని యా రాజధానియందు గొప్ప వర్తకుఁ డొక

డుండెను. అతనికి ఉన్మాదిని యని కూఁతు రొకతె యుండెను. ఆకన్యను కన్నెత్తి చూచినవాఁ డెల్ల ఆరూపసంపదచేత ఉన్మాద మొందుచుండెను. ఆకన్నెకు జవ్వనము వచ్చినంతట తండ్రి నీతి యొఱింగి యశోధనుని దర్శించి యిట్లు విన్నవించెను:—'మహా ప్రభూ, నాకు త్రైలోక్యరత్నమైనది కూఁతు రొకతె పెండ్లి గాఁదగినది యున్నది. ఏలినవారికి దెలుపక దాని నింకొకని కీయ నుత్సహింపను. సకలభూమండలమందును సకలరత్నములకును నీవే ఒడయఁడవు. కావున నీవు దానిం గైకొనియేని వదలియేని యనుగ్రహింపవలయును.' వైశ్యుని విన్నపము నాలించి రాజు ఆచిన్నదాని సౌలక్షణ్యముం గని రమ్మని శ్రద్ధతో తన బ్రాహ్మ ణులను పంపెను. బ్రాహ్మణులు పోయి యాత్రైలోక్యసుందరిం గని డెందంబులందు గందరగోళపడి యెట్టకేలకుం దెప్పిరిలి యిట్లు తలపోసిరి. 'ఈతరుణిని రాజు పొందిన తప్పక రాజ్యము నాశ మగును దీని మోహామునం బడి యాతఁడు రాజ్యమును మఱి తలంచుట యెక్కడిది? కావున సులక్షణ యని మన మేమాత్రంబును రాజునకు చెప్పఁగూడదు,' ఇట్లు ఆలోచించు కొని వా రందఱు రాజుతో ఆకన్య కులక్షణ యని బొంకిరి. అందున రాజు ఆవణిక్కుమారిని గ్రహింపఁడాయెను. అంతట నాతనియాజ్ఞచేత నా వర్తకుఁడు ఉన్మాదినిని బలధరుఁ డను సేనాపతి కిచ్చెను. రాజు తన్ను కులక్షణ యని కైకొనసందు

లకు ఆమె అవమానపడి భర్తయింట భర్తతో సుఖముగా నివసించుచుండెను.

ఇట్లు కాలము గడచుచుండఁగా వసంతము అవతరించెను. అంత వసంతోత్సవముం గాంచుటకు యశోధనుఁడు ఏనుఁగుపై నూరేఁగెను అతని రూపముం గాంచి కులాంగనలు శీలభ్రంశ మొందుదు రని వారి నవలికి జడియింప తుడుము గొట్టుచుండ విని యున్మాదిని తనయింటిమేడనుండి ఆరాజునకు పరిత్యాగావమానముచే ప్రయత్నపూర్వకముగా నగపడియెను కంటి కగపడినమాత్రాన ఉన్మాదిని కామాగ్ని జ్వాలయో యన క్షోభపెట్టఁగా రాజు మూర్ఛ పోయెను. సేవకులు ఓదార్చి నగరికిం గొనిపోయిరి. ఆసుందరి మున్ను తన్నుఁగూర్చి రాఁగా తాను త్యజించిన వణిక్కన్య యని వారివలన రాజు తెలిసికొని, కులక్షణ యని చెప్పినట్టి యాబ్రాహ్మణులను దేశము వెడలఁ గొట్టి రేయుంబవలు ఆయువతినే ధ్యానించుచు కామాగ్నిపుటపాకంబులం గ్రాఁగుచు నానాఁటికి నాసిల్లుచుండెను. వెలిచిన్నెలు గని శంకించి ఆప్తులు అడుగఁగా సిగ్గుచే చెప్పలేక చెప్పలేక ఎట్టకేలకు తన నెగులునకుం గతముం జెప్పెను. మహాప్రభూ, 'ఏల యిట్లు వగచెదవు? నీకు కైవసమ యై యుండఁగా నేల కైకొనవు ?' అని వారు బోధింప ధార్మికుఁ డామహీపతి యంగీకరింపఁడాయెను. అంతట సేనాపతి బలధరుఁడు ఆవృత్తాంత మెఱిఁగి వచ్చి భక్తిమెయిం బ్రభువునడుగులం ద్రెళ్ళి యిట్లు

వేఁడుకొనెను:—'దేవా, నీ దాసుని స్త్రీ నీకు దాసియే పర దార గాదు. నేనే నాభార్య నిచ్చెదను. గ్రహింపుము. అట్లు ఇష్టము గాదేని నేను దానిని దేవళములో విసర్జించెదను. దేవ ళపు వెలఁదిని గొనుట దోసఁగు గాదు గదా.' ఇట్లు సేనాపతి వేఁడి యిబ్బంది పెట్టఁగా రాజు మదిలో కోపము కలిగి 'నేను రాజ నయ్యు నిట్టియధర్మ మెట్లు ఆచరింతును ? నేనే నీతి దప్పిన ఎవఁడు తనమార్గమున నిలుచును ? నాయందు భక్తుఁడ వయ్యు నన్ను ఇట్లు ఇపుడు క్షణసుఖావహాం బై పరలోకమున మహా దుఃఖ మిడునట్టిపాపమునం బడఁద్రోయఁ దలంచెద వేమి ? నీధర్మ దారను వదలుదువేని నిన్ను క్షమింపను. మముబోంట్లు అట్టి ధర్మాతిలంఘనము నెట్లు సహింతురు ? కావున మరణమే మేలు.' అని పలికి నిషేధించెను. ఉత్తమసత్త్వులు ప్రాణము నేనియు వదలుదురుగాని సదాచారమును వదలరు. అట్లే పౌరు లెల్ల వచ్చి బతిమాలుకొన్నను రాజు దృఢనిశ్చయముకలవాఁ డై నిరాకరించెను. అనంతరము కొన్నిదినములకు ఆమదనజ్వరము చేతనే రాజు మృతినొందెను. ఆవిధముగా ప్రభువునకుం గలి గిన మరణమునకు దుఃఖితుఁ డై సేనాపతి చిచ్చుం జొచ్చెను. స్వామిభక్తులచేష్టితము అనిర్వాచ్యము గదా.

ఇట్లు బేతాళుఁడు అద్భుతమయిన యీకథను చెప్పి త్రివిక్రమసేనుని, తొల్లింటి తనశాపము జ్ఞప్తిచేసి, ఆరాజ సేనాపతులు ఇరువురలో సత్త్వాధికుఁ డెవ్వఁడో చెప్పు మని

యడిగెను. రాజే సత్త్వాధికుఁ డని విక్రమార్కుఁడు చెప్పెను. బేతాళుఁడు ఆక్షేపించెను. 'రా జెట్లు అధికుఁడు ? సేనాపతి యేల గాఁడు? అతఁడు నిజభార్యను లోకోత్తర సౌందర్యను తదీయభోగసుఖముల నాస్వాదించియు ఆ విధమున భక్తిచే స్వామికి సమర్పించెను గదా. తాఁడు మృతి నొందినంతట తద్భక్తిచే నావడువున నగ్నిం జొచ్చెను గదా. ఆయున్మాదిని పొందు రస మెఱుంగమిచే రాజు ఆమెం గైకొనకపోయెను' బేతాళుఁడిట్లు వచింపఁగా విక్రమార్కుఁడు బదులు చెప్పెను:—'నీవు చెప్పినది సరియేగాని, సత్కులప్రసూతుఁడు సేనాపతి స్వామిభక్తిచే అట్లు చేయుట యదేమి చిత్రము! ప్రాణముల నేనియు నొసంగి స్వామిసంరక్షణము సేయుట భృత్యుల వ్రతముగదా. రాజు లన్ననో మదోన్మత్తులై నిరంకుశులై ఏనుంగులువోలె విషయోన్ముఖులై ధర్మమర్యాద యను గొలుసును త్రెంపుదురు వారికి అభిషేక జలములతోఁ గూడ వివేకము కొట్టుకొని పోవును. దుమ్మును దోమలను ఈఁగలనుంబోలె పెద్దలు నేర్పిన శాస్త్రార్థములను వింజామరలగాలి ఎగఁజోపి వేయును. లోకము లెల్ల గెలిచిన నహుషాదిరాజులు సయితము మాకని మాయలం జిక్కి కీడ్వడరా? ఈరా జన్ననో భూలోకములో ఏకచ్ఛత్త్రాధిపతి యయ్యును చపల యగులచ్చి చేతనుంబోలె చపల యగు నున్మాదిని చేత మోహమునం బడఁ డాయెను.' కావున

నతఁడే సత్త్వాధికుఁడు. ఈయుత్తరము విని బేతాళుఁడు మాయ మాయెను. విక్రమార్కుఁడు మరలం దేఁ బోయెను.

---

కథ—౧౮.

అనంతరము సొదమంటలు నిండియున్న రుద్రభూమిలో నెవరుబెదరు లేక విక్రమార్కమహారాజు రాత్రి మరల శింశుపా వృక్షముం దఱియం జని చూడఁగా నందు బేతాళవికృతులు శవములు లెక్క లేక యురులయందు వ్రేలాడుచు నుండినవి. 'ఏమి యీ యాశ్చర్యము! హా, ఈ మాయావి బేతాళుఁడు కాలము దాఁటించుచున్నాఁడు! ఇందు ఇన్నిశవములలో దేనిం గొనవలయునో యెఱుంగ లేకున్నాఁడ. నాకార్యము నెఱ వేఱక యీరాత్రి కడచునేని అగ్నిం జొచ్చెదఁ గాని పరిహా స్యుఁడనై జీవింప నోపను.' అని రాజు తలంచుచుండ, బేతా ళుఁడు అతని నిశ్చయముం గని సత్త్వమునకు మెచ్చి తన మాయను ముణిఁచి వేసెను. అంతట రాజు చెట్టున నొక్కటియ శవము బేతాళాధిష్ఠితము ఉండం గని దానిని బుజమునం గొని నడచుచుండెను. బేతాళుఁడు రాజుతో మరల నిట్లు వచించెను — రాజా, నీవు విసువవు, బెగడొందవు, నీచరి త్రము విచిత్రముగా నున్నది. కాన ఈ కథను వినుము.

మహాకాళనికేతనం బయిన యీయుజ్జయినిని పూర్వము చంద్రప్రభుఁ డను రాజు ఏలుచుండెను. ఆయనకు తద్దయు నెఱుక గలవాఁడు దేవస్వామి యను బ్రాహ్మణుఁడు పలుయాగములు చేసినవాఁడు మహాధనికుఁడు మంత్రిగా నుండెను. ఆయనకు చంద్రస్వామి యని కొమారుఁ డొకఁడు. ఆ చిన్నవాఁడు చదివినవాఁ డయ్యును జూదముపాలం బడియెను. ఒకనాఁడు జూద మాడం గోరినవాఁడై చంద్రస్వామి జూద మాడించువారి ఇంటికిం బోయి, జూదరులతోఁగూడ ఆడి క్రమముగా గుడ్డలు సయితము ఒడ్డి, ఓడి, ఇంకను పైగా తనకు లేని ధనమును సయితము ఒడ్డి, యోడెను అంతట ఎంత నిర్బంధించినను లేమిచే ఆధన మతనివలన రానందున ద్యూతకారుఁడు అతనిం గట్టించి దుడ్డు గుదియలతో కొట్టించెను. దుడ్డుమోఁదులు పుచ్చుకొని చంద్రస్వామి ఒడలెల్ల జర్జరీభూతము కాఁగా రాతి బొమ్మవలె కదలక చచ్చినవానివలె జిత్తు చేసి పడి యుండెను. అట్లే యట నతఁడు రెండు మూఁడుదినములు పడియుండఁగా సభాపతి ఇంటిలోని తనజూదరులతో నెల్ల నిట్లు పలికెను. 'వీఁడు రాతిరీతిం దాల్చినాఁడు గావున నిస్సత్త్వుని వీనిం గొని పోయి ఎటనేని చీఁకటినూతిలో పాఱవేయుఁడు; వీఁ డీవలసిన ధనమును మీకు నే నిచ్చెదను.' అంతట నాజూదరులు చంద్రస్వామిని అడవికి మోచికొని పోయి . నూతిని వెదకు చుండిరి. వారిలో ముసలిజూదరి యొకఁడు 'వీఁడు ఈ నిముసమో

పై నిముసమో చచ్చినవాఁడే, ఇఁక వీనిని బావిలో వేసిన మాత్రాన మన కేమి వచ్చును? కావున వీని నిటనే పాఱవైచి బావిలోనే వైచితి మని చెప్పుదము.' అని హెచ్చరించెను. ఇతరులు అంగీకరించిరి.

అట్లు వారు తన్ను వైచిపోయిన యనంతరము చంద్రస్వామి లేచి ఆ చెంతనున్న యొక శూన్యశివాలయముం జొచ్చి, యచ్చట కొంచెము తేరుకొని శోకావేశమున నిట్లు చింతింపం దొడంగెను.— 'అయ్యో! నమ్మించి మాయ చేసి జూదరులు న న్నిట్లు కొల్లగొనిరి! గుడ్డ లేక దుమ్ము నిండి యీస్థితిలో నేను ఎట కేఁగుదును? తండ్రి యేని బంధు వేని మిత్త్ర మేనియు నన్నుం గని యే మనును? కాన ఇపుడు ఇటనే యుండి రాత్రి వెలువడి ఆఁకలి తీర్చుకొనుటకు ఏ మయిన నుపాయము వెదకెదను.' ఇట్లు ఆతఁడు తలపోయుచుండఁగా సూర్యుఁడు అస్తాచలమున కేఁగెను. ఆసమయమున నచ్చటికి ఒడలెల్ల విభూతి తాల్చి తాపసుఁ డొకఁడు మహావ్రతి జటాశూలధారి సాక్షాత్పరమ శివుఁడుం బోలె నేగుదెంచెను. అతఁడు చంద్రస్వామిని గని వృత్తాంత మడిగి విని నమ్రుని అతనిం గూర్చి యిట్లనియె:- 'నీవు నే నెదురు సూడకయే యీనాయాశ్రమమునకు ఆఁకటఁ గటకటం బడుచు వచ్చినయతిథివి, కావున లేలెమ్ము, స్నానము చేసి రమ్ము, భిక్షాభాగమును భుజింపుదువు గాని.' అ ట్లతండు పలుకఁగా చంద్రస్వామి 'స్వామీ, నేను బ్రాహ్మణుఁడను, భిక్షా

భాగ మెట్లు భుజింతును?' అనియెను అంతట నావ్రతి యతిథి పరాయణుఁడు తనమఠముం జొచ్చి యిష్ట సంపాదన విద్యను స్మరించెను స్మరించినంతట విద్య వచ్చి ఏమి సేయ వలయును ?' అని అడుగ ఈ యతిథికి ఆతిథ్యము సేయుము.' అని తాపసుఁడు ఆన తిచ్చెను. ఆమె సరి యనఁగానే ఆచట విహారవనముతో అంగనామణులతో బంగారునగర మొకటి ఉత్పన్నమై, చంద్ర స్వామి యాశ్చర్యపడి చూచుచుండఁగా అందుండి వారాంగనలు వచ్చి ఆతనిని 'సామీ, లెమ్ము, స్నానము గావించి భోజనము సేసి, శ్రమ తీర్చుకొమ్ము.' అని లోనికి పిలుచుకొనిపోయి స్నాన మాడించి మైపూఁతలు పూసి వలువలు కట్ట నిచ్చి మఱియొక యింటికిం గొనిపోయిరి. ఆచట బ్రహ్మదేవుఁడు వేడుకకై సృజించి నట్టిదో యన నొకసర్వాంగసుందరి నారిలో నెల్ల నాయిక ఇతనిం గని లేచి యనురాగపూర్వకముగా తన యర్థాసనంబునం గూర్చుండఁ బెట్టుకొనెను చంద్రస్వామి యామెతోఁ గూడ దివ్యాహారంబులు ఆరగించెను అనంతరము తియ్యనిపండ్లు భుజించి తమ్ములము వేసికొని రాత్రి మంచంబునం బవ్వళించి ఆసుందరితో సంభోగంబులం దేలెను. తెల్లవారినంతట మేలు కాంచి చూడఁగా ఆపాడుదేవళముమాత్రముండెను ఆసివ్యాం గనయు లేదు, ఆ పురము లేదు, ఆపరిజనంబును గాన రాదు. అంత చంద్రస్వామి వగఁ గూరి యుండ, మఠమునుండి వెలువడి వచ్చి యా తాపసుఁడు చిఱునవ్వుతో అతనిని రాత్రిసుఖ

మడిగెను. చంద్రస్వామి 'నీదయచేత నేను రాత్రి సుఖముంటిని. కాని ఆ దివ్యకన్య లేక నా ప్రాణములు పోవుచున్నవి' అని విన్నవించెను. అంతట తపస్వి దయానిధి నీ విటనే యుండుము, 'రాత్రి మరల నీ కట్లే కావించెదను' అని నవ్వుచు పలికెను. అట్లే చంద్రస్వామి యుండెను.

అట్లు ప్రతిరాత్రియు ఆతాపసుని కరుణచేత చంద్రస్వామి భోగంబు లనుభవించుచుండి, అది యెల్ల విద్యాప్రభావంబున నని యెఱింగి విధిచోదితుఁడై యొకనాఁడు తాపసునిం బ్రసన్నుం గావించికొని 'స్వామీ, తమకు నాయందు కరుణ గలదేని శరణాగతునికి నాకు నిట్టి దివ్యప్రభావము గలదైన యావిద్య నుపదేశింపుఁడు' అని వేఁడుకొని ఎంతయు నిర్బంధింపసాఁగెను అంతట తాపసుఁ డిట్లనియె:— 'ఈవిద్య నీకు సాధ్యపడదు దీనిని నీటిలో మునిఁగి సాధింపవలసియున్నది అచ్చట జపము సేయుచుండఁగా నిది క్షణములో సాధకుని నానా మాయాజాలముల పాలుసేసి సిద్ధి నొందనీయదు. సాధకుఁడు అచట తాను మరల జనించి బాలుఁడైనట్లు తన కగపడును. పిమ్మట జవ్వన మొంది పెండ్లియై పుత్త్రులం గనును. ఇతఁడు నామిత్త్రుఁడు, ఇతఁడు, శత్రువు అని కల్లయే అతఁడు భ్రమించుచుండును. ఈజన్మము స్మరింపఁడు, విద్యాసాధన క్రియను మఱచును. ఎవఁడు ఇరువదినాలుగేండ్లవాఁడై గురువిద్యచే మేలుకొని యీజన్మమును జ్ఞప్తిసేసికొని అది యెల్ల మాయా

ప్రపంచ మని యెఱింగి, ఆమాయవశంబుననే వాస్తవ మైన యగ్నిప్రవేశము సేయునో అధికుఁడు నీచినుండి వెలువడి సిద్ధ విద్యుఁడై వచ్చును ఇట్టి వానికిఁ దక్క వేఱొండు శిష్యునికి ఈవిద్య సిద్ధింపదు తగనివాని కిచ్చుటచేత గురువునకుఁ గూడ నశించి పోవును నాసిద్ధిచేతనే నీకు ఫలము గలుగుచుండఁగా ఏల వృథాగా నీ కీపట్టుదల ? ఒకవేళ నాకును నీకునుం గూడ నిది దక్కక పో నేల ?' ఇట్లు తాపసుఁడు వచింపఁగా చంద్ర స్వామి మొండిపట్టు విడువక ' నేను సాధింప నేర్తును. మీరు శంకింపక నాకు దయసేయుఁడు ' అని వేఁడెను. అంతట తాప సుఁడు అతనికి ఆవిద్య నీయ నొడంబడెను. 'ఆహా ! సాధువులు ఆశ్రితవాత్సల్యముచే నేమి సేయరు !' అనంతరము తాపసుఁడు చంద్రస్వామిని ఏటియొడ్డునకుం గొని పోయి ' వత్సా, విద్యను జపించుచు ఎపుడామాయను గందువో అపుడు నేను విద్యచే హెచ్చరిక చేసెదను అంతట నీవు ఆమాయాగ్నియందే ప్రవే శింపుము. నీకై నేనిటనే నదీతటంబున నుండెదను.' అని పలికి అతనిని స్నానమాడించి ఆచమనము చేయించి తానును శుచియై శుచికి ఆతనికి విద్యను ఉపదేశించి ఏటియొడ్డునం గూర్చుండెను.

శిష్యుఁడు నీట మునింగి విద్యను జపించును:—ఆకస్మి కముగా తాను ఒకబ్రాహ్మణునికి కుమారుఁడుగా జన్మించి బాల్యముం బొంది క్రమముగా ఎదిగెను. తండ్రి యుతనికి ఉపన యనము కావించి చదువులు నేర్పెను. అనంతర మితఁడు

అచట నొక సుందరిని పెండిలి యై ఆమె సుఖదుఃఖములే తనవిగా పూర్ణమోహమునం బడి కాలక్రమమున సంతతిం బొందెను అది మొదలు పుత్త్రులమీఁద ప్రేమచేత నాయాయి పనులు సేయుచు తల్లిదండ్రులను ఇతరబంధువులనుంగూడి స్త్రీ రాభినివేశముతో నుండెను. ఇట్లు మాయపుట్టువు ననుభవిం చుచు నతఁ డుండఁగా గురువు ఏటిగట్టునుండి ప్రబోధినీవిద్యను సమయంబునం బ్రయోగించెను. చంద్రస్వామి ఆవిద్యాప్రభా వముచేత తత్క్షణమే మేలుకొని తన్నును గురువును జ్ఞప్తి చేసి కొని ఆ క్రొత్తపుట్టువు వృత్తాంత మెల్ల మాయాజాల మని గ్రహించి యసాధ్య మయిన యా దివ్యసిద్ధికై యగ్నిప్రవే శము సేయ సమకట్టెను. వల దని పెద్దలు ఆప్తులు గురువులు బంధువులును చుట్టవేసికొని నివారింపం దొడంగిరి. వా రెంత చెప్పినను వినక దివ్యసుఖాభిలాషి యై ఏటియొడ్డున సొద పేర్పించి అందుం గూలుటకై పోయెను. బంధువులును వెంబ డించిరి. అచట వృద్ధులను తల్లిదండ్రులను, మరణోద్యుక్తను భార్యను, ఏడ్చుచున్న శిశువులనుం, గని అజ్ఞానంబున నిట్లు తలపోసెను:— ' అక్కటా, నే నగ్గిం జొచ్చిన ఈనాబంధువు లందఱు ప్రాణములు వదలుదురు. గురువు చెప్పిన యా మాట సత్యమో యేమో నిశ్చయ మెఱుంగను. కావున అగ్నిలోఁ బ్రవే శింతునా, ఒండె ప్రవేశింప కుందునా? అట్లు గాదు, గురువు మాట ఇన్ని విధముల తార్కాణ యైనది మిథ్య యె ట్లగును ?

శంకయేల ? అగ్నిం బ్ర వేశించెదను.' ఇట్లు అతఁడు మనస్సులో ఆలోచించుకొని చిచ్చుం జొచ్చెను. అగ్ని చంద్రస్వామికి మంచు వలె చలువగా తగిలెను మాయ మాయ మాయెను. అతఁడు ఆశ్చర్యపడుచు ఏటిగ ట్టెక్కి గురువుకడకు వచ్చి అతని పాద ములకు మ్రొక్కెను. గురు వడుగఁగా చంద్రస్వామి అగ్నిశై త్యాంతముగా తనవృత్తాంత మంతయు వక్కాణించెను అంతట గురు వి ట్లనియె:—'వత్సా, నీ వేమో యపచారమొనర్చితివి. కాదేని అగ్ని చల్లఁగా నుండం గారణము లేదు ఈ విద్యను సాధించుటలో ఇట్లు ఇంతకు ముందు ఎప్పుడును లేదు.' ఇట్లు గురువు పలుకఁగా చంద్రస్వామి తా నేమియు నపచారముసేయ లే దని చెప్పెను. అంతట తత్త్వము తెలియఁ గోరినవాఁ డై గురువు స్మరింపఁగా ఆ విద్య రా దాయెను. శిష్యునికిని రా దాయెను. ఇరువురును విద్యను పోఁగొట్టుకొని దుఃఖితు లై యటనుండి ఎట కేటకో పోయిరి.

ఇట్లు కథ చెప్పి బేతాళుఁడు విక్రమార్కమహారాజును మునుపటి శాపమే జ్ఞప్తి చేసి 'రాజా, నాకు ఈసంశయము తీర్పుము, కర్మ సరిగానే చేసినను, ఏ హేతువుచేత ఆగురు శిష్యుల కిరువురకును విద్య నష్ట మై పోయినది?' ఈప్రశ్నను విని రాజు ఇట్లు బదులు చెప్పెను:—'తెలియును నాకు, యోగీశ్వరుఁడా, నీవు కాలయాపన చేయుచున్నావు. కర్మ దుష్కర మయినను దానిని శుద్ధము గానే చేసినను, ఎంత

వటుకు మనస్సు చలనము మాని, సంశయములు పొందక, నిర్మల సత్త్వమందు నెలకొనదో అంతవటుకును సిద్ధి కలుగదు. ఆబ్రాహ్మణకుమారుని మనస్సు మంద మగుటచే హెచ్చరికం బొందియు సందియ పడు చుండెను అందువలన ఆతని విద్య నశించినది. అనర్హుని కిచ్చినందున గురువునకు నశించినది.' ఇట్లు రాజు పలుకఁగా బేతాళుఁడు బుజమునుండి యదృశ్యుఁ డై తనతావునకుం జనియెను. రాజు మరల నాతనిం గొని రా నరిగెను.

---

కథ—౧౯

విక్రమార్కమహారాజు వెండియు బేతాళుని బుజమునం బెట్టుకొని భిక్షుని కడకుఁ బోవుచుండఁగా బేతాళుఁడు మంచికథ చెప్పెదను విను మని రాజున కిట్లు చెప్పం దొడంగెను. వక్రోలక మని నగర మొకటి కలదు. దానిని ఇంద్ర సమానుఁడు సూర్యప్రభుఁడను రాజు ఏలుచుండెను ఎల్ల సంపదలుం గలిగిన యాతని కొకచింత మాత్రము తప్ప దాయెను. ఏమన, రాణివాసములు పలువు రుండియు ఆయనకు పుత్త్ర సంతతి లేదాయెను. ఇచ్చటివృత్తాంత మిటు లుండ, తామ్రలిప్తి యను గొప్పనగరమందు ధనపాలుఁ డనువర్తకుఁడు మహాధన వంతుఁ డుండెను. అతనికి ధనవతి యని యొకకొమరిత కలి

గెను. ఆకన్య శాపభ్రష్ట యైన విద్యాధరి యని తదీయ సౌందర్యము చేతనే తెలియుచుండెను కొమరితకు జవ్వనము వచ్చినంతనే తండ్రి కాలధర్మము నొందెను. అంతట ఱేనితోడ్పాటున దాయాదులు అతనిధనము నెల్లం గయికొనిరి అంతట దాయాదులకు వెఱచి ఆవర్తకునిభార్య హిరణ్యవతి తాను గుప్తముగా దాఁచి కొనియున్న రతనాలనగలు కైకొని కొమరితను ధనవతిం దోడ్కొని రాత్రి యిల్లు విడిచి రహస్యముగా పలాయన మాయెను

ఆమె వెలుపలి చీఁకటియు లోపలిశోకంబును ఆంధ్యంబు సేయ నెట్లో యూరి బయటికి కొమరితచేయి పట్టుకొని చని అచట కటికచీఁకటిలో నడచుచు దైవయోగంబున కానక దొంగ నొకని కొఱుత నున్నవానిని బుజముతోఁ దాఁకెను. వాఁడు అప్పటి కింక జీవముతో నుండి బుజముపోటుచే మఱి యింత నొప్పి పొంది 'అయ్యయ్యో! ఎవరు నా కిట్లు గాయమున నుప్పు ద్రుక్కినారు?' అని యంగలార్చెను ఆవణిగ్భార్య ఎవఁడవు నీ వని యడుగ వాఁడు తాను చోరుఁ డనియు, కొఱుత వేసి రనియు, పాపాత్ముఁ డయిన తనకు ప్రాణము లింకను పోలే దనియు, చెప్పి, ఆమెను 'అమ్మా నీ వెవ తెవు? ఎటకేఁగుచున్నావు? చెప్పు మ'ని యడిగెను. హిరణ్యవతియు తనవృత్తాంతముం జెప్పెను. ఆసమయమున తూర్పుమడఁతి మొగంబున బొట్టు వోలె చందమామ విరాజిల్లెను దిక్కులకెల్ల వికాసము కలి

గెను అంతట దొంగ ఆవణిక్కన్యను ధనవతిం గాంచి తల్లిని 'నా ప్రార్థన మొకటి వినుము. నీకు వేయివరహాలు ఇచ్చెదను, ఈకన్యను నాకు ధారవోయుము.' అని యడిగెను. నీ కిది యేల, యని తల్లి నవ్వుచు నడుగఁగా, నాకుఁ గొడుకు లేఁడు, కొడుకు లేనివానికి మృతునికి లోకములు లేవు. కావున ఈకన్య నాయాజ్ఞచే ఎవని కేని ఎవనిని కనునో వాఁడు నాకు క్షేత్రజపుత్త్రుఁడగును అందుకై యీకన్యను నేను గోరితిని, కాన నా కోర్కెం దీర్పుము.' అని యుత్తర మిచ్చెను. హిరణ్యావతి ధనలోభముచే నంగీకరించి ఆచెంత నెటనుండియో నీరు తెచ్చి, దొంగచేతిలో 'ఇదె నాకూఁతును నేను నీకు ఇచ్చితిని.' అని పలికి ధారపోసెను. చోరుఁడు ధనవతికి మున్ను తాఁ బల్కినట్లు ఆజ్ఞ యిచ్చి హిరణ్యావతితో ని ట్లనియె:—'పోయి ఆమఱ్ఱిక్రింద త్రవ్వి ఆబంగారముం గయికొమ్ము. నాప్రాణము పోయి నంతట నాదేహమును ఉపాయముచేత కాల్పించి వేసి ఎముకలను గొనిపోయి తీర్థములో వేసి, కొమరితతోఁ గూడ నీవు వక్రోలకనగరమునకుం బొమ్ము. ఆనగరమును సూర్యప్రభుఁడు ఏలుచున్నాఁడు. అతని మంచి యేలుబడిచే జను లెల్ల సుఖ మున్నారు. నీ వచ్చట ఉపద్రవ మేమియు లేక చింత యేమియు లేక సుఖముగా నుందువు.' ఇట్లు పలికి చోరుఁడు దప్పి మీఱి ఆమెచేతనే నీళ్లు తెప్పించుకొని త్రాగి శూలవ్యథచే ప్రాణము విడిచెను వణిగ్భార్య మఱ్ఱిక్రింద త్రవ్వి యాధనముం గైగొని

కూఁతుతోఁ గూడ గుప్తముగా తన మగని చెలికాని యింటికి పోయెను. అటనుండి యుక్తిగా చోరుసికళేబరమును కాల్పించి వాని యెముకలను తీర్థములో వేయించెను.

మఱునాఁడు హిరణ్యవతి కూఁతుతోఁగూడ తనధనమును రహస్యముగా పదిలముగాఁ గైకొని తరలి క్రమముగా ఆవక్రోలకమునకుం బోయి చేరెను. అటవసుదత్తుఁ డను నొక వర్తకునియొద్ద ఇల్లొకటి క్రయమునకుఁ బుచ్చుకొని అందు కొమరితతోఁ గూడ వసించుండెను. ఆనగరమందు విష్ణుస్వామి యను నొక యుపాధ్యాయునికి మనఃస్వామి యని శిష్యుఁడొకఁడు బ్రాహ్మణకుమారుఁడు అతిరూపవంతుఁ డుండెను ఆతఁడు విద్యాభిజాత్యములు కలవాఁ డయ్యును యౌవనవశంబునం బడి అచట హంసావళి యను నొక విలయాలిం గామించెను. అది రాత్రికి ఏనూఱు బంగారు దీనారములు బాడిగ పుచ్చుకొనునది. ధనము లేక మనఃస్వామి సదా వగలం బొగులుచుండెను ఒకనాఁడు ధనవతి అట్టి యాసొబగుని కృశమనోహరదేహుని మేడనుండి కనినంతన తనచిత్తము అతని నంటుకొఁగా, తనమగఁ డయిన దొంగ యిచ్చిన యాజ్ఞను స్మరించి, యుక్తిగా తల్లితో 'అమ్మా, ఈవిప్రకుమారుని రూపయౌవనములు ఎట్టివో కనుము. ఆహా ! లోకలోచనామృతవర్షముగా నున్నవి!' అని హెచ్చరించెను. ఆతనియందు కూఁతురు ఉనురాగము కొన్నదని గ్రహించి తల్లి మనస్సులో నిట్లు తలంచెను.

'మగనియాజ్ఞ ప్రకారము నాకూఁతురు ఎవనినో ఒకనిని పుత్త్రార్థమై వరింపవలసియే యున్నది. కావున ఇతనినే ఏల కోరఁగూడదు?' ఇట్లు ఆలోచించుకొని హిరణ్యావతి ఆకోరికం దెలిపి ఆబ్రాహ్మణ కుమారునిం బిలుచుకొని రమ్మని గుట్టు కాచు నొక చేటికను పంపెను. అది పోయి మనఃస్వామిని ఏకాంతమునకుం బిలిచి సందేశము తెలిపెను వ్యసనాసక్తుఁ డతఁడు హంసావళికై తనకు ఏనూఱు దీనారము లిచ్చునెడల తాను ఒక రాత్రి వచ్చెద నని చెప్పెను. చేటి పోయి ఆమాట తెలుపఁగా హిరణ్యావతి ఆధనము నతనికి దానిచేతనే పంపెను. దానిం బుచ్చుకొని మనఃస్వామి ఆచేటితో ధనవతియింటికిం జని రాత్రి యచ్చటనుండి సంభోగలీలం దేలి, వేకువను రహస్యముగా వెడలిపోయెను ఆతనివలన ధనవతి గర్భిణియై కాలక్రమమున మహైశ్వర్య లక్షణసంపన్నుని తనయునిం గనెను. తనయుఁడు గలిగినందులకు తుష్టి నొంది యున్న ధనవతికి ఆమెతల్లికిని ముక్కంటి కలలో ప్రత్యక్షమై ఆశిశువును వేయివరహాలతోఁ గూడ నొకమంచముమీఁదఁ బెట్టి వేకువను సూర్యప్రభమహారాజు సింహద్వారమునఁ బెట్టవలసిన దనియు అట్లు చేసిన మేలగు ననియు నాన తిచ్చెను ఇరువురును మేలుకొని కలలు ఒండొరులకుఁ జెప్పుకొని యాశిశువును అట్లే మంచముమీఁద వరహాలతోఁగూడ నుంచి భగవద్వాక్యము ప్రకారము ఆరాజు సింహద్వారమున వదలి వేసిరి

మహేశ్వరుఁడు పుత్త్రచింతాతురునికి ఆరాజునకును కలలో నగపడి 'లేవోయి రాజా, నీసింహద్వారమున బంగారముతోఁ గూడ బాలుఁ డున్నాఁడు, ఎవరో మంచముతోఁ గూడఁ దెచ్చి పెట్టి పోయినారు, పోయి ఆశుభలక్షణునింగైకొమ్ము.' అని యాజ్ఞాపించెను. వేకువజామున శంభుఁ డట్లు పలుకఁగా రాజు మేల్కాని యుండ ద్వారపాలకులు వచ్చి శిశుప్రాప్తిని విన్నవించిరి. అంతట రాజు స్వయముగాఁ బోయి సింహద్వారమున మంచమున బాలుని బంగారమును గని, బాలుని కల్యాణాకారమును, కాలుసేతుల ఛత్త్రధ్వజాది రేఖలను, గాంచి, తనకు తగినపుత్త్రునే శంభుఁ డిచ్చినాఁ డని తలంచి తానే చేతుల నెత్తుకొని అఱకడం బెట్టుకొని యంతఃపురమునకుం గొని పోయెను అనంతరము సూర్యప్రభుఁడు లెక్కలేని యర్థము లొసఁగుచు దరిద్రశబ్దమునకు మాత్ర మర్థము లేని యట్లుగా మహోత్సవము చేసెను. పండ్రెండు దినములు నృత్తవాద్యాది వినోదంబులం గడపి పండ్రెండవనాఁడు కుమారునికి చంద్రప్రభుఁ డని నామ మిడెను. కుమారుఁడు క్రమముగా దేహముచేత మాత్రమే గాక గుణములచేతనుం గూడ ఆశ్రితులకు ఆనంద మొసఁగుచు ఎదుగుచుండెను క్రమముగా యౌవనవంతుఁడై శౌర్యౌదార్య విద్యాదికములచేత ప్రజారంజకుఁడై భూభారము మోచుటకు సమర్థుఁ డాయెను. సూర్యప్రభుఁడు అతనికి రాజ్యాభిషేకము చేసి తాను వృద్ధుఁడు కాశికిఁ

బోయెను. నీతిమంతుఁడు పుత్త్రుఁడు రాజ్య మేలు చుండఁగా, సూర్యప్రభుఁడు తీవ్రతపం బాచరించి కాశిలో కాలధర్మము నొందెను.

ధర్మాత్ముఁడు చంద్రప్రభుఁడు ఆతండ్రిమరణము తెలియఁగా కరము శోకించి క్రియలు గావించి మంత్రులతో 'నాయన ఋణమును నేను ఏవిధమున తీర్చుకోఁగలను ? అయినను నా చేతితో నాయనకు ఒక ప్రత్యుపకారము చేసెదను. యథావిధిగా ఎముకలు గొనిపోయి గంగలో వైచెదను. గయకుంబోయి పితరు లెల్లరకుం బిండ మిచ్చెద. ఆనుషంగికముగా తీర్థయాత్ర కూడ తూర్పుసముద్రమువఱకుం జేసెదను ' అని వక్కాణించెను మంత్రు లిట్లనిరి:— 'మహారాజ, రాజెప్పుడును ఇట్లు సేయఁ దగదు. రాజు లేనియెడల రాజ్యము క్షణము నిలువదు. కావున నీతండ్రి కార్యము నెల్ల పరులచే చేయింపవలసినదే గాని నీవు స్వయముగా చేయఁగూడదు, నిజధర్మపరిపాలనకన్న నీకు తీర్థయాత్ర యేమి దొడ్డ ! అపాయమయమగు బాటసారితన మెక్కడ, ఎప్పుడును కాపుదలతోఁ గూడుకొని యుండురాజు లెక్కడ?' అందులకు రాజుపలికెను;— 'ఈవికల్పములు మానుఁడు, నాయనకై నేను శోకమాన్పను. వృద్ధవయస్సులో నే తీర్థయాత్రలు నేను సేవింపవలయును. పిమ్మట నేమి సంభవించునో ఎవరి కెఱుక ? శరీరము క్షణభంగురము గదా. నేను మరల వచ్చువఱకు నారాజ్యమును

మీా రే కాపాడు చుండ వలసినది.' తేని దృఢ నిశ్చయముం గని మంత్రు లూరకుండిరి.

అంతట రాజు రాజ్యమును మంత్రులవశము చేసి పయనమునకు సరంజాము జేయించి, మంచిదినంబున స్నానము చేసి, వేల్చి, బ్రాహ్మణులం బూజించి, సరి రైన గుఱ్ఱములం బూంచిన యరదము నెక్కి, భక్తితో శాంతవేషముం దాల్చి, తరలెను. ఎల్లవఱకు సాగ నంప వచ్చిన సామంత రాజపుత్త్ర పౌర జానపదులను వెనుకకుం బో నిచ్చ లేనివారిని ఎప్పాటనో మరల్చెను బ్రాహ్మణులు వాహనము లెక్కి వెంట రాఁగా, పురోహిత సమేతుఁ డై పయనము సాగించెను. వింతవింత వేషభాషాదులం జూచుచు వినోదపడుచు నానావిధదేశములం గాంచుచు క్రమముగా గంగానదిం దఱిసెను. ప్రాణికోటికి స్వర్గమున కెక్కుటకు మెట్లవరుస యో యన నలల పరంపరం జేయుచున్న యామిన్నేటిం గన్నులారం గాంచి, యరదము దిగి అందు విధ్యుక్తప్రకారంబున స్నానము చేసి చంద్రప్రభ మహారాజు సూర్యప్రభునియస్థులను గంగలో వయిచి, యచట దానంబు లిచ్చి, శ్రాద్ధము చేసి, మరల నరద మెక్కి యటనుండి తరలి క్రమముగా ఋషిసంస్తుత మయిన ప్రయాగకుం జనియెను. గంగాయమునలు కలసి విరాజిల్లు చున్న యా ప్రయాగ నగరమందు తీర్థోపవాసము చేసి, స్నాన దాన శ్రాద్ధాది సత్క్రియా కలాప మెల్ల నిర్వర్తించి, మరల తేరెక్కి కాశికిపోయెను.

దేవాలయంబుల టెక్కెయంపు వలువలు గాలికి సాఁగుచుం బయికి లేచుచు వ్రాలుచు నుండుటచే దూరమునుండి యాత్రికులను 'రండు, మోక్షము పొందుఁడు' అని పిలుచుచున్నదియుం బోలె నొప్పుచున్న యాశివపురియందు మూఁడు దినములు ఉపవసించి ఎద్దు నెక్కి వెల్పును తనకు తగిన భోగములతోఁ గొలిచి యచ్చటనుండి గయకుం దరలెను. దారిలో ఫల భారావనమ్రము లైె వృక్షములు కనులకు విందుసేయ, వానియందలి పక్షులకూఁతలు వీనులకు పండువుంగావింప, కానతెమ్మెరలు అడవిపువ్వుల నెత్తావులతో తన్ను సేవించుచుండ, చంద్రప్రభుఁడు నానారణ్యములను దాఁటి క్రమముగా పుణ్యక్షేత్ర సత్తమమునకుం గయాశిరమునకుం జనియెను. అచ్చట విశేష దక్షిణలతో యథావిధిగా శ్రాద్ధంబు చేసి ధర్మారణ్యమునకుం జని గయాకూపమందు పిండంబు వేయఁబోఁగా, అందునుండి ఆపిండంబుం గొన మూఁడు మానిసిచేతులు లేచినవి. అంతట రాజు వింతపడి ఏమి సేయనుం దోఁపక తన బ్రాహ్మణులను ఏచేత పిండము వేయవలయునో చెప్పుఁడని యడిగెను. వా రిట్లు బదులు చెప్పిరి. 'దేవా, ఇది నిశ్చయముగా చోరునిచేయి; ఏలన, ఇదు ఇదే ఇనుపమేకు కనఁబడుచున్నది. ఈ రెండవ చేయి బ్రాహ్మణునిది పవిత్రము దాల్చి యున్నది. మూఁడవది రాజుది ఉంగరముం దాల్చి సులక్షణ మై యున్నది. ఇంతియ తెలియుచున్నది గాని, పిండము నిం దెందు వేయ నగునో ఈవింత

యేమో తెలియ రా కున్నది.' రాజు నిశ్చయ మొంద నేరం డాయెను.

బుజమునుండి బేతాళుఁడు ఈవింతకథ నుడివి ఎప్పటివలె పథము జ్ఞప్తి చేసి విక్రమార్కుని 'ఆపిండమును ఏకరమున వేయ వలయునో నీవు చెప్పుము.' అని యడిగెను. ధర్మజ్ఞుఁడు విక్రమార్కుఁ డిట్లనియె:—'చోరుని చేత ఆపిండమును వేయ వలసి నది. ఏలన చంద్రప్రభుఁడు వాని క్షేత్రజపుత్త్రుఁడు. ఒరు లిరువురలో ఎవ్వనికిని పుత్త్రుఁడు గాఁడు. తన్నుఁ గన్న బ్రాహ్మ ణునికి పుత్త్రుఁడు గాఁడు, ఏ లన నాతఁడు ఒకరాత్రికి తన్ను అమ్ముకొన్నాఁడు. సూర్యప్రభునికి చంద్రప్రభుఁడు కుమారుఁడు గాఁడు, ఎట్లన, సూర్యప్రభునికి ఇతనిం బెంచుటకు ఇతనికి సంస్కారములు సేయుటకును మంచముపై నితని తలక్రింద నుంపఁబడిన యితని ధనమే యుండినది. అదియే వానికి మూ ల్యము. కావున ఇతనితల్లిని ధనవతిని తన్మాత హిరణ్యవతి ఎవనికి ధారాపూర్వకముగా నొసంగినదో, ఎవఁడు ఆధనవతికి ఇతని పుట్టువునకై యాజ్ఞ యిచ్చినాఁడో, ఆధన మెల్ల ఎవని దో, ఆ దొంగకే యీచంద్రప్రభుఁడు క్షేత్రజపుత్త్రుఁడు, వాని చేతిలోనే ఇతఁడు పిండము పెట్టవలసినది, అని నాయభి ప్రాయము.' ఇట్లు విక్రమార్కుఁడు మౌనము మాని పల్కిన యంతట బేతాళుఁడు అదృశ్యుఁడై నిజధామమునకు పోయెను రాజు మరల నాతనిం గొనిరా నరిగెను.

## కథ—౨౦.



బేతాళుని మరల శింశుపా వృక్షమునుండి బుజంబునం గొని విక్రమార్కుఁడు నడచుచుండఁగా బేతాళుఁడు ఇట్లనియెః- రాజా, నీకేల యీపట్టుదల ? ఇంటికి పోయి రాత్రి సుఖము లనుభవింపుము. ఈపాడు బిక్షుని కడకు నీవు నన్నుఁ గొని పోవుట యుక్తము గాదు. నీవూనిక వదలవేని, కానిమ్ము, ఈకథను వినుము. చిత్రకూటమని నగరరాజ మొకటి కలదు' అందు మిత్త్రుల నేత్రములకు అమృతపు జడిం గురియువాఁడు చంద్రావలోకుఁ డని రాజావతంసుఁ డొకఁ డుండెను. పరాక్రమ త్యాగ సౌందర్యములకు పుట్టినిల్లని యాతనిని పెద్దలు నుతింతురు. ఆతనికి సర్వసంపదలును సమృద్ధమై యున్నను, తగిన భార్యలేని నెవ్వగ యొకటిపాయ కుండెను. ఒకనాఁడు ఆవగను మఱచుటకై యాతఁడు అడవికి వేఁటకుఁ బోయెను. అట, చీఁకటిరాసులఁ జీల్చుచు, సింగంబుల నంపసెజ్జల నొఱగించుచు, శరభంబుల తెక్కలెడలించి కూల్చుచు, వేఁటతమి మించి ఒంటిగ్గాెఁ లోకానం జొరం గోరి గుఱ్ఱమును మడమ పోటున హెచ్చరించెను. దానను తఱటుతాఁకునను గుఱ్ఱము రేఁగి, గాలివడిని మీఱి, మెఱకయుం బల్లంబుం గానక యొక క్షణంబున పదియామడల దూరము తేని యింద్రియంబులు పొలపుగొన నతిక్రమించి యొకానొక వనాంతరమున

నిలిచెను అంతట రాజు దిగ్భ్రమగొని త్రిమ్మరి చెంగట నొక గొప్ప సరోవరముం గాంచెను. గాలిచే నెదురుమోమై వంగుచు లేచుచు నున్న నెత్తామరలతో నాసరస్సు రాజును ఇటు రమ్మని సైగసన్న సేయు చున్నట్లుండెను. రాజు దానిదరికి అరిగి గుఱ్ఱమును జీను విప్పి తోమి నీరార్చి చెట్టునీడం గట్టి గడ్డివేసి, తానును నీరాడి జలంబు గ్రోలి సేద దేరి, కనువిందైన యచటితావులం బరికించుచుండెను. అచట ఒకచోట అశోకవృక్ష మూలమున మునికన్నె యొకతె పువ్వునగలను ధరించి నారచీరం గట్టి ముద్దు లొలుకు జడముడి దాల్చి ఒక సకితోం గూడ నుండంగాం గాంచి చంద్రావలోకుఁడు పంచబాణుని బాణంబులపాలం బడి 'ఎవ్వతె ఈసుందరి? ఈసరోవరంబున జలకమాడ వచ్చినసావిత్రియో, కాదేని, రతీదేవియో? చెంతకుం జని వరమొందెదంగాక.' అని తలంపుగొని ఆకన్నియయున్న తావునకు నరుగుదెంచెను.

ఆకుమారియు వచ్చుచున్నట్టి యాతనిం గాంచి తదీయ రూపలక్ష్మికి కన్నుదోయి మత్తిల్ల, నుల్లంబు కల్లగా, తా నప్పటికి గ్రుచ్చుచుండిన పూవండనుండి తెలియక చేయి జాఱఁగా 'ఎవ రితఁ డీకాననంబున? సిద్ధుఁడో విద్యాధరుఁడో, ఈతనిరూపుం గాంచినకన్నులు గదా కృతార్థములు!" అని వితర్కించుచు నతనిం గ్రేగంటిచూడ్కులంజూచి సిగ్గుచే లేచి అవలికి నురుఁగం జొచ్చెను. రాజు చెంత కేఁగి యామెతో నే నాగరికముగా నిట్టు

లనియె:—'ఓ సుందరీ, దూరమునుండి వచ్చినయతిథికి కుశల ప్రశ్నాది సత్కారము లేక పోయినం బోవుఁగాక ఆశ్రమవాసుల కీతీరున లేచి పలాయన మగుటయు నొకధర్మమా?' రా జిట్లు పలుకఁగా గ్రహించి, సఖి రాజుం గూర్చుండఁ బెట్టి, యతిథిసత్కారము చేసెను. అంతటఁ గోరిక లూరి చంద్రావలోకుఁడు చనవు మెఱయ సకిని 'కల్యాణీ, ఈ నీచెలి ఏవంశముది? పే రేమి? ఏల నీ చెలి ఏకాంతమందు ఇట్లు తపస్సు సేయుచున్నది?' అని యడిగెను. చేటి యిట్లు బదులు వచించెను. 'మహాభాగ, ఈమె కణ్వమహాముని పెంపుడుకూఁతురు, మేనకకూఁతురు, కన్నియ, పేరు ఇందీవరప్రభ. తండ్రిసెలవున ఈసరస్సులో జలక మాడ వచ్చినది ఈమెజనకుని యాశ్రమము ఇటకు చేరువ ననే ఇదిగో కలదు' ఆ మాటకు రాజు సంతోషించి గుఱ్ఱ మెక్కి ఆశ్రమమునకు కణ్వమునిం గన నేఁగెను.

అచ్చట వినీతవేషముం దాల్చి గుఱ్ఱమును వెలుపలనే నిలిపి అయ్యాశ్రమమును చొచ్చి అందు చుక్కల నడుమ చంద్రుండు వోలె ఋషులనడుమ తనతేజముచే నాహ్లాద మొసంగుచున్న కణ్వ మహామునిం గాంచి చెంత కరిగి యడుగుల కెరఁగెను. ఆజ్ఞాని రాజున కాతిథ్యము సల్పి విశ్రమింపఁజేసి వెంటనే ఇట్లనియె:—'వత్సా, చంద్రావలోకుఁడా, నేను చెప్పెడి హితమును వినుము. సంసారములో ప్రాణులకు మృత్యుభయ మన నెట్టిదో యెఱుఁగుదువు గదా. ఏల నిష్కారణముగా! ఈ మృ

క్కడి జంతువులను చంపెదవు? బ్రహ్మదేవుఁడు భీతులను గావ క్షత్రియులకు ఆయుధమును నిర్మించినాఁడు, కావున ధర్మము ప్రకారము ప్రజలను కావుము, క్షుద్రశత్రులను నిర్మూలింపుము హస్త్యశ్వాస్త్రాద్యభ్యాసంబుల చలలక్ష్యాదికములను సాధింపుము, రాజ్యసుఖము ననుభవింపుము, ధన మిమ్ము, దిక్కులలో కీర్తిని నెరపుము. వేఁటవెఱ్ఱి మానుము. ఇందు చంపువానికిని చచ్చుదానికి, ఇళ్లే మూఁడవవానికిని పొరఁబాటు సమము. పెక్కులు అపాయములుగల యీవ్యసన మేల! పాండురాజు గతి నీవు వినలేదా ?' ఇవ్విధమున కణ్వమహాముని చెప్పఁగా చంద్రావలోకుఁడు సంతోషించి కార్యజ్ఞుఁ డై యి ట్లనియె:— 'స్వామీ, మీబోధనం గైకొంటిని, నామీఁద నింతకన్న నను గ్రహ మన నింకెట్టిది? ఇదె నేను వేటను మానుకొంటిని. ప్రాణుల కిఁక భయము వలదు ?' ముని సంతసించి 'వత్సా, నీవు ప్రాణులకు అభయ మిచ్చినందులకు సంతసించితిని, నీ కోరిన వర మిచ్చెద నడుగుము.' అనెను. కాలజ్ఞుఁడు రాజు 'అట్లయినయెడల నోస్వామీ, నాకు ఇందీవర ప్రభ నిమ్ము.' అని యడిగెను. ముని యంగీకరించి అపుడే స్నానమయి వచ్చిన యిందీవర ప్రభను తగినవరుని కాతని కిచ్చెను. మునిభార్యలు ఇందీవరప్రభను పెండ్లికొమరితం జేసిరి. రాజు ఆమెను యథావిధి పెండిలి యాయెను.

ఆశ్రమాంతమువఱకును సాగనంప వచ్చినతాపసులను వీడ్కొని రాజు ఇందీవరప్రభం దోడ్కొని గుఱ్ఱ మెక్కి వేగం బునం జనుచుండెను. అంతలో ప్రొద్దు గ్రుంకెను. తర్వాత రాజు దారిలో నొక రావి చెట్టును, స్వచ్ఛోదకమైన డిగ్గియను పచ్చనిపచ్చికమైదానమును పొడగాంచి, యట గుఱ్ఱము దిగి, దానికి గడ్డి వేసి నీళ్లు పెట్టి, తాను మునికన్నెతోఁ గూడ నీరు ద్రాగి చల్లగాలిని సేవించుచు, డిగ్గియలోని యిసుకతిన్నెమీఁద సేద దేరి ఆచెట్టుక్రింద పూఁబొన్పునం బవళించెను. ఆక్షణమే చంద్రోదయ మాయెను. రాజు ఇందివరప్రభం గవుంగిటం బొదివి వింతవింతగా క్రొత్తపొందుం బొందెను. తెల్లవాఱఁగా నే రాజు సెజ్జ వీడ్కొని సాంధ్యవిధిం దీర్చి నవవధూసఖుఁడై తన సేనను కలయం బోవఁ గడంగెను.

అంత నచటి కాకస్మికంబుగ మెఱపులవలె పసుపునిగ్గులు దేరు జడలును కాటుకనలుపుదేహంబు నొప్ప, కార్మొగిలువోలె బొమ్మరాకాసిమన్నీఁ డొక్కఁడు ప్రేగులసిగదండయు తల వెం డ్రుకలజన్నిదంబును దాల్చి, మానిసిమెదడు మెసవుచు, పుర్క కప్పెరతో నెత్తురు ద్రావుచు వచ్చి, భయంకరపు బొబ్బ నవ్వునవ్వి, క్రోధంబుమీఱ నోటివెంట నిప్పులుగ్రక్కుచు, పట పట కోఱలు దీటుకొనుచు, రాజు నిట్లని బెదరించెను:— 'ఓరీ, పాప, బ్రహ్మరాక్షసుని జ్వాలాముఖనామధేయుని నన్నెఱుంగ వా? నా నివాస మగు నీ రావిమ్రానిని దేవతలేనియు లంఘింప

నోఁడుదురు. అట్టిదానిని నీవు ఆక్రమించి ముగుఁతతోఁగూడ ననుభవించితివి, రాత్రిచర్య నడపితివి. కావున ఈపాగసునకు ఫల మనుభవింపుము. ఇదె నేను నీగుండియం బెకలించి భక్షించెద. నీ నెత్తురుం ద్రావెద. అంతట భార్య గడగడ వణంకుచుండ, ఆబెదరింపును విని, ఆ బ్రహ్మరాక్షసిని చంప నలవి కాదని కని, భయంబు గొని, రాజు అణఁకువ మీఱ నిట్లు మనవి చేసికొనెను—'తెలియక నేఁ జేసిన యీ నేరమిని మన్నింపుము. నేను నీయాశ్రమమునకు వచ్చినయతిథిని శరణాగతుఁడను గదా. నీవు ఎట్టిపురుషుని కోరుదువో అట్టివానిని తెచ్చి నీ కర్పించెద, వానిచే నీకు తృప్తియగుఁగాక, కరుణింపుము, కోపము మానుము.' ఇట్లు రాజు వేఁడుకొనఁగా బ్రహ్మరాక్షసుఁడు శాంతుఁడై 'అట్లె కానిమ్ము, దోష మేమి?' అని పలికి ఆలోచించుకొని యిట్లనియెను:—'ఏడేండ్లపాటివాఁడు బ్రాహ్మణకుమారుఁడు మహాసత్త్వుఁడు, నీకై తన్ను తానే స్వేచ్ఛగా నర్పించుకొనవలయును ; వానిం జంపునప్పుడు నేలం బెట్టి, చేతులు తల్లియు, కాళ్లు తండ్రియు, దృఢముగాఁ బట్టుకొనవలయును. అట్టిపురుషుని నీవు స్వయముగా కత్తితో నఱికి నాకు ఏడు దినములలోపల నుపహార మొసంగెదవేని నీ యీ నేరమిని క్షమించెదను. తప్పెదవేని నిన్నును నీ బలగంబును నాశము చేసెదను.' ఈమాట విని రాజు భయాంతిరేకంబున అట్ల యని యొప్పుకొనెను. బ్రహ్మరాక్షసుఁడును అగృ

శ్యుఁ డాయెను. అంతట చంద్రావలోకుఁడు ఇందీవరప్రభతోఁ గూడ గుఱ్ఱ మెక్కి సేనను వెదకికొనుచుం బోవుచు కరము తల్లటంబున నిట్లు పరితపింపసాగెను:—'అయ్యో, నేను వేఁట చేతను మదనుని చేతను మోసపోయి మూఢుఁడ నై పాండు రాజువలె, ఆకస్మికముగా, వినాశ మొందితిని ఈ రాక్షసునికి ఆవిధ మైన యుపహార మెట్లు దొరకును? ఏమి చేయుదును? నానగరమునకుం బోయెదఁగాక, తర్వాత ఏ మగునో చూచెద.' ఇట్లు కుందుచు రాజు తన్ను వెదకుకొని వచ్చుచున్న తనసేనం గలసి సభార్యుఁ డై చిత్రకూటనగరమునకుం బోయెను. అతనికిఁ దగిన కాంత దొరకినందులకు రాష్ట్రమెల్ల మహోత్సవమున మునిఁగి యుండ, అతఁడు మాత్రము దిగులులో మునింగి యుండెను.

మఱునాఁడు చంద్రావలోకుఁడు ఆ వృత్తాంతమును మంత్రులకు శ్రుతపఱిచెను. వారిలో నొకమంత్రి సుమతినామ ధేయుఁ డిట్లులనియె:—'దేవా, చింతింపవలదు, అట్టి యుప హారమును నేను సాధించి తెచ్చెదను. ఈ లోకములోని యాశ్చర్యములకు లెక్క లేదుగదా.' ఇట్లు రాజు నోదార్చి యామంత్రి ఏడేండ్లపాటి ప్రాయపు బాలుని బొమ్మను బంగారముతోఁ జేయించి రత్నములతో నలంకరించి పల్లకిలో నుంచి ఊరు వళ్లెలవెంట ఈచాటింపుతోఁగూడ త్రిప్పించెను:—'ఏడేండ్లపాటి బ్రాహ్మణకుమారుఁడు సత్త్వస్థుఁడు ఎవ్వఁడేని సర్వప్రాణిరక్షా

ర్థము తల్లిదండ్రుల యనుమతితో తన్ను బ్రహ్మ రాక్షసునికి ఆహారముగా ఇచ్చుకొనువాఁడు కలఁడేని, వానిని చంపునప్పుడు తల్లిదండ్రులు కాలుసేతులు కదలనీక పట్టుకొందురేనియు, అత నికి నూఱుగ్రామములతో హేమరత్నమయం బగు నీప్రతిమను తల్లిదండ్రుల నుపకరించుటకై రాజు ఇచ్చును.' ఈఘోష ణతో ఆబొమ్మను త్రిప్పఁగా త్రిప్పఁగా ఒకయగ్రహారములో బ్రాహ్మణశిశు వొకఁడు ఏడేండ్లపాటివాఁడే అయినను మహాధీ రుఁడు అద్భుతాకారుఁడు శిశువే అయ్యును జన్మాంతరాభ్యాసపా టవంబున సదా పరులకు మేలు సేయుటయే పనిగా యైనవాఁడు, తనువు దాల్చిన ప్రజాపుణ్యపరిపాకమో యన నొప్పువాఁడు, చాటించుచున్నవారితో ' అబ్బ, మీకై నేను నన్ను ఇచ్చుకొని యెదను, ఇంటికిం బోయి తల్లిదండ్రులను ఒప్పించి వచ్చెదను ' అని పలికెను వారు సంతోషించిరి. అంత నా బాలుఁడు ఇంటికి పోయి తల్లిదండ్రులఁ గూర్చి కేల్మోడ్చి యి ట్లనియె:—

'అమ్మా, నాయనా, ఈయస్థిరదేహమును సర్వసత్త్వరక్షా ర్థము ఇచ్చెదను; నాకు సెల వొసంగుఁడు, హేమరత్న మయ మయిన ప్రతిమను దానితోడ యీ నూఱుగ్రామంబులనుం గైకొని మీ కిచ్చెదను. ఈవిధమున నాకు మీఋణంబును తీఱును; పరార్థంబును సిద్ధించును. మీకును దారిద్ర్యము తీఱును; పలువురు తనయులు గలుగుదురు.' ఆకస్మికముగా కుమారుఁడు ఇట్లు వచింపఁగా తల్లి దండ్రులు దిగులుపడి

యి ట్లనిరి:—'గ్రహ మేమేని కొట్టినదా? కాదేని యిట్లేల
ప్రేలెదవు? ధనముకై పుత్త్రుని ఎవఁడు చంపించును? శిశు
వెవఁడు దేహము నిచ్చును?' బాలుఁ డిట్లు ఉత్తరము చెప్పెను.
'బుద్ధి మోహముచే చెప్పిన మాట గాదు. నా మాట కర్థ
మున్నది వినుఁడు. ఈదేహము చెప్పఁ గొఱగానిది, అశుచిసం
పూర్ణము; పుట్టుకలోనే రోఁత గొల్పునది. దుఃఖముల పాలము,
నాశ మొందునది. ఇట్టి యీ నిస్సారదేహముచేత ఏపుణ్యము
గడింపఁబడునో అది యొక్కటియె సంసారములో సార మని
పెద్దలు చెప్పుదురు. సర్వభూతోపకారముకంటె వేఱు పుణ్య
మే మున్నది ? అందును పితృభక్తియేని ఇంతకన్న దేహము
వలనం బొందఁ దగిన ఫల మే మున్నది?' ఇట్టి మాటలచేత
ఆశిశువు తనపట్టు వదలనివాఁడై ఏడ్చుచున్న తల్లిదండ్రులను
తనయుద్యమము నంగీకరించునట్లు చేసి, పోయి, రాజపురుషుల
వలన ఆప్రతిమను నూఱుగ్రామముల శాసనంబునుం బుచ్చు
కొని, తల్లిదండ్రుల కిచ్చెను.

అనంతరము ఆరాజభృత్యులనే ముం దుంచుకొని తల్లి
దండ్రులం దోడ్కొని యాశిశువు చిత్రకూటనగరమున రాజ
సన్నిధికిం బోయెను. అఖండితతేజస్కుని రత్నామణివోలె
వచ్చిన యా బాలునిం గని రాజు సంతోషించి పూదండతోను
మైపూఁతతోనుం గయి సేసి తల్లిదండ్రులతోఁ గూడ ఏనుఁగు
మీఁద బ్రహ్మరాక్షసుని తావలంబునకుం గొనిపోయెను. అచట

నారావిచెట్టుప్రక్కను పురోహితుఁడు మండలము రచించి తగినట్లు పూజ గావించి వేలిమి యొనర్చినంత, బొబ్బనవ్వు నవ్వుచు వేదము పఠించుచు బ్రహ్మరాక్షసుఁడు జ్వాలాముఖుఁడు నల్లకల్లు ద్రావినమత్తుచే సోలుచు మాటిమాటికి నావులించుచు కన్నుల నిప్పు లురల, మేనిచాయచే దిక్కులం జీఁకటి సేయుచు, మహాఘోరదర్శనుఁడై తోతెంచెను. చంద్రావలోకుఁ డతనిం గని వినయవినమితగాత్రుఁడై యిట్లు విన్నవించెను:—'స్వామీ, నీకు నరోపహారముం దెచ్చితిని, ఇదే యేడవదినము, ప్రసన్నుఁడ వై నాతెచ్చిన యీ బలిని యథావిధిగా గ్రహింపుము.' ఇటు రాజు నివేదింపగా బ్రహ్మరాక్షసుఁడు సెలవులు నాకుచు ఆబ్రాహ్మణకుమారునిఁ గనుంగొనియెను. అంతట మహాసత్త్వుఁ డక్కుమారుఁడు సంతోషపడి ఇట్లు తలపోసెను. 'ఇప్పుడు దేహ మిచ్చి నేను ఏపుణ్య మార్జింతునో దీన పరోపకృతిశూన్యము లయి స్వర్గమోక్షములు నేఁ గోరను, దీన నాకు మరల జన్మజన్మమందును దేహము పరార్థమే ఘటించుచుండుఁగాక.' ఇట్లాకుమారుఁడు సంకల్పించుచుండఁగా చదలెల్ల సురవిమానములు నిండినవి. వేల్పులు పువువాన గురియ సన్నద్ధులై యుండిరి అంతట బాలుని బ్రహ్మరాక్షసుమ్రోల నిడిరి. తల్లి చేతులు, తండ్రి కాళ్లును, కదలనీక గట్టిగా పట్టుకొనిరి. రాజు కత్తి దూసి నఱుకఁబోవుచున్న సమయంబున ఆకుమారుఁడు పకపక నవ్వెను. ఆనవ్విన నవ్వు

నకు అచటివా రెల్ల బ్రహ్మరాక్షసునితోఁగూడ తమతమ పనులు మాని ఆశ్చర్యంబున చేతులు మోడ్చి వినయంబున నతని మోముం జూడసాగిరి.

ఇట్లు ఈ యద్భుతసరసకథను చెప్పి బేతాళుఁడు విక్రమార్కుని ఎప్పటి తనశాపముం దలఁపించి 'రాజా, అట్టి యా ప్రాణాంతసమయమందుం గూడ ఆ బాలుఁ డేల యట్లు నవ్వెనో చెప్పుము.' అని ప్రశ్న వేసెను. 'ఆశిశువు నవ్విన యభిప్రాయము చెప్పెదను వినుము. లోకములో దుర్బలుఁ డయిన వాఁడు ప్రాణభయము కలిగినప్పుడు రక్షణార్థమై తల్లిదండ్రులను చీఱి యేడ్చును, వారు లేరేని ఆర్తత్రాణార్థమై బ్రహ్మసృజించిన రాజునుగూర్చి మొఱ యిడును. రాజు లేఁడేని ఆసమయమున సంభవించిన దైవతమును వేఁడుకొనును. అతనికి ఒక్కుమ్మడి నిది యెల్ల విపరీత మయినది. ఎట్లన్న, తల్లిదండ్రులే గదా ధనకాంక్షచే నతని కాలుసేతులు బిగఁబట్టినారు, రాజు తన్నుఁ గాచికొన స్వయముగా నతనిం జావ నున్నాఁడు, అచట నపుడు సంభవించి యున్న దైవతము బ్రహ్మరక్షస్సు, అది అతనిని భక్షింప వచ్చి యున్నది. అస్థిర మై చివర విరసమై ఆధివ్యాధులచే పీడిత మైన దేహముకై మూఢులు మోసపోవు విధ మిద్దియ, బ్రహ్మేంద్ర విష్ణురుద్రాదులు సయితము అస్థిరు లయి యుండఁగా వీరికి మాత్రము తమదేహము స్థిర మని ఇట్టివాసన కలిగియున్నది. ఈ యజ్ఞానవిలాసముం దలపోసియు తనకోరిక

నెఱవేఱినది గదా యని యెంచియు హర్షాశ్చర్యములచే ఆ బ్రాహ్మణబాలుఁడు నవ్వెను.' అని విక్రమార్క మహారాజు ఉత్తర మొసంగెను అంతట బేతాళుఁడు మాయచే నదృశ్యుఁడై తన తావునకుం బోయెను. రాజు మరల నతనిం దేర వెంటనే పోయెను మహాత్ముల హృదయము అంభోనిధుల హృదయము వలె కలంగుడు పడదు గదా.

---

## కథ—౨౧

వెండియు విక్రమార్కుఁడు బేతాళుని బుజమునందు ఇడుకొని శ్మశానమున నడచి పోవుచుండగా బేతాళుఁడు ఇట్లు కథ చెప్పసాగెను:—'రాజా, గాటంపు వలపుగతం జెప్పెదను వినుము. పుణ్యశేషముతో స్వర్గమునుండి భూలోకమున నవతరించు పుణ్యాత్ములకొఱకు అమరావతికి సమానముగా బ్రహ్మ నిర్మించినట్టి యీ యుజ్జయినీ నగరమున పూర్వ మొకప్పుడు పద్మనాభుఁ డనురాజు ఏలుచుండెను. ఈ నగరంబున ఆ కాలమందు కుబేరునికన్న ధనికుఁడు అర్థదత్తుఁ డని వైశ్యవరుఁడుండెను. ఆతనికి అమరసుందరుల సాటిది అనంగమంజరి అని కన్యారత్నము ఉండెను. ఆ కన్నియను తండ్రి తామ్రలిప్తి నివాసికి మణివర్మ యను వణిక్కుమారుని కిచ్చి వివాహము చేసెను. కాని, తనకు వేఱు సంతతి లేనందున మక్కువ

పెక్కువచేత కూఁతుం బాయలేక అల్లుని యింటికిం బంపక, అల్లునింగూడ తనయింటనే నిలుపుకొనెను రోగి కటుతిక్తౌష ధమునుంబోలె అనంగమంజరి ఆపతిని ఇచ్ఛగింపకుండెను. చిర కాలము కష్టపడి గడించిన ధనసమృద్ధి లోభికింబోలె పతికి మాత్రము అనంగమంజరి ప్రాణము కన్నను ప్రియగా నుండెను.

ఇట్లుండ నొకప్పుడు మణివర్మ తల్లిదండ్రులం గన నాస గొని తామ్రలిప్తికిం బోయెను. వేసవి వచ్చెను. ఆమని చెలువునిం [illegible] నెవ్వగం జేసి దిక్కాంతలు నిగిడించు నిట్టూర్పులో యన ముల్లీ పాటలామోద నిర్భరంబుగ వేఁడిగాడ్పులు వీవం దొడంగెను. కాఁగిన పుడమినుండి దుమారంపుబారులు గాలికి రేఁగి మింటి కెక్కుచుండెను. పగళ్లు బాటసారులవలెనే చాల సేపటికి సాగు చుండినవి. రాత్రులు కరము డీలు పడినవి.

అంత నొకప్పుడు అనంగమంజరి తన యింటి మేడకిటికీ లోనుండి రాజపురోహితునికుమారుని కమలాకర నాముని, ఆవీథిలో నడతెంచుచుండం గాంచి, ఆచెలువను అతఁడునుం గాంచి, అంతమాత్రాననే ఇరువురును మరుమాయలలోఁ బడి వశము దప్పిరి. అంతట తోడిచెలికాఁడు కమలాకరుని ఎట్లో ఇంటికి నడపించుకొని పోయెను అనంగమంజరియు కమలా కరుని నామధేయమును సఖీముఖమున నడిగించి తెలిసికొని, మెల్ల మెల్లన తన పడుకటింటం జేరి పడుకంబడి, అతనితో తల పోయుచు కాముని బారిం బడి ఏమియుం గనక ఏమియు వినక

వొరలు నుండెను. ఇట్లు రెం పుమూఁడుదినములు గడచినంతట అనంగమంజరి సన్నగిల్లి పాలి వలవంతకుం దాళఁజాలక, తాను వలచిన యా చెలువునిపొందు తనకు సమకూడ దని నిశ్చయించు కొని, రాత్రి ఒక సమయమున, కిటికీదారిని ఇల్లు వెలువడి మృతిఁ గోరి తనయూటతోఁటలోని చెట్లనడిమి బావికడ కేఁగిన దై, అట తనతండ్రి మహావిభవముతో ప్రతిష్ఠించిన తమ కులదేవతకు చండికాదేవికి మ్రొక్కి, కీర్తించి, 'అమ్మా, ఈ పుట్టువున కమలాకరుఁడు నాకు పతి గాఁడేని పైపుట్టువునసేని అగుఁగాక' అని వేఁడుకొని అమ్మవారి యెదుట నొక యశోక వృక్షంపుఁగొమ్మకు పయ్యెంటవలువతో నురి గట్టుకొనెను.

ఈలోపల నెచ్చెలి మేల్కాంచి పడుకటింట అనంగ మంజరిం గానక వెదకుచు నాతోఁటకే దైవయోగంబున నేతెం చెను. ఆ సమయమందు అనంగమంజరి మెడకు ఉరిం దగిలించు కొనుచుండెను. చెంతకు నెచ్చెలి పరువున సరిగి వలదు వల దని పలుకుచు నురిం ద్రెంపి వైచెను. ఇట్లు సఖి వచ్చి యురిం ద్రెంపుటం గాంచి, అనంగమంజరి ఆఁపరాని విరహతాపంబున నేలం గూలెను నెచ్చెలి ఓదార్చి అడుగఁగా దుఃఖమునకుఁ గారణము చెప్పి, వెండియు 'చెలీ, మాలతికా, తలిదండ్రుల వసమున నున్న నాకు ఆచెలువునికూటమి యలవడదు, నాకిఁక మరణముకన్న శరణ మే మున్నది ?' అని పల్కి, సొమ్మసిల్లి కూలెను. 'అకటా! మన్మథునిదురాయి దాఁట నెవ్వరితరము!

దానఁ గదా అవినీత లగు పెఱచెలువలను నవ్వెడు నాచెలి యిపుడు ఈతీరయినది!' అని పలువగలం బలవించుచు, మాలతిక అనంగమంజరిని చన్నీళ్లు చల్లి, చలువవీవనలు వీచి, మూర్ఛ తేర్చి తాపశాంతికై తామరపాకులసెజ్జ వేసి, అందుం బరుండఁ జేసి, మంచునఁ దడపినముత్తెపుఁబేరుల నెద నలంకరించెను. అంతట అనంగమంజరి కన్నీళ్లు నించుకొని నెచ్చెలితో 'సఖీ, నాతాపము ముత్తెపుఁబేరులకుం దామరాకులకుం జల్లాఱునది గాదు. దేన నిది యాఱునో దానిని నీవే ఆలోచించి సమకూర్పుము. నేను బ్రదుక నీ కిచ్చయేని ఆచెలువునిం గూర్పుము.' అని పచించెను. నెయ్యంబు మీఱ మాలతిక పల్కెను: 'చెలీ, ఈరాత్రి దూరము గడచి యున్నది. తేపు పోయి నేను నీ ప్రియుని ఇటకే తోడితెచ్చెద. అంతదనుక ఇంటికి పోయి ప్రాణములు బిగఁబట్టుకొని యుండుము.' అంతట అనంగమంజరి సంతసిల్లి తనమెడలోని హారమును చెలిమెడలో బహుమానముగా వైచి 'నెచ్చెలీ, ఇపుడు నీ వింటికిం బొమ్ము, తెల్లవాఱఁగానే పోయి కార్యము సాధింపుము.' అని సఖిని పంపి తానింటి కేఁగెను.

తెల్లవాఱఁగా మాలతిక ఎవ్వరికిం దెలియనీయక కమలాకరుని యింటికిం జని వెదకి ఉద్యానవనములో చెట్టుక్రింద గందపునీటితో తడిపిన తామరాకు సెజ్జం బడి పొరలుచున్న కమలాకరుని, గుట్టుం గాచుచెలికాఁడొకఁడు అరఁటియాకు వీవన

గాలితో నూఱడించు చున్నను కామాగ్ని చేతఁ గ్రాఁగుచున్న వానిని, దవ్వనం గాంచిన దై ఆతని యాకారిక అనంగమంజరి చేత నే చల్లాఱునదిగా నెంచియు, నిశ్చయ మెఱుంగునదై అటనే చాటున నిలిచి యుండెను. అంతలోన కమలాకరునితోఁ జెలి కాఁడు 'మిత్త్రుఁడా, నెగు లొందకు, ఈయుద్యానంపుసొంపులు గాంచుచు మనస్సును వినోద పెట్టుకొనుము.' అనెను. 'చెలి కాఁడా, నామనస్సును ఆవణిక్కన్య హరించెను గదా, నాకడ నున్నం గదా వినోద పెట్ట నగును. శూన్యహృదయుని నన్ను మదనుఁ డిపుడు తన యంపకోలలకు దొనగా చేసినాఁడు. కాన ఆమనశ్చోరి నాకు దొరకునట్లుగా యత్నింపుము.' అని కమలా కరుఁడు వచించెను. అంతట మాలతిక సంతసించి చాటు విడిచి ఎదుటికిం జని కమలాకరునితో ననియె:—"ఓ సొబగుఁ డా, అనంగమంజరి పంపఁగా నీకడ కేగుదెంచితిని. దూత్య ముమా వివరించెద వినుము:— 'ఇది శిష్టసంప్రదాయమా, బలాత్కారమున నాహృదయముం జొచ్చి మనస్సును దొంగి లించి కానరాకపోవుట!' అని. ఇది మఱియు వింత! ఆమె స్వ మనశ్చోరునికి నీకే ప్రాణములతోఁ గూడ దేహమును సయితము ఇయ్యఁ దలఁచి యున్నది. నీకై ఆతరుణి రేయుంబవలు ఊడుకు నిట్టూర్పులం బుచ్చుచున్నది. నిరంతరమును నీకై ఆ మచ్చె కంటి కాటుకకన్నీటి బొట్టులధారలజడిని బిట్టు గురియుచున్నది. కావున నీ కిచ్చగలదేని మీా కిరువురకును మే లగు తెఱం గెఱిం

గించెద." అంతట కమలాకరుండు 'ఓ చెలీ, ప్రాణేశ్వరి నాకై పడుచున్న విరహావస్థాం దెలుపుచు నీపలుకులు నా డెందంబు నానందంబుం గొందలంబును బొందించుచున్నవి. నీ వొకతెవే మా కిరువురకును గతివి. కావున నీకుఁ దోఁచినట్లు ఒనర్పుము.' అని వాక్రుచ్చెను. అంతట మాలతిక యిట్లనియె:— 'ఈరాత్రి నేను అనంగమంజరిని గుప్తముగా తదీయోద్యానమందు చేర్చెద. నీ వట వెలుపల వచ్చియుండుము నేను నా యుపాయముచేత నిన్ను లోనికిం గొనిపోయెద. అట్లని మీ కిరువురకును ఇచ్చ వచ్చినట్లు కూటమి వాటిల్లును.'

ఇట్లు మాలతిక కమలాకరుని దేర్చి పోయి, అనంగమంజరిని కార్యము పండె నని చెప్పి సంతోషపెట్టెను. అనంతరము అట్లే రాత్రి కమలాకరుఁడు కట్టి పూసి కై సేసి కోరికలీరిక లెత్త ఇల్లు గదలి చని ప్రేయసియాటతోఁట దారికడ బయట నిలిచి యుండెను. మాలతిక అనంగమంజరిని ఆ పగ లెట్లో గడపించి, యపుడు తోడ్కొని వచ్చి, యాతోఁటలో ఎలమావిగుబురునడుమఁ గూర్చుండఁబెట్టి, తాను వెలికి అరిగి కమలాకరుం దెచ్చి చెలికడం జేర్చెను. కమలాకరుండు పట్టంపుటాకుజీబుల పొట్లనడుమ నున్నయాప్రియభామినిని బాటసారి నీడనుం బోలెం గాంచి చేరువకరుగునంతట నత్తన్వి సిగ్గడలి కమలా... పరుగునం బైకొని కంఠమునం గవుంగిలించి 'దొరకితివే, ...చ్చటి కేఁగెదవు?' అనియెడి పలుకునడుమనే ప్రహర్షాతి

రేకంబున నూపిరి తిరుగక ప్రాణము పోయి గాలికి సోలిన తీవ వోలె నేల వ్రాలెను. కామపరిపాక ప్రకారము ఎంతవింతయో! అది గని, పిడుగు దాకినట్లే కమలాకరుఁడు, అయ్యో! అయ్యో! ఇదే మని, మూర్ఛిల్లి వ్రాలి ఇంచుకసేపటికిం దెలిసి లేచి, యా ప్రియ నొడిం బెట్టుకొని, కవుఁగిలించుకొనుచు ముద్దులు గొను చు తద్దయు నేడ్చుచు చివరకు పట్టరాని శోకాతిరేకంబున గుం డియ వ్రీలి కాలధర్మము నొందెను. అంతట నా యిరువుర గతికిని మాలతిక వగచుచుండఁగా రాత్రి గడచెను. తరువాత తోఁటకాపరులవలన ఈవృత్తాంత మెఱింగి ఇరువుర బంధుజనులు ఆచోటికి వచ్చి లజ్జాశ్చర్య శోక మోహంబులు పెనంగొన ఏమి సేయనుం దోఁపక ఖేదంబునం దల వాంచి కడుం దడవు ఊరకుండిరి. అక్కటా! వాసునెలఁతలు కులమున కెల్ల కష్టములు నవమానముం దెత్తురుగదా ఇంతలో ననంగమంజరికై యువ్వి ళ్లూరుచు తత్పతి మణివర్మ తామ్రలిప్తినుండి వచ్చెను. అతఁడు మామయింటికిఁ బోయి, వృత్తాంత మెఱింగి, బాష్పాంధకారి లోచనుం డయి ఆయుద్యానమునకే వచ్చెను. అచట [illegible] యొడియం దత్తెఱంగున నున్న భార్యను గనియు రాగ[illegible] బున తదీయదుశ్శీలత్వం దలంపక [illegible]ఖాశనిహతుఁడై [illegible]ను ప్రాణములు వదలెను. అంత [illegible]జను లెల్ల క్రందుగా సం దడింప, నకోలాహలమునకు నూరివారెల్ల వృత్తాంత మరసి, విని యబ్బురపోయి యచటికి వచ్చిరి. ఆసమయంబున అచట

పూర్వము అనంగమంజరీ జనకుఁడు ప్రతిష్ఠ చేసి యుండిన చండి కాదేవిని ప్రమథులు 'అమ్మా, ఈయర్థదత్తుఁడు నిన్నిటం బ్రతి ష్ఠించినవాఁడు, ఎప్పుడును నీయం దతిభక్తుఁడు. అతనికిం గలిగిన యీశోకములో, ఓతల్లీ, దయ చూపి రక్షింపుము.' అని వేఁడు కొనిరి. అంత నాశరణాగతవత్సల శంకరార్ధాంగలక్ష్మి చండికా దేవి కనికరంబున 'మంచిది, ఈముప్పురును శాంతమదను లై బ్రదికి లేతురు గాక.' యని యనుగ్రహించెను అంతట నా ముప్పురును మదనవికారము లేక నిదుర మేల్కాన్న వారువోలె బ్రదికి లేచిరి. ఆయాశ్చర్యమునకు జను లెల్ల ఆనందపడుచుం డఁగా కమలాకరుఁడు లజ్జచే తలవంచుకొని ఇంటికిం బోయెను. అర్థదత్తుఁడు సిగ్గుపడుచున్న తనయ ననంగమంజరిని అల్లునితో మహోత్సవంబున నింటికిం గొనిపోయెను.

ఇట్లని కథను వక్కాణించి బేతాళుఁడు విక్రమార్కుని అడిగెను. 'రాజా, అనురాగమూఢు లయిన యీముప్పురలోను ఎవరికి మోహము ఎక్కువ? ఎఱింగియుం జెప్ప వేని నీకు నా మున్నుపటిశాపము ఉన్నదియకదా.' రా జిట్లనియె:—వారిలో ఎక్కువ రాగమూఢుఁడు మణివర్మ కడమ యిరువురును మద నావస్థ కాలక్రమమున పరిపక్వ మగుడు అన్యోన్యానురాగాతి రేకంబున ప్రాణము వదలియు వదలిరి గాక, అతిమూఢుఁడు మణివర్మ, భార్య అన్యపురుషసక్తమ్మృత యైనను కని, కోపము వహింపవలసిన తఱిని శోకముచే ప్రాణంబుం ద్యజించినాఁడు.'

అంతట బేతాళుఁడు అదృశ్యుఁడై నిజధామమున కేఁగెను. రాజు మరల నాతనిని తేఁ బోయెను.

---

## కథ—౨౨

విక్రమార్కుఁడు మరల బేతాళుని శింశుపావృక్షము నుండి తెచ్చుచుండఁగా బుజంబునుండి బేతాళుఁడు ఇట్లనియె:- ఓరాజా, నీవు సత్త్వసంపన్నుఁడవు, సాధువవు, కావున నీకొక మంచి కథ చెప్పెద వినుము:— పూర్వము కుసుమపుర మను నగరమున ధరణీవరాహుఁ డని రాజు ఏలుచుండెను అతని రాజ్యములో బ్రాహ్మణులు పలువు రుండిరి. అందు బ్రహ్మస్థల మను నగ్రహారంబున విష్ణుస్వామి యని బ్రాహ్మణుఁ డుండెను. అగ్నిదేవునికి స్వాహాదేవివలె ఆయనకు మహాపతివ్రత భార్య యుండెను, ఆదంపతులకు నలువురు కొమరులు కలిగిరి వారికి వేదాధ్యయనము బాల్యంబును ముగియునప్పటికి తండ్రి కాలధర్మము నొందెను, తల్లి సహగమనము గావించెను. అంత నాభ్రాతలు కడుదుఃఖితులై, దాయాద హృతసర్వస్వులై, అట నేమియు గతి లేమిచే నలువురుం గలయఁబలికికొని మాతామహునియింటికి యజ్ఞస్థల మనుగ్రామమునకు పోవ సంకల్పించుకొని, యట్లే తరలి దారిలో మధుకరవృత్తిచే జీవించుచు చిరకాలమునకు ఆగ్రామము చేరిరి. అట తాత మృతిఁ జెందినందున

మేనమామల పోషణలో స్వాధ్యాయము నభ్యసించుచుండిరి. ఈ దరిద్రులకుఁ గాలక్రమమున మేనమామలయింటిలో అన్న వస్త్రముల విషయమున నవమానము జరుగు చుండెను.

ఇట్లు బంధువులవలని యవమానమునకు రోసి వారు ఒక నాఁడు ఏకాంతముగా కలసి త్రల్లఘోసికొనుటలో పెద్దవాఁడు తమ్ములతో ని ట్లనియె.—"తమ్ములారా, మన మేమి చేయఁ గలము? సకలమును విధి సేయు చున్నది. ఎవుడేని ఏవిషయమం దేనియు పురుషుఁడు చేయఁగలది ఇంచుకేనియు లేదు. నేను మనదశకు దుఃఖపడుచు తిరుగు చుండ రుద్రభూమిలో చచ్చి పడియున్న యొకపురుషుఁడు నాకు అగపడెను వానిం గని యిట్లు తలంచితిని. 'ఆహా! ఈతనిదశ నా కబ్బునా! ఈతఁడు దుఃఖములమోపు నవల వైచి విశ్రాంతిం బొందుచున్నాఁడు. ఎంత ధన్యుఁడు!' ఇట్లు తలంచి నేను మరణమునకు నిశ్చయించు కొని చెట్టుకొన కొకత్రాడు గట్టి దానితో ఉరిపోసికొంటిని. దాన నాకు తెలివి తప్పెనే గాని ప్రాణము పో లేదు. పాశము తెగి నేను నేలం గూలితిని. నాకు మరల తెలివి వచ్చునంతటికి ఎవఁడో ఒక పురుషుఁడు కనికరించి నన్ను తన యుత్తరీయమున చల్లగాలి వచ్చునట్లుగా వీచుచు సేదదేర్చుచు, నాతో 'చెలికాఁడా విద్వాంసుఁడ వయ్యును, ఇట్లు దుఃఖింతు వేల? పుణ్యమువలన సుఖంబు గలుగుటయు, పాపంబువలన దుఃఖంబు గలుగుటయు నీ వెఱుంగవా? దుఃఖమునకు ఓడిలి వేవి

పుణ్యము సే[illegible]ము. ఆత్మహత్య సేసి నరక దుఃఖమున కేల యిడి గట్టెదవు?' అని నన్ను ఓదార్చి తా నెటకో పోయెను. అంతట నేను మరణప్రయత్నము మాని వచ్చితిని. ఇట్లు విపరీత విధి చావనుం గూడ చావ నీయదు. ఇపుడు నేను నాకీక దారిద్ర్యక్లేశము కలుగకుండునట్లు తీర్థమందు తపస్సుచేత ఈ దేహమును కాల్చెదను."

అన్న యట్లు పలుకఁగా తమ్ము లిట్లు వక్కాణించిరి.— 'అన్నా, ధనము లేని ప్రాజ్ఞునికి దుఃఖ మే మున్నది? అర్థములు చంచలము లని యెఱుఁగవా? తెచ్చి పెట్టుకొని ఎంత కాపాడి నను తుదకు దుర్జనమైత్రియు, వేశ్యయు, శ్రీయును, ఎవరికేని ఎన్నఁడేని స్థిరములా? కావున మానవంతుఁడు ఏగుణంబున నర్థము కట్టువడి స్వాధీనముగ నుండునో ఆగుణంబును సాధింప వలయును.' ఇట్లు తమ్ములు పలుకఁగా అన్న ధైర్యము తెచ్చుకొని 'తమ్ములారా, మీరు సెప్పిన యా గుణ మెయ్యది?' యని అడిగెను. అంతట వా రెల్ల నాలోచించుకొని 'మనము భూమిలో వెదకి ఏదేని ఒక విజ్ఞానమును నేర్చుకొందము.' అని నిశ్చయించుకొని మరల నలువురుం గలసి కొనుటకు సంకేతస్థానమొకటి యేర్పఱుచుకొని నలు దిక్కులకుం జెదరి పోయిరి.

కొంతకాలమునకు విజ్ఞానములు నేర్చి వచ్చి మరలం గలసిరి. ఒక్కొక్కఁడును కడమవారితో తా నేర్చిన విద్యను తెల్పెను 'నాకు ఎముకతునుక దొరకినయెడల అది యే ప్రా

ణిదో దానికిం దగిన మాంసమును నా నేర్చిన విద్యచేత నేను సృజింపఁ గలను.' అని యొకఁడు పల్కెను. రెండవవాఁడు 'అట్లు మాంసము పొందిన యాయెంపతునియకు నేను నా నేర్చిన విద్య చేత ఆప్రాణికిం దగిన వెండ్రుకలును తోలును సృజింపఁ గలను' అని వచించెను. మూఁడవవాఁడు 'అట్లే తోలు మాంసము వెండ్రుకలుంగలిగినయామొముక యుండిన, నేను నా నేర్చినవిద్య చేత దానిదేహంపుఁగడమయవయవముల నెల్ల సృజింపఁగలను' అని చెప్పెను. అంతట నాలవవాఁడు, 'అట్టి యా దేహమునకు నేను నా విద్యచే ప్రాణ మియ్యఁగలను.' అని తెల్పెను అనంతరము నలువురును తమతమ విద్యాప్రభావముం జూపుకొొన నొక యొముక ముక్కకై యడవికింబోయిరి. అటవారికి సింగము నెమ్మొకటి దొరకెను. సింగంబు దని యెఱుంగక వారు దానిని గ్రహించి ఒకఁడు దానికి తగిన మాంసముం గల్పించెను. రెండవ వాఁడు, దానికి చర్మరోమములు కల్పించెను, మూఁడవవాఁడు సకలావయవములుం బూర్తి చేసెను అంతట నా నిర్జీవసింహమునకు నాలవవాఁడు ప్రాణ మొసంగెను అంత నాసింగము జూలు జెక్కించుకొని అతిభయంకరముగా కోఱలు దీటుకొనుచు వాఁడిగోరుల నంకుసములవలెం బట్టి పైకి దుముకి తన్ను సృజించిన యానలువురం జీల్చి ఆరగించి తనిసి నట్టడవిం జొచ్చెను. ఇత్తెఱంగున నా బ్రాహ్మణ భ్రాతలు నల్వురును సింహసృష్టిదోషముచేత మడిసిరి. దుష్టప్రాణిని లేపినవానికి సుఖ

మెట్లు గలుగును! ఇవ్విధమున విధి విపరీత మైయున్నప్పుడు కష్ట పడి నేర్చిన మంచి విద్యయు మే లొసంగక చేటే సేయును. వేరైనదైవము అనుకూలముగా నుండిన, దానిం బ్రజ్ఞాజలమునం దడిపిన, నీతిపాదులో పురుషకారవృక్షము ఫలమొసంగును.

ఇట్లు బేతాళుఁడు కథ చెప్పి విక్రమాదిత్యుని ఎప్పటి శాపమును దలఁపించి ఆ నలువురు భ్రాతలలో సింహనిర్మాణ దోషము ఎవరిదో చెప్పు మనెను. 'ఈతఁడు నా కిట్లు మౌన భంగ మొనర్చి తప్పించుకొనిపో నుద్దేశించి యడుగు చున్నాఁడు. కానీ, నేనును వదలను, మరలం బోయి తెచ్చెదను గాక.' అని తలపోసి విక్రమార్క మహారాజు 'యోగీశ్వరా, ఆనలువురలో సింహమునకు ప్రాణ మిచ్చినవాఁడు ఆ సింహ నిర్మాణ పాపమును చేసినవాఁడు. అది ఏ ప్రాణియో తెలియక కడమ ముగ్వురును మాంస చర్మ రో మాంగములను నిర్మించిరి. కావున వారియం దేమియు దోషము లేదు. కడపటివాఁడు సింహాకారము గాంచి సింహ మని యెఱింగియు తనవిద్యం జూప నాస గొని దానికి ప్రాణ మిచ్చెను గాన ఆ నాలుగు బ్రహ్మహత్యలనుం జేసినవాఁడు అతఁడే.' అని పలికెను. వెంటనే బేతాళుఁడు అంతర్ధాన మొందెను రాజు మరల నాతనిం గొనిరాఁ బోయెను.

---

క థ—౨౩.



అనంతరము విక్రమార్కమహారాజు మరలశ్మశానమందు శింశుపావృక్షమునుండి బేతాళుని కొనిరా నరిగెను. బేతాళుఁడు నానావికారములు మాయలును గావించెను. రాజు వదలక యెట్లో అతనిని భుజమున నెక్కించుకొని కొనిపోవుచుండెను దారిలో బేతాళుఁ డిట్లు వచించెను.—రాజా, ఇది చెడుకార్య మయినను దీన నింత పట్టుదల నీ కున్నది. కాన నీకు వినోదార్థ మొకకథ చెప్పెదను, వినుము. కళింగదేశమున శోభావతి అను పురము స్వర్గములో నమరావతివోలె పుణ్యాత్ములకు నివాస భూత మయినది కలదు. దానిని ప్రద్యుమ్నుఁ డను రాజు ఏలు చుండెను. ఆనగరమున నొకచోట నారాజు యజ్ఞస్థల మని యొకయగ్రహారమును పలువురు బ్రాహ్మణులకు నివాసముగా నిర్మించి యుండెను. ఆయగ్రహారమున వేదపారగుఁడు మహా ధనుఁడు అగ్ని హోత్రి దేవతాతిథిపూజకుఁడు యజ్ఞసోముఁ డని బ్రాహ్మణుఁ డొకఁ డుండెను. అతనికి లేక లేక యపరవయ స్సునందు లెక్కలేని వ్రతములకు ఫలముగా పుత్త్రుఁ డొకఁడు అనురూప యగు భార్యయందు జనించెను ఆచిన్నవానికి బ్రాహ్మణులు దేవసోముఁ డని నామ మిడిరి. సులక్షణుఁ డాతఁడు తండ్రియింటం బెరుగు చుండెను. పదియాఱేండ్ల

వయస్సున ఆబాలుఁడు విద్యావినయసంపదచే సర్వజన ప్రియుఁడై దైవవశమున జ్వరముచే కాలధర్మము నొందెను. అంతట ప్రేమాతిరేకంబున తండ్రి తానును భార్యయు పుత్త్రుని దేహమును కౌఁగిలించుకొని యేడ్చుచు ఎంతసేపటికిని దహనమునకు విడువఁడాయెను అంతట పెద్దలు వచ్చి యాయనకీ తీరున బోధచేసిరి:—'భూదేవ, నీవు పరావరజ్ఞుఁడవు గదా, ఈసంసారము నీటిబుడగవలె నస్థిరమని యెఱుంగవా? సైన్యములను భూమిలో నిండించి, మనోహరములయిన మేడలయందు సంగీత నాదములతో రతనాలమంచంబులం బవ్వళించి, చందన ద్రవము మైఁ బూసికొని, సుందరీముఖులం గూడి, ఈ భూలోకమందు తామే దేవతలుగా విలసిల్లిన నరాధిపులు సయితము, శ్మశానములలో అనుచరులు ఏడ్చుచు వెంట రా, నొంటిగా సొదలం బరుండి, చిచ్చునకును తిండి యై, నక్కలు ప్రక్కలం బెఱుకుచుండఁగా, కాలముచే దిగమ్రింగఁబడి ఎవ్వరికిని తప్పింపఁదరము గాక పోఁగా, ఇతరుల మాట చెప్పవలయునా? విద్వాంసుఁడవు నీ వీ శవమును కవుంగిలించికొని ఏమి చేయుదువు!' ఎట్టకేల కతఁడు విడువఁగా వాను ఆచిన్నవానిని శవాలంకారము చేసి పాడియం బెట్టి, పలువురు బంధుజనులు మహాదుఃఖంబున నేడ్చుచు కూడ రాఁగా, నలబలంబు మీఱ, శ్మశానమునకుం గొనిపోయిరి.

అచ్చట శ్మశానంబున వృద్ధతాపసుఁడు పాశుపతయోగి మఠిక కట్టుకొని నివసించి యుండెను. తపస్సుచేతను వయస్సు చేతను కరము కృశించిన యాతని శరీరమును అంతటను నరములు ఉబ్బి చుట్టుకొని యుండెను. ఆతఁడు దామశివ నామధేయుఁడు అపరమహేశ్వరుఁడో యన నొప్పుచుండెను. ఆతాపసునికి శిష్యుఁడు మహామూర్ఖుఁపు శఠుఁడు ధ్యానయోగాది విద్యచే గర్వము బలిసినవాఁడు భిక్షకై వ్రతము పూనినవాఁడు ఆతనితోఁ గూడ నివసించువాఁ డొకఁ డుండెను. ఆసమయమున తాపసుఁడు వానిని చీవాట్లు పెట్టుచుండి యాకోలాహలము దూరమునుండి విని 'ఒరీ, ఇ దేమో యీ శ్మశానములో అపూర్వముగా ఎక్కువ కలకలము వినఁబడుచున్నది పోయి క్షణములో నది యేమో తెలిసికొని రమ్ము, లే లెమ్ము, అని యాజ్ఞాపించెను. శిష్యుఁడు అప్పుడే చీవాట్లు తిన్నకోపంబున 'నేను పోను, నీవే స్వయముగాఁ బొమ్ము, నాకు భిక్షావేళ దాఁటిపోవును' అని తిరస్కరించెను అంతట గురువు 'చీ! చీ! మూర్ఖుఁడా, తిండిపోతా, తెల్లవారి యింకను అరజాముకా లేదే, నీ కిప్పు డెక్కడి భిక్షావేళరా?' అని చీవాట్లు పెట్టెను. అంతట శిష్యుఁడు కోపగించి 'చీ, ఎత్తువద్దముదుసలీ, నేను నీకు శిష్యుఁడు గాను, నీవు నాకు గురుఁడవు గావు, ఇదే నీకొయ్యముంతను నీవేమోచికొమ్ము, నేను వేఱే పోయెదను.' అని ప్రేలి వెడలి పోయెను. అంతట నాతాపసుఁడు నవ్వుచు

వెలువడి ఆ బ్రాహ్మణకుమారుని శవమును బంధువులు దహనార్థము తెచ్చి పెట్టియున్న తావునకుం జనియెను అట జనులు మృతకుమారుని నవయౌవనమునకు వగచుచుండఁగా, తాపసుఁడు ఆశవముం గన్నవాఁడై తనముదిరియొడలం ద్యజించి వాని దేహంబునం బ్రవేశింపఁ దలంపుగొనియెను. వెంటనే చాటునకుం బోయి ఏకాంతంబున బిగ్గరగా నేడ్చి కాలుసేతు లాడించుచు నృత్యము చేసి యావనేచ్ఛచే యోగప్రభావముచే క్షణములో ఆ బ్రాహ్మణ కుమారుని దేహంబునందుఁ బ్రవేశించెను. అంతట పాడెపై నున్న యావిప్రకుమారుఁడు బ్రదికి ఆవులించుచు లేచి కూర్చుండెను. దానిం గని బంధుప్రభృతి జను లెల్ల 'బ్రదికి యున్నాఁడు! బ్రదికియున్నాఁడు!' అని పెద్ద కోలాహలము గావించిరి. అంత బ్రాహ్మణ కుమార శరీర గతుఁడగు యోగీశ్వరుఁడు తనవ్రతము మానఁ దలంపనివాఁడై వారితో నెల్లనిట్లు బోధించెను: 'లోకాంతరమున కేఁగిన నాకు పరమశివుఁడు సాక్షాత్తుగా మహాపాశుపతవ్రతము నాచరింప నియమించి యుపదేశించి యా యొప్పందలపై ప్రాణ మిచ్చినాఁడు ఇప్పుడే నేను ఏకాంత వాసమునకుం జని యావ్రతము నవలంబింప వలయును. ఇట్లు చేయకున్న నా ప్రాణము నిలువదు. కావున మీరు పొండు నేనుం బోయెదను.' ఇవ్విధమున నావ్రతి వారి నెల్ల బోధించి యిండ్లకుఁ బంపివేసెను. అనంతరము తాను ఒంటరిగా నేగి

తన పూర్వదేహమును ఒకగోతిలోఁ బూడ్చి మరల వ్రత మారంభించి జవ్వనంబుచే మించి యథేచ్ఛముగా నేఁగెను.

బేతాళుఁడు ఇట్లని కథ చెప్పి విక్రమార్కుని తన యెప్పటి శాపముం దలఁపించి యీ ప్రశ్న చేసెను:— 'రాజా, ఆయోగింద్రుఁడు పరకాయ ప్రవేశము సేయఁ బోవు తఱిని ఏల యట్లు బిగ్గరగా నేడ్చెను? ఏల యట్లు నృత్యము చేసెను? నాకు విన వేడుకగా నున్నది చెప్పుము.' రాజు శాపమునకు వెఱచి మౌనము మాని యిట్లనియె:—'ఆ విషయమున నా తాపసుని యభిప్రాయ మిది. ఈశరీరము చిరకాలమునుండి నాతో నుండి పెరిఁగినది, సిద్ధికి సాధన మయినది, లేఁబ్రాయంబున తల్లిదండ్రులచే కరము లాలన పొందినది. అట్టి దీని నిప్పుడు వదలెదను గదా, యని వగపు గలిగి యాముసలి తాపసుఁడు బిగ్గరగా నేడ్చెను. దేహాభిమానము వదలరానిది గదా. క్రొత్త యొడలిం జేరెదను, ఇంతకన్న నెక్కుడు సాధించెదను, అని సంతోషంబున నృత్యము చేసెను. జవ్వనము ఎవ్వనికి ప్రియము గాదు?' ఇట్లు రాజు పలుకఁగా నతని బుజమునుండి బేతాళుఁడు మాయ మాయెను. రాజు మరల నాతనిం జేర నేఁగెను. ధీరాత్ముల తెగువ కులాచలములను సయితము జయించును, కల్పాంతమందును కదలదు గదా.

---

కథ—౨౮.



మరల శింశుపా తరువునుండి విక్రమార్కుఁడు బుజం బునం బెట్టుకొని తెచ్చుచుండఁగా బేతాళుఁడు వెండియు నిట్లు వచించెను:—ఓరాజా, ఈయాంతాఁయాతములకు నే నలసి యున్నాఁడను, నీ వలయవు. నా దొక గొప్ప ప్రశ్న యున్నది, దానిం జెప్పెద వినుము. పూర్వము దక్షిణాపథంబున పరమ సాధువు ధర్ముఁ డని మండలాధిపతి యొకఁ డుండెను. ఆతనికి దాయాదులు పలువు రుండిరి. ఆతేని భార్య గొప్ప వంశముది సాధ్వీమతల్లి, ఆమెది మాళవదేశము, పేరు చంద్రవతి. ఆ జాయాపతులకు లావణ్యవతి యని యన్వర్థనామధేయ యొక కూఁతురు కలిగెను. ఆపిల్లకు పెండ్లియీడు వచ్చిన సమయమున దాయాదులు రాజ్య మాక్రమించిరి అంత నారాజు స్వదేశమునుండి పలాయితుఁడై భార్యను కూఁతురు వెంటఁ బెట్టుకొని రత్నసంచయముం గైకొని రాత్రి తరలి మామగారి యింటికి మాళవదేశమునకు వింధ్యారణ్యముదారిని పోవుచుండెను. ఆతఁడు కాడు చొచ్చినంతట ప్రొద్దు పొడిచెను. రాజు నడకలో కాలికి గ్రుచ్చుకొన్న ముండ్లచే శ్రమపడుచు నొక బోయపల్లియం దఱియం జనియెను. దూరమునుండియే కిరాతకులు వస్త్రాభరణములతో వచ్చుచున్న యా రాజుం గని

పెక్కు క్రైదువ్వులం గయికొని దోఁచుకొనుటకు పరువున వచ్చిరి. వారిం గని రాజు 'మిమ్ము మ్లేచ్ఛులు తాఁకుదురు, ఇవ్వనిం జొరుఁడు' అని భార్యాకుమారికలను హెచ్చరించెను. వారు నట్లే జేబునం జొచ్చిరి. ఆరాజు శూరాగ్రేసరుఁడు తన పై నంపవాన గురియుచున్న యా కిరాతులను డాలుం దర వారిం బూని ఒక్కండ పెక్కండ్రం జక్కాడెను. అంత శబరపతి పల్లీజనులనెల్ల నతనిమీఁదికిం బంప, వారుపైఁబడి డాలు పగులఁ గొట్టి యాతని నొంటిగానిని సంహరించి యాభరణములం గొని చనిరి. పొదరింటనుండి అది యెల్లం గని భర్తృమరణమునకు వడంకి చంద్రవతి కొమరితతోఁగూడ దిగులున పలాయమాన యయి దూరము చని మఱి యొక యడవిం జొచ్చెను. ఆసమయంబున మధ్యాహ్నతాపమునకు నీడలు కూడ పాంథులవలెనే చల్లని వృక్షమూలముల నాశ్రయించు చుండ, వా రిరువురును ఒకచోట నొక చెఱువుగట్టున నశోకవృక్షంపు నీడలో చదికిలం బడి కూర్చుండిరి.

ఆసమయంబున పెద్దమానిసి యొకఁడు చండసింహ నాముఁడు సింహపరాక్రముఁ డను పేరి కొమరునితోఁ గూడ నాయరణ్యమునకు వేఁటకై వచ్చినవాఁడు ఆచెంగటనే నివసించువాఁడు గుఱ్ఱముమీఁద వచ్చి దారిలో దుమ్ములో నావెలందుల యడుగులజాడం గని కుమారునితో 'పుత్త్రా, ఈపాద రేఖలు మంచివిగా నున్నవి, అందగత్తెలవిగా నగపడుచున్నవి. ఈజా

డం బట్టి పోయి మనము వారిని కందుమేని నీ వందొకతెను నీ కిష్ట మయిన దానిని స్వీకరింపుము.' అనెను. 'నాయనా, ఇందు ఒకతె యడుగులు చిన్నవిగాను, ఇంకొకతెయడుగులు పెద్దవిగాను ఉన్నవి. చిన్న యడుగులది చిన్నదిగా నుండును, అది నాభార్య, పెద్దయడుగులది పెద్దదిగా నుండును, అది నీకు తగినది నీభార్య.' అని పుత్త్రుఁడు సింహవిక్రముఁడు వచించెను. తండ్రి యిట్లనియె;—'పుత్త్రా, ఇట్లు చెప్పవచ్చునా? మొన్న మొన్ననే గదా నీతల్లి పరలోకమునకుఁ బోయినది. అట్టి గుణవంతురాలిని పోఁగొట్టుకొని ఇంకొకతెపై ననురాగ మెట్లు పూన నగును!' పుత్త్రుఁడు మరల ని ట్లనియె:—'నాయనా, అట్లు చెప్పకుము, భార్య లేని గృహస్థునియిల్లు పాడు గదా. ఇదియునుంగాక మూలదేవుఁడు పల్కినయీసుద్దిని నీవు వినలేదా?

క. ఎందు ఘన స్తనజఘన య
మందౌత్సుక్యమునఁ దనదుమార్గముఁ గనదో
సందానము కొఱ యగుసా
బందికి గృహసంజ్ఞమునకుఁ బాలసుఁ డేఁగుఁ.

కావున నేఁ గోనని రెండవదానిని నీవు స్వీకరింపవేని నా ప్రాణము హరించినట్లే' పుత్త్రుఁడు నిర్బంధపెట్టఁగా తండ్రి యొప్పుకొనెను. ఇరువురును ఆజాడవెంట సరస్తీరమునకు వచ్చి చంద్రవతిని గాంచి దఱిసిరి. వారిం గని దొంగ లని వెఱచి ఆమె లేచెను. కూఁతురు వారిం గని తల్లితో 'అమ్మా,

భయపడకు, దొంగలు గారు, సౌమ్యాకారులు, సువేషులు. మీ రెవరో వేఁటకు వచ్చి ఇటు లరుదెంచినారు.' అని పలికెను, ఆమాట విని ఆరాణి సందేహించుచుండఁగా చండసింహుఁడు గుఱ్ఱము దిగి వారితో 'ఓయొలనాగలారా, ఏల తొట్రుపడియెదరు, మేము అనురక్తిచే మిమ్ముం గన వచ్చితిమి. కావున భయపడక మీ రెవరో చెప్పుఁడు. ముక్కంటికంటిమంట యంటిన తుంటవింటి దంటకై వనరుచు ఈయటవికి వచ్చిన రతిప్రీతులో యన నున్నారు మీరు. రతనాలమేడల నుండవలసిన నెమ్మేని వారు మీరు అయ్యో! ఎట్టు లీ నిర్జనారణ్యమునకు వచ్చితిరి? ఉత్తమాంగన లొడిలో నిడికొని యొత్తం దగిన మీయడుగుఁదామరలు ఈ ముండ్లకాటిలో నడయాడునందులకు మాడెందంబు కరము కొందలపడుచున్నది. చిత్రము! గాలికి రేఁగి మీనెమ్మోములపయిం బడు నీదుమారము మా మొగంబును కాంతిహీనం జేయుచున్నది. కుసుమ కోమలం బగుమీనెమ్మేనం బడుచు వేఁడివెలుంగు వెలుంగు మమ్ముం గాల్చుచున్నది. కాన మీ వృత్తాంతముం జెప్పుఁడు. మాయెద వగం గూరుచున్నది. ఘాతుక మృగ నివాస మయిన యడవిలో మీయునికిని మేము చూడ నోపము.' అని వచించెను. అంతట చంద్రవతి నిట్టూర్పు పుచ్చి సిగ్గుచేతను దుఃఖముచేతను గలగుండువడుచు తమ వృత్తాంత మంతయు వర్ణించెను. అంతట చండసింహుఁడు ఆమెను స్వామిహీన అని తెలిసికొని ఆమెమది రంజిల్ల నుంచి

మాటలు పలికి స్వాధీనం జేసికొని, తాను కుమారుడును లావణ్యవతిని ఆమెను తమతో గుఱ్ఱములమీఁద నెక్కించు కొని ధనపతినగర సదృశ మయిన తమనగరమునకుం గొని పోయెను. ఆమెయు జన్మాంతరము పొందినది వోలె చేయునది లేక అంగీకరించెను అనదయై పరదేశమున ఇక్కట్టునం బడిన యింతి యేమి సేయఁగలదు. అనంతరము అడుగు జాడలం గని తాము చేసికొన్న నియమము ప్రకారము పెద్దయడుగుల దానిని లావణ్యవతిని కూఁతును తండ్రి చండ సింహుఁడును, చిన్న యడుగులదానిని చంద్రవతి తల్లిని కుమారుఁడు సింహ విక్రముండును వివాహ మయిరి. తొల్లి చేసిన సత్యము నెవ్వరు తప్పుదురు అనంతరము ఆతండ్రికొమరులకు ఆతల్లికూఁతుల యందు కాలక్రమమునం బలువురు కొడుకులును కొమారి తలును కలిగిరి.

ఇట్లు కథ చెప్పి బేతాళుఁడు విక్రమాదిత్యుని ఈ ప్రశ్న యడిగెను. 'ఓ రాజా, ఆ తల్లికూఁతులకు ఆ తండ్రికొమరుల వలనం గలిగిన కొడుకులును కొమరితలును ఇరుప్రక్కలవా రును ఒకరి కొక రే మగుదురో, ఆలోచించి చెప్పుము ఎఱిఁగి చెప్పవేని నీకు మునుపటి శాపమే.' ఇట్లు బేతాళుఁ డడుగఁగా రాజు ఎంత యాలోచించియు నుత్తరము చెప్పఁజాలక, చెప్పక, యూరక వడివడి నడచు చుండెను బుజమున శవమం దున్న బేతాళుఁడు 'ఆహా! ఈరాజు ఈమహాప్రశ్నకు ఉత్తర మెఱుఁ

గఁడు! కాన బదులాడక సంతసంబున వడివడి నడచుచున్నాఁడు. ఇతని మోసముసేయ నలవిగాదు, మఱి యితఁడు సత్త్వంపుఁ బ్రోవు ఆభిక్షువు మాతోఁ గ్రీడించుచు నింత మాత్రమున మనుఁగఁడు. కాన నిపు డుపాయంబున ఆదురాత్ముని వంచించి వాని సిద్ధిని భావికల్యాణుని కీరాజునకుం గూర్చెదఁ గాక.' అని తలంచుకొని రాజుతో నిట్లనియెః— "రాజా! సుఖార్హుఁడవు నీవు ఈ కృష్ణచతుర్దశి రాత్రి కటికిచీఁకటిలో ఈవల్లకాట ఈరాకపోకలచే కడు నాయాసపడితివి. నీమనంబున మాఱుదల యయినను ఏమియు లేదు నీయద్భుత ధైర్యమునకు నేను మెచ్చితిని. ఈపీనుఁగును నీవు కొనిపొమ్ము. దీనిలోనుండి నేను బయటం బోయెద. నీ కొకహితము చెప్పెదను, విని దాని నాచరింపుము. నీ వెవనికొఱకు ఈనరశవమును కొనివచ్చితివో వాఁడు పాడుభిక్షువు, ఇందు నన్ను ఆవాహన చేసి పూజించును, అనంతరము నిన్ను బలియిచ్చువాఁడై ఆ శఠుఁడు భూమిమీఁద సాష్టాంగ ప్రణామము సేయు మనును. అప్పుడు మహారాజా, నీవు వానితో 'ముందు నీవు చూపు, కని నేను తర్వాత చేసెదను.' అనుము. నీకు నేర్పుటకై వాఁడు భూమిపై సాఁగిలంబడఁగానే వానితలను కత్తితో నఱికివేయుము. అంతట వాఁడు కోరియున్న విద్యాధరైశ్వర్యసిద్ధి నీకుఁ గలుగును. అట్లు వానిని బలివేసి నీవు ఈభూమి ననుభవింపుము. అట్లు సేయవేని ఆశ్రమణుఁడు నిన్ను బలివేయును. ఇందులకుఁ జుమా నేను

నీ కింతసేపు విఘ్నములు చేయు చుంటిని. కాన నీకు సిద్ధి కలుగును గాక ” ఇట్లు బోధించి బేతాళుఁడు ఆశవమునుండి వెడలి పోయెను. అంతట రాజు బేతాళవాక్యము చేత క్షాంతిశీలుని శ్రమణుని అహితునిఁగా నెఱింగి సంతసించి ఆమఱ్ఱి క్రింద శ్రమణుని కడకు ఆశవమును బుజమునం గొనిపోయెను.

---

## కథ—౨౫

అంతట విక్రమమహారాజు ఆశవమును బుజమున మోచి క్షాంతిశీలుని యొద్దకుం జనియెను శ్రమణుఁడును కృష్ణపక్షరాత్రిచే మహారౌద్రం బయిన యా రుద్రభూమియందు మఱ్ఱి క్రింద ఒంటరిగా రాజు నెదురు సూచుచు నుండెను. నేలను నెత్తుట నలికి అందు తెల్లని యెముక పొడుముతో మండలమొకటి చేసి, దానిదిక్కులందు నెత్తురు నించినకుండ లుంచి, మానిసిక్రొవ్వు నూనెతో దీపము పెట్టి, ప్రక్కను అగ్నిలో హోమము చేసి, వలసిన సంభారము లెల్ల నచట సమకూర్చియుంచుకొని, తన యిష్టదైవముం బూజచేసి, కను పెట్టుకొని యుండెను. రాజు శవమును తేఁగానే కని సంతోషమున లేచి యిట్లని పొగడెను:— ‘మహారాజా, నాకు నీవు శక్యముగాని యనుగ్రహమును కావించితివి. నీబోంట్లెక్కడ? ఈపని ఎక్కడ! ఈ చో టెక్కడ, ఈ కాల మెక్కడ ? ఇవ్విధమున నీ ప్రాణ

మునకు తెగించి పరార్థము సాధించు నీవు లోకులు చెప్పుకొను నట్లు మహానుభావుఁడవు గావా ? ప్రాణాపాయము కలిగినను పరకు సేయక అంగీకృతకార్యములను సాధించుటయేగదా మహాత్ముల మాహాత్మ్యమని పెద్దలు చెప్పుదురు.' శ్రమణుఁడు ఇవ్విధమునం బొగడి, తనకార్యము సిద్ధించినదని తలఁచి, రాజుబుజము నుండి శవమును దింపెను. తర్వాత దానికి స్నానము చేయించి, గంద మలంది పూదండలం గై సేసి, దానిని ఆమండలము నడుమం బ్రతిష్ఠ చేసి, తాను ఒడలెల్ల విభూతిపూసికొని, తలవెండ్రుకల జన్నిదంబు వైచికొని పీనుంగువలువను కప్పుకొని, క్షణము సేపు ధ్యానంబునం దుండి ఆనరకళేబరమున మంత్రజలంబుచే బేతాళుని ఆవాహన చేసి క్రమముగాఁ బూజ చేసెను. శ్రమణుఁడు బేతాళునికి పుఱుకకప్పెరలో మానిసి నెత్తురు అర్ఘ్యమిచ్చి, పువ్వులొసంగి, నెత్తావులు వెదచల్లు మైపూఁత అర్పించి, మానిసికన్నులు ధూపము వేసి, నరమాంసము నైవేద్యము పెట్టి, పూజ ముగించి, రాజును పిలిచి 'రాజా, ఇట విజయం చేసియున్న యీమంత్రాధిరాజునకు పుడమిమీఁద సాఁగిలంబడి సాష్టాంగ నమస్కారము చేయుము ; అట్లు చేసిన నితఁడు నీ మనస్సులోని కోరికలు తీరునట్లుగా వర మిచ్చును.' అని హెచ్చరించెను.

ఆ మాట విని రాజు బేతాళుని యాహితోపదేశమును మఱవక 'స్వామీ ; సాష్టాంగ నమస్కార విధాన మెట్లో సే

నెఱుంగను, నీవు ముందు చేసి చూపుము, చూచి నేను జేసెదను.' అని పలికెను. చూపుటకై శ్రమణుఁడు నేలపై సాఁగిలం బడఁగానే రాజు కత్తితో వానితలను తుండించి వాని రొమ్ముం జీల్చి హృదయకమలముం బెకలించి దానిని శిరస్సమేతముగా బేతాళునికి ఉపహారమొసంగెను. ఆనేర్పునకు భూతగణంబు లెల్ల బళిబళి యని మెచ్చుచుండ, బేతాళుఁడు సంతోషించి మానిసిపీనుంగునుండి రాజుతో ని ట్లనియె. రాజా, ఏ విద్యాధరాధిపత్యమును ఈశ్రమణుఁడు కోరి యుండెనో, అది నీకు భూమండల సామ్రాజ్యభోగాంతంబున సంప్రాప్తించును. నిన్ను నేను తద్దయు నాయాసపెట్టితిని గావున నీవు కోరిన వర మిచ్చెద నడుగుము.' అంతట రా జి ట్లనియె:—'యోగీశ్వరా, నాయందు కరుణ గలవేని నాకు సిద్ధింపని మనోరథ మే ముండును! అయినను వట్టుగాని మాటవానిని నిన్ను ఈవర మడిగెద. నానాఖ్యాన మనోహరంబులయిన యీ ప్రశ్నకథలు ఇరువదినాలుఁగును, ఇరువదియేనవ దగునీ ముగింపుకథయు, ఇవి యన్నియు లోకములో ప్రఖ్యాతంబులై పూజింపఁబడు చుండును గాక.'

ఇట్లు రాజు వేఁడఁగా బేతాళుఁడు 'అట్లే యగుఁగాక, విశేషము చెప్పెద వినుము. ఈలోకములో ఈతొలియిరువది నాలుగుకథలును, ముగింపుకథయు, మొత్తమీయిరువదియైదు కథలవరుస బేతాళపంచవింశతిక యను పేరం బ్రసిద్ధి నొంది

పూజార్హమై మంగళప్రదం బగును. ఇందు ఒకశ్లోకము నేనియు ఆదరముతో నెవ్వఁడు వచించునో, ఎవఁడు వినునో ఆయిరువు రును తత్క్షణమే పాపవిముక్తు లగుదురు. వీనిని చెప్పెడుచోట యక్ష బేతాళ కూష్మాండ డాకినీ రాక్షసాదులు ఏమియు చెఱుపు సేయఁజాలరు' అని వచించి ఆనరకళేబరమును వదలియోగ మాయచే తన యిచ్ఛ వచ్చిన చోటికిం బోయెను.

అంతట మహేశ్వరుఁడు తుష్టుఁడై దేవగణ సమేత ముగా నచటికి వచ్చి రాజునకుఁ బ్రత్యక్షమై యాతని ప్రణా మం బంది యిట్లానతిచ్చెను.—'వత్సా, నీవు చేసినపని సరి, విద్యాధర మహాచక్రవర్తిత్వమును సాధింప హోమము చేసిన యీకపట తాపసుని చంపితివి. నీవు భూమిలో నవతరించిన యసురలం బరిమార్చుటకై నాయంశమున నేను సృజించిన వాఁడవు. కావున నీవు ద్వీపములతోను పాతాళముతోనుం గూడ నీభూలోకమును వశపఱుచుకొని విద్యాధరమహా చక్రవర్తి వగుదువు. చిరకాలము దివ్యభోగము లనుభవించి విరక్తి నొంది స్వబుద్ధిచేతనే వానిని మాని తుదకు నాసా యుజ్యముం బొందెదవు. ఇందము, అపరాజిత మనుపేరియీ కత్తిం బుచ్చుకొమ్ము. దీని ప్రభావంబున ఈచెప్పిన భాగ్యము నెల్లం బొందుదువు.' ఇట్లు పలికి ఖడ్గోత్తమము నిచ్చి మహేశ్వరుఁడు రాజుచే పూజలు గొని అంతర్ధాన మాయెను. విక్రమార్కుఁడు తన నగరికిం జనియెను. అచట ప్రకృతులు

ఆతని రాత్రిచర్య నెల్లం గ్రమంబుగా నెఱింగి మహోత్సవములు సల్పి యాతనిం బూజించిరి. ఆతండును ఆదినము స్నాన దాన శివారాధన నృత్త. గీత వాద్యాదికంబులం గడపెను. అనంతరము శివఖడ్గప్రభావంబున కొలఁది దినములలోనే ఆ రాజు ద్వీప పాతాళ సహితముగా మహీచక్రమెల్లను గెలిచి యేలి, తుదను హరాజ్ఞచే విద్యాధర చక్రవర్తిత్వమునుపొంది, చిరకాల మనుభవించి, పిమ్మట భగవత్సాయుజ్యముం బొందెను

బేతాళపంచవింశతిక ముగిసినది.

